


Cream of Creams




Rainbow Cup

Vanilla

Mango Ball

Royal Cassatta

Santra Mantra

Santadue

రాయలసీమ

THRUPTHI ASSOCIATES

Plot No.F-9, Industrial Estate, Proddatur-516 362.
Kadapa Dt., A.P. Tel. 08564-250636 Fax : 08564-258465

కోస్తా ఆంధ్రా

THRUPTHI FOODS

Depo II - D.No. 1-3/18-35, Vidyadharapuram,
Vijayawada. Tel. 0866-6530156, Cell. 9849991235

తెలంగాణా

THRUPTHI MARKETING

Depot : D.No. 138, Sri Krupa Market, Malakpet,
Hyderabad-36. Tel. 040 - 65181115 Cell.9849991257

JOY

ఆంధ్రప్రదేశ్ అంతటా ఐస్‌క్రీమ్ సరఫరా చేయువారు

# THRUPTHI FROZEN FOODS

WANTED
DISTRIBUTOTRS
(డిస్ట్రిబ్యూటర్స్ లేని ప్రాంతాలలో)

visit us: www.thrupthijoyicecreams.com

యూనిట్ ఒక్కింటికి Rs. 1000/- లకే

# ఫిక్స్‌డ్ సిరామిక్ దంతాలు అమర్చబడును




**సిరామిక్ దంతాల కొరకు (Per Unit) రూ.4,000/-, రూ.3,000/-, రూ.2,000/- లేదా రూ. 1,500/- చెల్లిస్తున్నారా? అవసరం లేదు కేవలం రూ. 1,000/- లకే అంతర్జాతీయ ప్రమాణాలతో కూడిన ఫిక్స్‌డ్ సిరామిక్ దంతాలు అమర్చబడును.**

**ఇంత తక్కువ ధర అయితే తక్కువ క్వాలిటీ అనే అనుమానం రావటం సహజమే!**

**సాధారణంగా ల్యాబ్ ఛార్జస్ ముంబాయి, ఢిల్లీ వంటి నగరాల్లో సైతం సుమారు రూ. 500/- నుండి రూ. 700/- వరకు వుంటాయి.**

గత 5 సం॥లుగా విజయవాడ, హైదరాబాద్, విశాఖపట్నం, నెల్లూరు, వరంగల్, ఒంగోలు, తిరుపతి వంటి నగరాలలోని ప్రముఖ దంత వైద్యులెందరికో మేము మా సొంత ల్యాబ్‌లో కేవలం రూ. 600/-లకే (ల్యాబ్ చార్జస్) VITA (జర్మని) సిరామెక్ మెటీరియల్‌తో సిరామిక్ దంతాలను తయారుచేసి అందిస్తున్నాము. ఇప్పుడు నేరుగా పేషెంట్‌కే ఈ బెనిఫిట్ అందించే విధంగా కేవలం రూ. 1000/- లకే అత్యుత్తమ నాణ్యతా ప్రమాణాలతో విజయవాడలోని మా దంత వైద్యశాలలో ఈ అవకాశం కల్పించబడినది.

**రూ. 1000/-లకే వేరే వారు సైతం అందించవచ్చు! కాని**

**ధరతో పాటు నాణ్యతా ప్రమాణాలను సరిచూసుకోండి:**

- M.D.S. Prosthodontist (కట్టుడు పళ్ల ప్రత్యేక వైద్యనిపుణుల)చే చికిత్స
- రబ్బరు మెటీరియల్‌తో కొలతలు, టెంపరరీ దంతాలు అమర్చుట,

# శ్రీ కృష్ణ డెంటల్ కేర్

షణ్ముఖ కాంప్లెక్స్, విజయా టాకీస్ ఎదురుగా, ఏలూరురోడ్, విజయవాడ. ఫోన్: 0866-6645454

నవ్య నవలా వేదిక

# చతుర

సంపుటి : 30 | సంచిక 6
జులై 2007 | 354 వ సంచిక

ఈ నెల నవల

కౄరుడైన భర్తకు విడాకులిచ్చి... తన నిస్వార్థ గుణంతో సంపన్న కుటుంబం బాధ్యతలను స్వీకరించి... మరో మహోన్నత వ్యక్తి ప్రేమను గెలుచుకున్న ఓ యువతి జీవితానికిఅక్షర రూపం...

ఎం. మాధవీ కృష్ణ నవల

## పొగడపూల దోసిలి

బొమ్మలు: భాస్కర్

10వ పేజీలో





# ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కేరళ వారి ప్రత్యేక చికిత్సలు!!

❖ త్రాగుడు మానండి! మాన్పించండి!! STOP ALCOHOL!!! ❖ చుండ్రు, జుట్టు రాలుట, పేను కొరుకుడు, బట్టతల! నెరసిన జుట్టు!! ❖ ఉబ్బసం, ఎలర్జీ వ్యాధులు ❖ సంతానము లేని దంపతులకు సంతానోత్పత్తి కణాలు తక్కువగా ఉన్న మగవారికి కణాలలో కదలిక (Motility) లేనివారికి స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదల కాకపోవుట, అండవాహికలు (FALLOPIAN TUBES) ముడుచుకొని పోవుట, ఎండోమెట్రియాసిస్, ❖ అన్ని రకముల గర్భకోశ వ్యాధులకు రసాయన, వాజీకరణ పద్ధతుల ద్వారా చికిత్స చేయబడును. ❖ స్త్రీల తెలుపు, ఎరుపు వ్యాధులు, బహిష్టు నొప్పిరుతుక్రమము సక్రమముగా లేకపోవుట. ❖ గర్భాశయ వ్యాధులకు గర్భసంచి తీసివేయకుండా (ఆపరేషన్ లేకుండా) ❖ ఆకర్షణీయమైన అందమునకు మొటిమలు, నల్లని మచ్చలు, మంగు, పొడ పొక్కులు, ముడుతలు ❖ నూతన యవ్వన శక్తికి, శీఘ్రస్కలనము, నపుంసకత్వము (IMPOTENCY) రతిమధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొని పోవుట, వృషణములు శుష్కించిపోవుట. ❖ సుఖవ్యాధులు, వ్రణములు, పుండ్లు, సవాయి, కొరుకుడు, గనేరియా, సిఫిలిస్, గ్లీట్ షాంక్రాయిడ్, హెర్పిస్ (HERPES) ❖ స్తనముల బిగువుకు, జారిన (వాలిన) మెత్తని, చిన్నగానున్న స్తనముల సైజును పెంచి, గట్టిగా, గుండ్రముగా స్త్రీలను అందముగా కనబడునట్లు చేయును. ❖ స్త్రీలకు పొత్తి కడుపుమీద గోకిన గీతలు, చారలు (SCRECH MARKS) పోవుటకు. ❖ మలబద్ధకము ❖ గ్యాస్ ట్రబుల్, ఎసిడిటి, అల్సర్స్, ❖ రక్త మొలలు, ఆర్శ మొలలు ఫిషర్స్, భగందరము (ఆపరేషన్ లేకుండా) ❖ చర్మవ్యాధులు, గజ్జి, జిల, దురద, ఎలర్జీ, దద్దుర్లు, తామర, చర్జీ, విసర్పి ❖ పులిపిర్లు, ఆనెలు ❖ సోరియాసిస్ (PSORIASIS) ❖ బొల్లి (LEUCODERMA) ❖ కుష్టు (LEPROSY) ❖ స్థూలకాయము (OBESITY) (NODIET, NOEXERCISE) సన్నగా, బలహీనముగా నుండువారు, బరువు, లావు పెరుగుటకు, (ఎత్తు పెరుగుటకు 21 వయస్సు లోపలవారు) ❖ మధుమేహము, షుగరు (DIABETES MELLITUS) అతిమూత్రము (DIABETES INSIPIDUS) ❖ షుగరు వలన మానని గాయములు, పుండ్లు, అల్సర్స్, గాంగ్రీన్ వంటివి మాన్పించుటకు ❖ రక్తపోటు (BP)అల్ప రక్తపోటు (LOW BP) ❖ పక్షవాతము (PARALYSIS) ❖ కీళ్ళు, కండరాల నొప్పులకు, కీళ్ళవాతము, నరములవాపు, మెడనొప్పి, తుంటి నొప్పి, సయాటిక, నడుము నొప్పి, వెన్ను నొప్పి ❖ మూర్ఛ, అపస్మారకము (FITS) (EPILEPSY) ❖ రాజక్షయ, క్షయ (PULMANARY TUBERCULOSIS) ❖ అండవృద్ధి - గిలక (HERNIA) (ఆపరేషన్ లేకుండా) ❖ వరి బీజము - బుడ్డ (HYDROCELE) (ఆపరేషన్ లేకుండా) ❖ పళ్ళ నొప్పులు, చిగుళ్ళ నుండి రక్తము, చీము కారుట, పుప్పి పళ్ళు, పళ్ళు కదలుట, పళ్ళు పచ్చగా నల్లగా రంగు మారుట, నోటి దుర్వాసన ❖ ముక్కు నుండి రక్తము కారుట ముక్కులో కంతులు (NOSAL POLIPS) (SINUSITIS) (ఆపరేషన్ లేకుండా) ❖ చెవిపోటు, చెవిలో చీముకారుట, చెవుడు, చెవిలో హోరు శబ్దము (ఆపరేషన్ లేకుండా) ❖ కంటి శుక్లములు (CATARACT) హ్రస్వదృష్టి, దీర్ఘ దృష్టి, దృష్టి మాంద్యము (ఆపరేషన్ లేకుండా) ❖ లివర్ వ్యాధులు, లివరు గట్టి పడుట (CIRRHOSIS) లివరులో పుండు (ABSCESS) లివర్ వాచుట, నొప్పి, వేడి, మంట మరియు పచ్చకామెర్లు (HEPATITIS, A,B,,NONA, NONB) మొ॥ ఒక వైరస్ వలన సంక్రమించిన కామెర్లు, ప్లీహము వాచుట (ENLARGE SPLEEN) ❖ మూత్రపిండముల వాపు (NEPHRITIS) మూత్రావయవములలో రాళ్ళు (RENALCOLIC & URINARY CALCULUS) ❖ మూత్రము వెళ్ళునపుడు మంట నొప్పి, రక్తము పోవుట, పిత్తాశయములో రాళ్ళు (STONES IN GALLBLADER) ❖ క్లోమ గ్రంధి యందు రాళ్ళు (STONES IN PANCREASIS) ❖ ప్రొస్టేటు గ్రంధివాపు (ENLARGEMENT OF PROSTATE) ❖ గుండె నొప్పి గుండెదడ, గుండె రక్తనాళముల నుండి రక్తము సరిగా అందకపోవుట ❖ థైరాయిడ్ సమస్యలు (THYROID) ❖ ముసలితనం లేకుండా చేసి వయస్సును నిలుపుటకు ❖ నత్తిని తగ్గించుటకు ❖ జ్ఞాపక శక్తిని పెంచుటకు ❖ చనుబాలు వృద్ధి చెందుటకు ❖ స్త్రీల శరీరం పై వచ్చు అవాంచిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు ❖ HIV/AIDS, CANCER/LUKEMIA, ALZHEIMERS, SCHIZOPHRENIA.

**అన్నిరకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.**

# కేరళ ఆయుర్వేద వైద్యశాల

**ఓడియన్ 70MM థియేటర్ దగ్గర, రెమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, రూపాని టెక్స్‌టైల్స్ పైన, చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్-20 ఫోన్: 65526109, 9866155109, 9392355590**

**Note:** పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు ఉత్తరాల ద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు పోస్టల్ ఛార్జీ రూ॥ **60/-** కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి.

**Timings: 10 A.M to 8 P.M Sunday 10 A.M to 2 P.M**

కాలాతీతం

# ది బ్రదర్స్ కరమ జోవ్

(1880)



ఫ్యోదొర్ దొస్తోయేవ్‌స్కీ

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయవేదిక

స్కోటోప్రిగోనిమెస్క్ గ్రామంలో నివసించే ఫ్యోదొర్ కరమ్‌జోవ్ పెద్ద భూస్వామి. దుర్వ్యసనాల పుట్ట. నలుగురు ఎదిగిన కొడుకులున్నా అలవాట్లు మాత్రం మార్చుకోడు. మొదటి భార్య సంతానం డిమిటి(మిత్యా), రెండో భార్యకు ఇవాన్, అలెక్సీ- నవలలో యితణ్ణి 'అల్యోషా'గా సంబోధిస్తారు. వీళ్లుగాక మరొక అక్రమ సంతానం స్మెర్ద్యాకోవ్. అందరూ యువకులే.

మిత్యా కొంతకాలం సైన్యంలో పనిచేసి తిరిగి వచ్చాడు. తనను ఆపదనుండి కాపాడిన జనరల్ కూతురు కొటెరినా ఇవనోవ్నా కృతజ్ఞతగా అతణ్ణి పెళ్లి చేసుకోవటానికి అంగీకరించింది. కాని మిత్యాకన్నీ తండ్రి బుద్ధులే వచ్చాయి. కొటెరినాను అవమానించి ఆమె ముందరే అనేకమంది వేశ్యలతో బాహాటంగా తిరిగాడు. మరికొన్నాళ్లకు, ఒక పోలీస్ ఆఫీసర్ ఉంపుడుకత్తె గ్రూషెంకాతో పిచ్చి ప్రేమలో పడ్డాడు.

ఇవాన్‌కు యిరవైనాలుగేళ్లు. జర్నలిస్టుగా పైకొస్తున్నాడు. ఇరవయ్యేళ్ల అల్యోషా సన్యాసిగా బతకటానికి సిద్ధపడి మొనాస్టరీలో ట్రెయినింగు తీసుకుంటున్నాడు.

అయితే అదో వింత కుటుంబం. వాళ్లను చూసిన వాళ్లెవరూ తండ్రీ కొడుకులనుకోరు.

"నేనే వెళ్ళేవాణ్ణి. కాని అర్జెంటు పని వచ్చిపడింది. చెర్మాష్న్యా (ఒకవూరు) కెళ్లి కొంత ఆస్తిని అమ్మకానికి పెట్టి రా" అన్నాడు తండ్రి, రెండో కొడుకు ఇవాన్‌తో ఒకనాడు.

ఆ అర్జెంటు పనేమిటో అందరికీ తెలుసు.

పెద్దకొడుకు మిత్యా ప్రేమించిన గ్రూషెంకాను తనకే కావాలనుకుంటున్నాడు ఫ్యోదొర్. బహుశా 'కోడలు' అనే

భావనే అతడి కోరికలను మరింత ప్రేరేపించిందేమో! సిగ్గు విడిచి, ఒక్క రాత్రికే వెయ్యి రూబుల్లిస్తానని కూడా చెప్పాడామెతో. తండ్రిమీద కోపంతో, అసహ్యంతో రగిలిపోతున్నాడు మిత్యా.

"ఈ లోకంలో అనాకారి స్త్రీలుండరు. మీరంతా యింకా పాలుతాగే శిశువులు. ఈ విషయాల్ని అర్థం చేసుకోలేరు. ఏ ఆడదాన్ని చూసినా నా నెత్తురు పరుగులు తీస్తుంది" అంటూ వాళ్ల తల్లులతో తను గడిపిన శృంగార జీవితాన్ని పిల్లలముందే వర్ణించేవాడు ఫ్యోదొర్.

ఇలాంటి మాటలు వాళ్ల మనసుల్ని ఎంత గాయపరుస్తాయో కూడా అతడూహించలేదు.

"నేను కుర్చీలో కూర్చున్నప్పుడు మీ అమ్మ వచ్చి మీదకు వంగి..."

"నాన్నా, ఆపు ఆ వాగుడు" అంటూ బిగ్గరగా అరిచాడు అల్యోషా. మొహం ఎర్రబడింది. ఒళ్లంతా చమట పట్టి కళ్లు తేలేశాడు. ఉద్వేగాన్ని ఆపుకోలేక, తండ్రినేదో చెయ్యటానికి లేచి, వశం తప్పి కిందబడి కాళ్లూ చేతులూ కొట్టుకున్నాయి మూర్ఛరోగిలాగ.

"ఇవాన్ త్వరగా నీళ్లు తీసుకురా, వీడికేదో అయింది. అంతా అమ్మ పోలికే. ఉద్రేకం తట్టుకునే శక్తిలేదు" అంటూ వెకిలిగా నవ్వాడు ఫ్యోదొర్.

"నేను కూడా ఓ అమ్మ కొడుకునే. నువ్వు మనిషివా, పశువ్వా" అంటూ కోపంగా తండ్రి మీదికురికాడు ఇవాన్.

సరిగ్గా అప్పుడే బైట ఏదో చప్పుడైంది. మూసివున్న తలుపును బలవంతంగా తెరిచి, బలిష్టమైన యిరవై ఎనిమిదేళ్ల యువకుడొకడు లోపలికి దూసుకు వచ్చాడు.

"అయ్య బాబోయ్, మిత్యా వచ్చాడురోయ్. నన్ను చంపేస్తాడు" అంటూ పొలికేక పెట్టాడు ఫ్యోదొర్.

కాని మిత్యా వచ్చింది తండ్రి కోసం కాదు.

"అదెక్కడ దాగింది? ఇటు రావటం నేను చూశాను. నన్నెలా తప్పించుకుంటుందో చూస్తాను' ' అంటూ యిల్లంతా కలయచూశాడు. అన్ని గదులూ వెదికి, "ఎక్కడ దాచారో చెప్పండి!" అంటూ తండ్రినీ, తమ్ముళ్లనూ నిలదీశాడు.

సుమారు వెయ్యి పేజీలున్న ఈ పుస్తకం, దొస్తోయేవ్స్కీ రాయదలచుకున్న నవలా మాలికలో మొదటిభాగం మాత్రమే. 1881లో హఠాన్మరణం సంభవించకుంటే మరెన్ని సంపుటాలు వెలువడేవో తెలియదు. ఏదేమైనప్పటికీ, ప్రపంచ సాహిత్యంలోని అత్యుత్తమ నవల యిదేనంటారు సాహిత్యకారులు. మంచి నవలల్లో కథ ముఖ్యం కాదు. జీవిత తాత్వికతను అన్వేషించిన క్రమం పాఠకుల్లో కొత్త వెలుగు నింపుతుంది.



## ఫ్యోదొర్ దొస్తోయేవ్‌స్కీ (1821-1881)

దుర్భరమైన కష్టాలలో కూడా "జీవితమే ఒకవరం" అని నమ్మాడు దొస్తొయేవ్‌స్కీ. మనుషులు నేరాలు చేస్తారు. పాపకూపాల్లో బతుకుతారు. తోటివాళ్లను హింసిస్తారు. గుండెలవిసేలా రోదిస్తారు. పశ్చాత్తాపాలతో కుమిలిపోతారు. చివరకు మిగిలేవి జ్ఞాపకాలు. ఈ రౌరవ నరకాన్ని అనుభవించినవాళ్లు మాత్రమే జీవిత పరమార్థాన్ని గ్రహించగలరు. ఇదీ దొస్తోయేవ్‌స్కీ రచనల్లో అంతర్లీనంగా సాగే అన్వేషణ.

పదహారేళ్లప్పుడే తల్లి మరణించింది. మాస్కోలోని సెయింట్ మేరీ హాస్పిటల్లో సర్జన్‌గా పనిచేస్తున్న తండ్రి, దొస్తొయేవ్‌ను సెయింట్‌పీటర్స్ బర్గ్‌లోని మిలిటరీ ఇంజనీరింగ్ అకాడెమీలో చేర్పించాడు. కాని చదువు ఖర్చులు భరించలేదు. పుస్తకాలకూ, ఫీజులకూ, రోజువారీ అవసరాలకూ డబ్బుల్లేక కష్టాలకూ, అవమానాలకూ అలవాటుపడ్డాడు దొస్తోయేవ్.

మొత్తంమీద కోర్సు పూర్తిచేసి, మరో రెండేళ్లకు యుద్ధ మంత్రిత్వశాఖలోని ఇంజనీరింగ్ డిపార్ట్‌మెంట్‌లో వుద్యోగం సంపాదించాడు. అప్పటికి తండ్రిని ఎవరో హత్య చేశారు. కొంత ఆస్తి కలిసి వచ్చింది. ఏడాదికి మూడువేల రూబుళ్ల జీతం. మంచి ఇల్లు అద్దెకు తీసుకుని విలాసంగా గడిపాడు. రోజూ జల్సాలు. తాగుడు, పేకాట కాని, ఏడాదికే వుద్యోగం మొహంమొత్తింది. 'నిస్సారమైన జీవితం' అని రాసుకున్నాడు. అయితే అప్పటికే అప్పులు పెరిగిపోయాయి. తన జీవితకాలంలో అప్పుల వలనుండి బయటపడలేదు దొస్తోయేవ్‌స్కీ.

అకాడమీలో వున్నప్పుడే తొలి నవల, బహుళ పాఠకాదరణ పొందిన "పూర్ ఫోక్" (బీదజనం) రాశాడు దొస్తోయేవ్‌స్కీ. పబ్లిషర్లు యింటిముందర క్యూ కట్టారు. అందరి దగ్గర అడ్వాన్సులు తీసుకున్నాడు. ఖర్చులు హద్దు మీరడంతో మనశ్శాంతి కరువైంది. ఆరోగ్యం పాడైంది. డబ్బు తీసుకున్నందుకు ఏదో ఒకటి రాశాడు. కాని అదంతా చెత్త. ఆకాశానికెత్తినవాళ్లే యిప్పుడతణ్ణి చూసి హేళన చేశారు. 'పూర్‌ఫోక్' నిజంగా రాసింది ఇతడేనా అని సందేహం వ్యక్తం చేసినవాళ్లూ లేకపోలేదు.

కొంతమంది సోషలిస్టులతో కలిసి నిషిద్ధ కార్యకలాపాలలో పాల్గొన్నందుకు

"నాకు తెలియదు. ఇవాన్! అల్యోషా! రక్షించండిరా బాబు" అంటూ లేచి పెరట్లోకి పరిగెత్తాడు ఫ్యోదొర్.

"నిన్ను పట్టుకోవడం ఎంత సేపు. ఇక్కడ కూర్చో. తప్పించుకోవటానికి ప్రయత్నిస్తే నిజంగానే చంపేస్తాడు. రారా ముసలాడా" అంటూ అరిచాడు ఇవాన్.

గ్రూషెంకా కోసం అల్మారాల వెనకా, మంచాల కిందా వెదికిన మిత్యా, తండ్రి కూర్చున్న సోఫా కూడా ఎత్తి బోర్లా పడేశాడు.

"అదిగో, నా డబ్బులు తీసుకుంటాడు రోయ్" అంటూ కొడుకును ఆక్షేపించాడు ఫ్యోదొర్.

"ఛీ. నీ డబ్బు తగలెయ్య. నీ లాంటి దుర్మార్గుడు చచ్చినా బాగుండు!" అంటూ దగ్గరకు వచ్చిన తండ్రిని వెనక్కు తోశాడు మిత్యా.

దొస్తొయేవ్‌స్కీని 28 ఏప్రిల్ 1849 నాడు అరెస్టు చేశారు. దీర్ఘ విచారణ తర్వాత మరణశిక్ష కూడా విధించారు. కాని చివరి క్షణంలో అధికారులు దాన్ని కఠిన కారాగార శిక్షగా మార్చి సైబీరియా తరలించారు. తన 'ది హౌజ్ ఆఫ్ ది డెడ్'లో జైలు పరిస్థితులను కళ్లకి కట్టిన ట్టుగా వర్ణించాడు దొస్తొయేవ్‌స్కీ. ఈ జీవితమే అతన్ని అంతర్ముఖుణ్ణి చేసింది. బైబిల్ తప్ప మరో పుస్తకం చదివే అవకాశం లేదక్కడ. తన అహం భావం, విచ్చలవిడితనం, సుఖలాలసతల పర్యవసానమిది. పశ్చాత్తాపానికి మించిన శిక్ష లేదు. విప్లవభావాలు ఆవి రైనాయి. జారు చక్రవర్తికి విధేయత ప్రకటించి జైలుగేటు దాటాడు. అప్పటికే అతణ్ణి మూర్ఛరోగం (ఎపిలెప్సీ) పట్టు కుంది.

1857లో తను ప్రేమించిన స్త్రీని పెళ్లి చేసుకున్నాడు. ఆమెకది రెండో పెళ్లి. మళ్లీ పుస్తకాలు రాయచ్చు కాని, నేరస్థులు తమ రచనలు ప్రచురించాలంటే ప్రభుత్వ అనుమతి కావాలి. సంసారం సజావుగా నడవాలంటే మళ్లీ అప్పులు చేయక తప్పని పరిస్థితి. ప్రభుత్వ కరు ణాకటాక్షం కోసం అతను చెయ్యని పని లేదు. **(ఇంకావుంది)**

కొడుకు అంత దురుసుగా ప్రవరిస్తాడని వూహించని ఫ్యోదొర్ వెల్లకిలా పడ్డాడు. తల మంచంకోడుకు కొట్టుకుంది.

"అయ్యో గాయమైంది. నిజంగానే చంపుతావా ఏమిటి" అంటూ తండ్రిని లేపాడు ఇవాన్.

"అంత అదృష్టమా? పాపీ చిరాయువు. ఈసారి వచ్చినప్పుడు ఆ పని కూడా ముగిస్తాలే" అంటూ గ్రూషెంకా అన్వేష ణలో పరిగెత్తాడు మిత్యా.

పనిమనిషి గ్రెగొరీ వృద్ధ యజమాని తలకు కట్టుకట్టాడు. అప్పటిదాకా వంటింట్లో నక్కిన స్మెర్ద్యాకోవ్ వచ్చి భోజనం రెడీగా వుందని చెప్పాడు. (అతడా యింట్లో వంట మనిషి)

"నేను అడ్డుపడకపోతే మిత్యా అన్నంత పనీ చేసేవాడే" అన్నాడు ఇవాన్.

"మనకలాంటి ఆలోచనలే రాకూడదు. ఎంత చెడ్డా మన తండ్రి" అన్నాడు అల్యోషా.

"నాకైతే తప్పేమీ కనిపించదు. పాము లను మింగే పాములుండవా? ఇదీ అంతే"

మరికాసేపటికి అల్యోషా తన ఆశ్రమా ని(మొనాస్టరీ)కి బయల్దేరాడు.

ఫ్యోదొర్ నిద్రపోయాడు.

తండ్రిని గురించే ఆలోచిస్తూ కూర్చు న్నాడు ఇవాన్.

దిగులుగా, చేతులు నలుపుకుంటూ వచ్చిన స్మెర్ద్యాకోవ్, "ఈ యింట్లో నాకు భయంగా వుంది. ఎప్పుడేం జరుగు తుందో తెలియదు" అంటూ తన గోడు వెళ్లబోసుకున్నాడు.

నిజమే. ఒక రకంగా వీడు తన తమ్ముడే కాని ఏం చెయ్యటం?

"ఇద్దరూ యిద్దరే. పోనీ, మిత్యా అంటే యువకుడు. ఈ ముసలాడి కింత ఆడ పిచ్చి ఎందుకు చెప్పు! అందులోనూ కొడుకు యిష్టపడిన పిల్లే కావాలా! ఛీ ఛీ. చెప్పుకుంటే సిగ్గు. వీళ్ల గొడవ భరిం చలేక నేను చస్తున్నాను. కాట్ల కుక్కల్లా పోట్లాడుకోవటం ఎప్పుడు మానేస్తారో తెలియదు. డబ్బుల కోసమైనా మిత్యా ఏదో ఒకనాడు ఈయన్ను హత్య చెయ్యటం ఖాయం.

**(ఇంకా ఉంది)**

**- ఎం. వసంత**



# పొగడపూల దోసిలి

అద్భుతమైన సౌందర్యం, అంతులేని అనురాగం, అణకువ, సహనం, సహృదయం ఆమె స్వంతం. 'చైతన్యను పొందినస్త్రీలు నిజంగా అదృష్టవంతులు. ఇక్కడ పిల్లలతో అనుబంధం ంచుకున్నట్లే అక్కడ తల్లి ప్రేమకు దూరం కాబోతున్న ఇద్దరు చిన్నారులను చేరదీసి వాళ్ళ జీవితానికి ఓ గమ్యాన్ని చూపిస్తే నీ జన్మ సార్థకమైనట్లే' అన్న ఓ శ్రేయోభిలాషి మాటలను అంగీకరించి ఆ రకంగా నడుచుకుందామె. ఆ గమనంలో ఎదురైన ఎన్నెన్నో ఒడుదొడుకుల్ని ఆత్మస్థైర్యంతో ఎదిరించి గెలిచిందామె. తన జీవితాన్ని నందనవనంగా మార్చుకోవటమేగాక తనను నమ్ముకున్నవారి జీవితాలనూ అందంగా తీర్చిదిద్దగలిగింది.

ఆసక్తికరమైన కథాకథనాలతో సాగిన ఎం. మాధవీ కృష్ణ నవల 'పొగడపూల దోసిలి' ఈ నెల చతుర సమర్పిస్తున్న సమగ్ర నవల.



'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ'

రూర్కి... ఐ. ఐ. టి. యూనివర్సిటీ క్యాంపస్‌లో నేమ్‌బోర్డు అందంగా మెరుస్తోంది. ఎం. బి. ఎ. ఫైనల్ ఇయర్ స్టూడెంట్స్ అంతా ఆ రోజు కొత్త డ్రస్సుల్లో వెలిగి పోతున్నారు. నెలరోజుల ప్రిపరేషన్ హాలీడేస్ తర్వాత మళ్లీ కాలేజి మొదలైంది. ఇంకో నాలుగు రోజుల్లో మొదలవుతున్న ఫైనల్ ఎగ్జామ్స్ ఉద్విగ్నత కొంత కలిగిస్తుంటే ఈ రోజు జూనియర్స్ ఇచ్చే సెండాఫ్ పార్టీ ఉత్సాహాన్ని పెంచుతోంది.

కొందరి చేతుల్లో ఫ్లవర్ బొకేస్... మరికొందరి చెవుల్లో మొబైల్ ఫోన్స్.. గుంపులు గుంపులుగా నిలబడి కాలేజి ఆవరణలో మాట్లాడుకుంటున్నారు. ఇంకొంతమంది బిజీగా అటూ, ఇటూ తిరిగేస్తున్నారు. 'యవ్వనం' మనిషికి దేవుడిచ్చిన వరం. ఆ వయసులో వుండే ఉత్సాహం, అది చేసే సందడి వారిని ఓ చోట నిలవనియ్యడంలేదు. వీళ్లందరికీ దూరంగా మరికొంతమంది స్టూడెంట్స్... ఆటోగ్రాఫ్‌లు, అడ్రస్‌లు ఒకరి డైరీల్లో ఒకరు రాయించుకుంటున్నారు.

ఆ కాలేజి క్యాంపస్‌కి ఆరు కిలో మీటర్ల దూరంలో వున్నాయి అపార్ట్‌మెంట్స్ కొన్ని.

అక్కడి అయిదో అంతస్తులోని ఓ ఫ్లాట్ లో -

"ఏంట్రా ఈ కవర్...? " ఊర్నించి వచ్చి బట్టలన్నీ తీసి సర్దుతున్న వినయ్ నడిగాడు కృష్ణ. రూర్కెలా యూనివర్శిటీలోనే ఎం. బి. ఎ. చేస్తున్నారు వారిద్దరూ. వినయ్ పేదకుటుంబానికి చెందినవాడని తెలిసి, తన రూమ్‌లోనే వుంచుకున్నాడు కృష్ణ. అప్పట్నించీ ఇద్దరూ మంచి స్నేహితులైపోయారు.

"అది నీలాంటి వాళ్ళు చూడతగ్గది కాదులే..." కవర్ పక్కన పెట్టేస్తూ అన్నాడు వినయ్.

మనిషి ఎప్పుడైనా నెగిటివ్ విషయాలకే త్వరగా రెస్పాండవుతాడన్నది నిజం. వెంటనే రియాక్టయ్యి కవర్ చేతిలోకి తీసుకున్నాడు కృష్ణ.

ఆగిపోయిన అతన్ని "చూడు.." అన్నాడు వినయ్.

అందులో ఓ అందమైన అమ్మాయి ఫొటో...పద్దెనిమిదేళ్ల పరువంలో లంగా, ఓణీల్లో పొగడపూల చెట్టు కింద నిలబడి ఓణీ చెరుగు రెండు చేతుల్తో పట్టుకుని... ఆకాశంవైపు చూస్తూ... నవ్వుతోంది. పైనుంచి జాలువారుతున్న పూలు ఆమె కొంగులో పడుతున్నాయి. చుట్టూ నేల మీద పొడవైన తెల్లని పూలు పరుచుకుని వున్నాయి.

ఈ లోకంలో వున్న సంతోషమంతా తనదే అన్నట్లు మెరుస్తోంది ఆమె మోము. కొద్దిగా లంగా ఎత్తి పట్టుకోవటంతో అందంగా మెరుస్తున్న పాదాలకు మెరుస్తున్న కాలి పట్టీలు... పొందిగ్గా వున్న రూపం.. చూస్తున్న కృష్ణకు గుండె గొంతుకలోకి వచ్చి కొట్టుకున్నట్లైంది. మనసు మధుకలశం కావటం అంటే ఏంటో తొలిసారి అనుభవంలోకి వచ్చింది అతనికి.

ఎంతోమంది అందమైన హై సొసైటీ ఆడపిల్లల మధ్య చదువుకుంటున్నా, మొదటిసారి అతని మనసు దోచుకుంది ఆ ఫొటోలోని వన్నెచిన్నెల మైనా.

"మా అత్తయ్య జానకమ్మ ఆడపడుచు కూతురట. ఇంకా సంబంధాలు చూడ్డంలేదు. కానీ ఏవైనా మంచివివుంటే చెప్పమని... అమ్మ చేతికిమ్మని ఇచ్చింది. నేను మర్చిపోవటంతో నాతోపాటు ఆ కవర్ ఇక్కడికి చేరింది" చెప్పున్నాడు వినయ్.



# విలువైన స్థిరాస్థిపై పెట్టుబడి!

## భవిష్యత్తు తరాలకు అధిక రాబడి

అధునాతన పద్ధతిలో ప్రణాళికాబద్ధంగా
రూపుదిద్దుకుంటున్న ప్రెస్టీజియస్ వెంచర్స్

**సాయిదుర్గ**
విజయవాడ - హైదరాబాద్ హైవే ప్రక్కన, మూలపాడు వద్ద, విజయవాడ.

ఉడా లేఅవుట్

**సాయిశంకర్**
NH-5 దగ్గర, లింగాయపాలెం సమీపమున, గుంటూరు.

**స్టార్ సిటి**
కందుకూరునుండి శ్రీశైలం హైవే దగ్గరలో, అంతర్జాతీయ విమానాశ్రయానికి, రాజీవ్ నానోటెక్ పార్క్, ఐ.టి. పార్క్, ఫ్యాబ్‌సిటి, ఇన్ఫోసిస్, ఔటర్ రింగ్ రోడ్‌లకు సమీపమున.

**గ్రేటర్ సిటి**
మహేశ్వరం, అంతర్జాతీయ విమానాశ్రయం, రాజీవ్ నానోటెక్‌పార్క్, ఫ్యాబ్‌సిటి, హార్డ్‌వేర్ పార్క్, అప్పేరల్ పార్క్ ఔటర్ రింగ్‌రోడ్‌లకు దగ్గరలో

<u>ప్రత్యేకతలు :</u> • 100% వాస్తు • గ్రావెల్ & బ్లాక్ టాప్‌రోడ్స్ • విద్యుత్ • భూగర్భ డ్రైనేజి సదుపాయం • గెస్ట్ హౌస్ • అవెన్యూ ప్లాంటేషన్ • ఓవర్ హెడ్ మంచినీటి ట్యాంకు • ట్రీ గార్డ్స్ • బ్యూటీఫుల్ గార్డెన్ • పార్కు • టెంపుల్ • ఆటస్థలం • స్కూలు • కమ్యూనిటీ హాల్ తదితర అవసరాలకు స్థలం కేటాయింపు

**బుకింగ్స్ జరుగుచున్నవి**

KALYANI ADS. 98499 83669, 95



## సాయిచైతన్య హౌసింగ్ ప్రై.లిమిటెడ్

* బ్రాంచి ఆఫీస్ : స్వర్ణప్రభ కాంప్లెక్స్, 11/2, అరండల్‌పేట, గుంటూరు-522 002. ఫోన్స్: 0863-2213636, 2261414
* హెడ్ ఆఫీస్ : ఫ్లాట్ నెం.311, అన్నపూర్ణ బ్లాక్, ఆదిత్య ఎన్‌క్లేవ్, అమీర్‌పేట, హైదరాబాద్- 16. ఫోన్స్ : 040-66847889, 66846899
* బ్రాంచి ఆఫీస్ : 9-132, 3వ అంతస్తు, సాయివిజయ టవర్స్, సాయిబాబా గుడి దగ్గర, దిల్‌షుఖ్‌నగర్, హైదరాబాద్. ఫోన్స్: 24151729, 24151739
* బ్రాంచి ఆఫీస్ : అలంకార్ థియేటర్ కాంప్లెక్స్, 2వ అంతస్తు, గాంధీనగర్, విజయవాడ-3. ఫోన్స్: 0866-2576277, 2576477

అతనేం చెప్పాడో కృష్ణ మనసు ఆలకిం చలేదు.

"ఇచ్చెయ్యరా బాబు... నీలాగా ఇంటర్నే షనల్ స్కూల్స్ కాదు. మామూలు గవ ర్నమెంట్ స్కూల్ లెవెలే" ఫోటో తీసుకో బోతూ అన్నాడు వినయ్.

వాళ్లిద్దరి అంతస్తుల తేడా తెలిసినవాడ వడంతో కృష్ణ తల్లిదండ్రులు ఇలాంటి సంబంధాలు ఒప్పుకోరన్నది వినయ్ ఆలో చన.

తన మాటలు పట్టనట్లు ఫొటోనే మైమ రిచిపోయి చూస్తున్న కృష్ణని ఆశ్చర్యంగా చూశాడు వినయ్. "నిజంగా నీకు అంత బాగా నచ్చిందా...?" అడిగాడు.

"ఊఁ..." తల వూపాడు.

"మరి... మీ మమ్మీ, డాడీ..."

"వాళ్లతో నువ్వే మాట్లాడాలి..."

"కానివ్వు... వచ్చేనెల మేనేజ్‌మెంట్ ట్రైనింగ్‌కి విదేశాలకు వెళుతున్నావు కదా... నువ్వు కోర్సు పూర్తి చేసుకొచ్చేటప్ప టికి ఓ దారి ఏర్పాటు చేస్తా" చెప్పాడు వినయ్.

"థాంక్స్ రా..." సంతోషంగా చేతులు పట్టుకున్నాడు కృష్ణ.

"పదరా బాబూ... టైమవుతోంది. దివ్య లోకాల్లో విహరించింది చాలు..." కృష్ణ భుజం తడుతూ, ఇద్దరూ లిఫ్ట్‌లో గ్రౌండ్ ఫ్లోర్ కొచ్చారు.

అక్కడ వుంది ఓ కాన్ఫరెన్స్ హాల్. ముప్పాతిక భాగం వెహికల్ పార్కింగ్‌కి వదిలిపెట్టి ఓ కొద్దిపాటి స్థలంలో చిన్న హాలు కట్టించాడు ఆ బిల్డింగ్ ఓనర్. అప్పుడప్పుడు సేవాసంస్థల మీటింగ్‌లకు, సత్సంగాలు అంటూ స్వామీజీల ప్రసంగా లకు ఆ హాలు వరకు ఫ్రీగా ఇస్తుంటాడు ఆయన.

ప్రస్తుతం లోపల ఏదో ఉపన్యాసం జరు గుతోంది.

ఆ రూమ్‌కి ముందు భాగంలో వేలాడ దీసి వున్నాయి తెల్లటి బ్యానర్లు.

"సుఖబోధానంద స్వామికి సుస్వాగతం" అంటూ హిందీలో ఉన్నాయి అక్షరాలు.

"మైండ్ రిలాక్సేషన్ క్లాసెస్" అంటూ టైమింగ్స్ కూడా ఓ పక్కగా రాశారు.

లోపల కొద్దిగా ఎత్తైన స్టేజిలాంటి దాని మీద కాషాయ వస్త్రధారి అయిన స్వామీజీ కూర్చుని ఉన్నారు. ఆయన కెదురుగా నేలపై... ఓ నూట యాభైమంది వరకు... ఆడా, మగా బాసింపట్లు వేస్కుని నిశ్శబ్దంగా కూర్చుని ఉన్నారు.

కిటికీల్లోంచి లోపలి దృశ్యం కనిపి స్తుంటే... "ఒక్క నిమిషం" అంటూ అటు దారి తీశాడు కృష్ణ.

"పద... టైమవుతుంది" వినయ్ చెప్తుంటే, "ష్..." అతనికి సైగ చేస్తూ ముందుకి నడిచాడు.

అతన్ని అనుసరిస్తూ తనూ కిటికీ దగ్గ రకు చేరాడు వినయ్.

"టచ్ యువర్ ఐస్..." రెండు అరచే తులూ పైకెత్తి కళ్లని తాకి చూపిస్తూ అన్నారు స్వామీజీ. అందరూ అలాగే చేశారు.

"ఫీల్ ఇట్, సే వావ్..." అన్నారు స్వామీజీ.

"వావ్" అన్నారు అందరూ.

"టచ్ యువర్ ఇయర్స్... టచ్ యువర్ నోస్..." స్వామీజీ చెప్తుంటే అందరూ వాళ్ల శరీర భాగాలను టచ్ చేస్కోసాగారు.

"మీకు ఆ అవయవాలు ఉన్నాయనే భావాన్ని సంతోషంగా అనుభవించండి. సే వావ్..." చెప్తుంటే అందరూ మరో మారు "వావ్" అనసాగారు పెద్దగా.

అలాగే భుజాలను, చేతులను, హృద యాన్ని, పొట్టని తాకిస్తూ అందరితో "వావ్" అనిపిస్తున్నారు స్వామీజీ.

"చూశారా... భగవంతుడు మనకి ఎన్ని సహజమైన అవయవాలు ఇచ్చాడో... ఎప్పుడూ అది లేదు, ఇది లేదు... ఏదో తక్కువయింది అంటూ బాధ పడు తుంటాం. హెల్త్ ఈజ్ వెల్త్ అన్నారు పెద్దలు. ఉన్న దానితో సంతోష పడ కుండా..." స్వామీజీ ప్రసంగం హిందీలో మృదు గంభీరంగా సాగిపోతుంది.

"కృష్ణా... ఎక్కు..." కరిష్మా స్టార్ట్ చేస్తూ అన్నాడు వినయ్.

అతను ఏదో ట్రాన్స్‌లో ఉన్నవాడిలా అలా నిలబడిపోయి ఉన్నాడు.

"ఏయ్... వాట్ హేపెండ్...?"

కపడా నేనే. ఊ... టచ్ యువర్ హార్ట్..." సీరియస్‌గా చెప్పాడు వినయ్.

కృష్ణ అరచేత్తో హృదయం మీద టచ్ చేస్కున్నాడు.

"ఆ అమ్మాయి ఉందా అక్కడ...? సే వావ్... ఫీల్ ద లవ్..." గంభీరంగా అన్నాడు.

"వావ్..." చేత్తో రుద్దుకుంటూ అన్నాడు కృష్ణ.

"పద..." ఇద్దరూ నవ్వుకుంటూ కాలేజీకి బయల్దేరారు.

కరిష్మా కాలేజిలోకి



## పన్నెండు కథల అనుభవం నాది

ఎం.ఏ. పాలిటిక్స్, డిప్లొమా ఇన్ సివిల్, డిప్లొమా ఇన్ కంప్యూటర్స్, అమెచ్యూర్ రేడియోలో గ్రేడ్ 11 నా విద్యార్హతలు. హిల్ స్టేషన్ చిక్‌మగళూరులో నివాసం. నా అనుభవం పన్నెండు కథలు మాత్రమే. మొదటి కథ ఏప్రిల్ 2006 లో ప్రచురితమైంది. ఆంధ్రభూమి వార, మాస పత్రికల్లో, స్వాతి, విపులలలో నా రచనలు ప్రచురితమయ్యాయి. ఆంధ్రభూమి నిర్వహించిన 30 వసంతాల కథలపోటీల్లో 'తొలి కానుక' బహుమతి గెల్చుకుంది. శ్రీవారు రామకృష్ణ ప్రోత్సాహం కథావ్యాసంగానికి తోడ్పాటు. పాతికేళ్ళ క్రితం బ్రెయిన్ ట్యూమర్ బారిన పడి విల్ పవర్‌తో జీవన పోరాటాన్ని సాగిస్తున్న నాన్నకు, ఆయన సహచరిగా సహకారాన్ని అందిస్తున్న అమ్మకు నా తొలి నవల అంకితం.

- ఎం. మాధవీ కృష్ణ


చిరునామా :
ఎం. మాధవీ కృష్ణ
**W/o.** ఎం. రామకృష్ణారావు
అంబికా సా మిల్,
రాంపురా (పోస్టు),
చిక్‌మగళూరు - 577133
కర్ణాటక.


"ఏం లేదురా... ఆ స్వామీజీ మాటలు వింటుంటే..."

"ఊc సన్యాసం తీసుకోవాలనిపిస్తోందా...? నీకేం నాయనా... మీ డాడీ కోట్లు సంపాదించి పెట్టారు. నువ్వు ఏ దారిలోకి మళ్ళినా ఫరవాలేదు. నా పరిస్థితి అది కాదు. రేపట్నుంచీ మా వాళ్లకి రోటీ,

ప్రవేశిస్తుండగానే వినయ్ కళ్ళు చుట్టూ వెతకసాగాయి.

వెనుక కూర్చున్న కృష్ణ వినయ్ భుజం తట్టాడు "అటు చూడు..." అంటూ. అక్కడ అశోక చెట్లనీడలో నిలబడి ఉంది లెమన్ ఎల్లో చుడిదార్‌లో ఉన్న ఖ్యాతి.

ఆ అమ్మాయి చూపులూ వినయ్‌నే పరి

కించటం చూశాడు కృష్ణ.

"ఏమిట్రా లవ్వా? నేనూ చూస్తున్నాలే నీ అవస్థలు..." అన్నాడు కృష్ణ. తన చూపులను, ఆలోచనలను కృష్ణ పసిగట్టి నందుకు ఒక్క క్షణం సిగ్గు పడ్డాడు వినయ్. "అబ్బే... ఏదో ఊరికే" నసి గాడు.

బైక్ పార్క్ చేస్తుండగానే దగ్గరికొచ్చింది ఖ్యాతి.

"క్యారీ ఆన్" వినయ్‌తో చెప్పి ముందుకి నడిచాడు కృష్ణ.

ఇండియన్ తండ్రికి, జర్మనీ తల్లికి పుట్టిన ఒక్కగానొక్క మరాఠీ అమ్మాయి ఖ్యాతి.

తల్లి జర్మనీ స్త్రీ అయినా, ఇండియాకొచ్చి ఇక్కడే కాపురముండటంతో... ఇంట్లో పాటించే భారతీయ సంప్రదాయాల వలన ఖ్యాతి వ్యవహారాలలో తేడా ఉండదు.

"మీతో మాట్లాడాలి" వినయ్ పర్మిషన్ అడుగుతూ చెప్పింది.

"పదండి..." క్యాంటీన్ వెనుక ఉన్న పచ్చని లాన్ వైపు చూపిస్తూ అన్నాడు.

అసలే కాలేజి అంతా కోలాహలంగా, సందడిగా ఉంది. ఇప్పుడు... ఈ టైమ్‌లో తమ ఇద్దరినీ ఎవరైనా చూస్తే టీజ్ చేయటం ఖాయం అనుకుంటూ ముందుకు నడిచాడు.

చెట్ల నీడన పచ్చికలో కూర్చున్నారు ఇద్దరూ.

ముందుగా ఖ్యాతి నోరు తెరిచింది. "టూ ఇయర్స్‌గా మనిద్దరం ఈ కాలేజీలో ఒకరికొకరం పరిచయమే. సమ్ కెమిస్ట్రీ ఈజ్ దేర్ బిట్వీన్ అజ్..."

ఆమె ఏం చెప్పబోతుందో ఊహించిన వినయ్ గుండె దడదడా కొట్టుకోసాగింది.

నుదుట అలుముకున్న చెమటను కర్చీ ఫ్‌తో అద్దుకున్నాడు.

"అయామ్ కమింగ్ టు ది పాయింట్. మీరంటే నాకిష్టం. ఐ థింక్ వి బోత్ ఆర్ ఇన్ లవ్ విత్ ఈచ్ అదర్... ఈ రోజు తప్పితే ఈ అవకాశం రాదని..." చెప్పా ల్సింది అయిపోయినట్లుగా రిలీఫ్ ఫీల య్యింది ఆమె.

సన్నని స్వరంతో స్వచ్ఛమైన హిందీలో ఆమె చెప్పిన పలుకులు వినయ్ మదిలో చిరు గంటలు మోగించాయి.

"నేను... కొద్దిగా ఆలోచించుకోవాలి" గొంతు పెగుల్చుకుంటూ చెప్పాడు.

రెండేళ్లుగా అతని చూపుల్లోని ఆరాధన గుర్తించిన ఆమె కొద్దిగా ఆశ్చర్యపడింది.

"నేనంటే మీకిష్టం లేదా...?" ఆమె గొంతులో బాధ తొంగి చూసింది.

"అహఁ... అదీ... ఇంట్లో పెద్దవాళ్ళు ఏక్సెప్ట్ చెయ్యాలి కదా..."

అతని ఆలోచనా విధానానికి ఆమెకి సంతోషం కలిగింది. ఫరవాలేదు. బాధ్యత గల యువకుడు. తన సెలక్షన్ బాగుంది అనుకుంటూ సంతోషించింది.

"నేను ఊరెళ్ళాక మీకు ఇన్ఫార్మ్ చేస్తాను" అంటూ అడ్రస్ కార్డ్స్, ఫోన్ నంబర్స్ ఖ్యాతి దగ్గర తీస్కున్నాడు.

"బట్, ఐ టూ లవ్ యూ..." చివరి మాటగా చెప్పాడు.

ఆమె బుగ్గల్లో నునుసిగ్గులు మెరిశాయి. ఎర్రబడ్డ చెక్కిళ్ళవైపు చూస్తూ ఆమె చేతి వేళ్లని అందుకుని చిన్నగా నొక్కి వదిలే శాడు.

ఇద్దరూ కాలేజి క్యాంపస్‌లోకి నడిచారు.

అక్కడంతా గోలగోలగా వుంది. పాటలు పాడేవాళ్లు, జోక్స్ కట్ చేసేవాళ్లు, డ్యాన్సులు చేస్తున్నవాళ్లు... అంతా గందర గోళంగా వుంది.

మధ్యలో ఓసారి కృష్ణ వచ్చి అడిగి వె ళ్ళాడు వినయ్‌ని "కాయా...? పండా...?" అంటూ.

"ష్..." కళ్లతోనే గదిమాడు కృష్ణని.

ఓం శ్రీసాయిరాం

# పెట్టుబడి పదిలం
# నివాసం యోగ్యం

అధునాతన సాంకేతిక
పరిజ్ఞానంతో నిర్మాణం జరుగుతున్న

## అభినందన డైమండ్
## అభినందన గోల్డ్ - I & II

**NH-9 హైవే, గొల్లపూడి జంక్షన్, రామచంద్ర థియేటర్ దగ్గర, విజయవాడ.**

**2 & 3 BED ROOM FLATS**



ప్రత్యేకతలు :

- 100% వాస్తు, మార్బుల్ ఫ్లోరింగ్
- పుష్కలమైన మంచినీరు లభ్యం
- లిఫ్ట్, కార్ పార్కింగ్ • జనరేటర్ సౌకర్యం
- సెంట్రల్ గ్యాస్ • ఫైర్ సేఫ్టీసిస్టమ్
- సోలార్ సిస్టమ్ • మస్కిటో నెట్

**బుకింగ్స్ జరుగుచున్నవి**

**త్వరపడండి!**

**కొద్ది ఫ్లాట్స్ మాత్రమే కలవు**

మీ పెట్టుబడికి భద్రతతోపాటు
అనేక రెట్లు ఆదాయం పొందండి!!

సంప్రదించండి: ఆదిత్య, APO ✆ **99894 94555**

KALYANI ADS, 98499 83669



## అభినందన హౌసింగ్ ప్రైవేట్ లిమిటెడ్

- నవదీప్, చర్చి ఎదురుగా, బెంజ్ సర్కిల్, విజయవాడ. ఫోన్స్ : 6628668, 6628778
- బందరు లాకులు దగ్గర, గవర్నర్‌పేట, విజయవాడ. ఫోన్స్ : 6642428, 6642468
- బసవరామ కాంప్లెక్స్, 8/2, అరండల్‌పేట, గుంటూరు. ఫోన్స్ : 6641177, 6647799

ఫంక్షనంతా అయిపోతుంటే కొందరు స్టూడెంట్స్ కళ్ళు నీళ్ళు పెట్టుకున్నారు. మరీ బెస్ట్‌ఫ్రెండ్స్ అయితే ఒకర్నొకరు హగ్ చేసుకుంటున్నారు.

ఖచ్చితంగా టూ ఇయర్స్‌కి ఒకసారైనా కలవాలంటూ కొన్ని బ్యాచ్‌లు ప్రామిస్‌లు చేస్కుంటున్నారు. మీలాంటి వాళ్లను ఎంతమందిని



చూడలేదు అంటూ చిరుగాలికి ఆకులను కదిలిస్తున్నాయి నిలువెత్తు ఆశోక వృక్షాలు.

ఆ రాత్రి నిద్రపోకుండా బెడ్‌పై అటూ, ఇటూ దొర్లుతున్న వినయ్‌ని విషయమేంటని అడిగాడు కృష్ణ.

"ఈ రోజు ఖ్యాతి కలిసింది కదా…" నసుగుతూ చెప్తుంటే ఇక నిద్రపోయే ఛాన్స్ లేదని అర్థమై "పద, అలా బాల్కనీలో కూర్చుని మాట్లాడుకుందాం…" అంటూ లేచాడు కృష్ణ.

"ఊఁ ఇప్పుడు చెప్పు…" ఓ చెయిర్‌లో కూర్చుని ఎదుటి చెయిర్‌ని కాళ్ల కిందకి లాక్కుని బార్లా చాపుకుంటూ అడిగాడు.

"తను… ప్రపోజ్ చేసింది…" ఎంత స్నేహితుడైనా అతని ముందు కొద్దిగా సిగ్గుపడుతూ చెప్పాడు.



"నీ రెస్పాన్స్ ఏమిటి?"

"నాకూ ఇష్టమే… కానీ అమ్మావాళ్లు ఓ మరాఠీ అమ్మాయిని కోడలిగా ఏక్సెప్ట్ చేస్తారా… అని. పైగా ఖ్యాతి తల్లి ఓ ఫారినర్. ఈ విషయం తెలిస్తే ఇంట్లో ఒప్పుకోరనుకుంటా…" తన బాధంతో చెప్పాడు.

"మరి… ఖ్యాతి ఇంట్లో…?"

"వాళ్లు పెద్దగా అబ్జెక్షన్ చెప్పరంది. తన ఇష్టమే వాళ్ల ఇష్టమట"

"పోనీ, ఇంట్లో వాళ్లని ఎదిరించి పెళ్ళి చేస్కోండి. రెండేళ్లు పోయాక వాళ్లే సర్దుకుంటారు"

"లేదు కృష్ణా! వాళ్లు నామీదే ఆశలు పెట్టుకుని బతుకుతున్నారు. రేపట్నుంచీ తమ్ముళ్లిద్దరి స్టడీస్ బాధ్యత నాదే. వాళ్లని మరిచిపోయి, నా దారి నేను చూస్కోలేను. అలాగని ఖ్యాతిని మనసులోంచి తుడిచేయలేను" మనసు ద్వైదీభావంతో ఊగిసలాడుతుంటే చెప్పాడు.

"సారీ వినయ్… మీ ఇంటి పరిస్థితి తెలిసీ నీకిటువంటి సలహా ఇచ్చినందుకు" కృష్ణ నొచ్చుకున్నాడు.

"ఫరవాలేదులే… నా రాత ఎలా వుంటే అలా జరుగుతుంది. పద పడుకుందాం…" లేచాడు వినయ్.

"వినయ్… ఖ్యాతి ఫోన్ నంబర్ వుందా…?" సడన్‌గా ఏదో ఆలోచన వచ్చిన వాడిలా అన్నాడు కృష్ణ.

"ఏం…?"

"ఎగ్జామ్స్ అయ్యాక నేనూ, ఖ్యాతి మీ ఊరొస్తున్నాం" వినయ్ మొహంలో కంగారు కనిపించింది.

"భయపడకు. ఖ్యాతిని నా కజిన్‌గా పరిచయం చేద్దాం. వి విల్ ట్రై.

ప్రయత్నం లేకుండా, కష్టపడకుండా ఏదీ సాధ్యం కాదు. ఏమీ చేయకుండా ఊరుకోవటం కంటే, ఏదో ఒక దారిలో ప్రయత్నించి, సాధ్యం కానప్పుడే వదిలేద్దాం. ఏమంటావ్?" కళ్ళెగరేస్తూ అడిగాడు కృష్ణ.

వినయ్ మొహంలో వెలుగు కనిపించింది. వెంటనే ఖ్యాతికి ఫోన్‌చేసి హాలీడేస్‌లో వినయ్ వాళ్ల ఊరు రావలసిందిగా చెప్పారు.

★ ★ ★

"రా కృష్ణా... ఎన్నాళ్లకు చూశాను మళ్లీ...?" వినయ్ తల్లి ఆదరంగా పలకరించింది. వినయ్‌కి అన్నీ తానై చూస్కుంటున్న కృష్ణ ఆ కుటుంబ సభ్యులకు దేముడితో సమానమే.

ఖ్యాతిని కజిన్‌గా పరిచయం చేశాడు కృష్ణ.

కృష్ణని, ఖ్యాతిని తమ్ముళ్ళిద్దరికీ పరిచయం చేశాడు వినయ్. కృష్ణను గురించి, అతని మంచితనం గురించి ఫోన్‌లో వినటమే కానీ, ఎదురుగా చూళ్లేదు అతని తమ్ముళ్ళిద్దరూ. రెండ్రోజుల్లోనే అంతా బాగా కలిసిపోయారు.

సాయంత్రం వేళల్లో అందరూ కలిసి కేరమ్స్ ఆడటం... టి.వి.లో క్రికెట్ మ్యాచ్ చూడటం, మేడపైన వెన్నెల్లో చల్లని గాలికి కూర్చుని భోజనాలు చేయటం... గెస్ట్‌ల రాకతో కాలం సందడిగా గడిచిపోతుంటే వినయ్ తండ్రి కూడా సంతోషంగా వున్నాడు.

ప్రతి విషయంలోనూ హెల్పింగ్ నేచర్‌తో కనిపిస్తున్న ఖ్యాతి వినయ్ తల్లిని త్వరగానే ఆకట్టుకుంది.

ఓ రోజు కృష్ణతో చెప్పింది ఆవిడ, "ఎవరింటికి వెళుతుందో కానీ మీ ఖ్యాతి, నిజంగా వాళ్లు అదృష్టవంతులు" దూరాన నిలబడి చిన్నకొడుకులిద్దరితో మాట్లాడుతున్న ఖ్యాతిని చూస్తూ అంది ఆవిడ.

"కానీ, తనకంత అదృష్టం లేదనిపిస్తుందమ్మా..." సందర్భం వచ్చింది కాబట్టి మొదలెట్టాడు.

"ఏం బాబూ... ఏమైంది?" అడిగింది ఆవిడ.

"నిజానికి తను నా కజిన్ కాదమ్మా... మా క్లాస్‌మేటే. సెలవులు కాబట్టి నాలుగు రోజులు మాతోపాటు సరదాగా వుంటుందని, మన రాష్ట్రానికి వచ్చినట్లుంటుందని ఇక్కడికి తీసుకువచ్చాం. వాళ్ల నాన్న మరాఠీ. తల్లి జర్మనీ ఆవిడ. ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు. పాతికేళ్లుగా ఇండియాలోనే నివాసం వాళ్లది. ఆయన స్టీల్ ప్లాంట్‌లో ఇంజినీరుగా చేస్తున్నారు. చూశారుగా... ఆచార, సాంప్రదాయాలన్నీ మనవే నేర్పించారు. కానీ ఏం లాభం? తల్లి విదేశీయురాలని ఈ అమ్మాయికి ఎవరైనా అభ్యంతరం చెప్పరని గ్యారంటీ ఏమిటి? చూస్తుంటే తన పెళ్ళి విషయం అంత తేలికని నా కనిపించటంలేదు..." చెప్పవలసింది సగం మాత్రమే చెప్పి అక్కడ్నుంచి లేచి వెళ్ళాడు కృష్ణ.

ఖ్యాతి ఫ్యామిలీ గురించి తెలిశాక వీళ్లల్లో ఏమైనా మార్పు వస్తుందేమో... దాన్నిబట్టి ప్రొసీడవ్వచ్చు అనుకున్నాడు అతను.

వినయ్ తల్లి ఆలోచనలో పడిపోయింది.

"అసలు ఈ అమ్మాయి తమింటికెందుకొచ్చింది? వయసులో వున్న పిల్ల... ఇద్దరు కుర్రాళ్లతో ఇలా వచ్చిందంటే... కృష్ణ ఇష్టపడ్డాడా...? ఛ! కృష్ణని ఎప్పుడు చూసినా 'భయ్యా!' అనే పిలుస్తుంది. వినయ్...? ఆవిడకేదో ఫ్లాష్ కాసాగింది.

ఆంధ్ర దేశంలో ప్రతి ఇంటా ఉండదగిన

## పండిత శ్రీ బుట్టే వీరభద్ర దైవజ్ఞ

శ్రీ శ్రీశైల దేవస్థాన ఆస్థాన సిద్ధాంతిగారిచే గుణింపబడి, రచియింపబడిన

**110 సం॥ల భూత భవిష్యద్వర్తమాన**



# శతాబ్ది పంచాంగము

**మినీ జ్యోతిష కంప్యూటర్**

## 1941 నుండి 2050 వరకు

**5 నిముషాలలో మీ జాతక చక్రం రెడీ ! మీ జాతక చక్రం మీరేవేసుకోవచ్చు !**

✦ 110 సం॥లకు ప్రతిరోజు గ్రహచక్రములు ✦ రాబోయే 50 సం॥లకు ప్రతి రాశివార్కి జాతకఫలాలు ✦ ప్రతి సంవత్సరం సంభవించు సూర్య - చంద్ర గ్రహణములు ✦ ప్రతి సంవత్సరం గురు, శుక్ర మౌఢ్యములు ✦ ఇంకనూ ముఖ్య పండుగలు ✦ రాబోయే 2050 వరకు పుష్కరముల తేదీలు

**అన్నిబుక్‌షాపులందు లభించును** **వెల : రూ. 675/-**

మీ సమీపప్రాంతమునందు ఈపుస్తకం లభించనియెడల మమ్మల్ని సంప్రదించండి.

సెల్ : 98481 71785 , 9290099287

జాతక, వాస్తు, ముహూర్త విషయములకు సంప్రదించండి

## పండిత శ్రీ బుట్టే వీరభద్ర దైవజ్ఞ

డో.నెం. 79-2-4/3, తిలక్‌రోడ్, రాజమండ్రి - 3

ఫోన్ : (95883) 2469631

ఈ నాలుగైదు రోజులుగా వాళ్లిద్దరూ ఒక ళ్ళనొకళ్లు చూసుకుంటున్నప్పుడు వాళ్ల కళ్లల్లో కనిపించే ఆరాధన... పరవశం... కృష్ణకన్నీ తెలిసే తెచ్చాడా? ఎంత కోటీశ్వ రుల బిడ్డ అయినా తమలాంటి వాళ్లతో కృష్ణ మెలిగే తీరు, అతని వ్యక్తిత్వం, మంచితనం... ఆవిడకు చిరపరిచితమే. కృష్ణలాంటివాడు ఖ్యాతిని కజిన్‌గా చెప్పి తమ ఇంటికి తెచ్చాడంటే... ఇక ఆ అమ్మాయి గురించి ఆలోచించాల్సిన పని లేదన్నట్లే. ఇదే నిజమైతే... ఈ విషయం భర్తకెలా చెప్పాలి?

ఖ్యాతి పుట్టు పూర్వోత్తరాలు ఆ కుటుం బంలో ప్రభావం చూపించకపోవటంతో వాళ్లని ఒప్పించటం కృష్ణకి కష్టం కాలేదు.

"మీరిప్పుడు వద్దంటే ఆ అమ్మాయి తన దారిన తను వెళ్ళిపోతుంది. మీకు గౌరవం ఇవ్వబట్టే మీ మనసులు గెలుచుకోవాలని ఇంత దూరం వచ్చింది. వినయ్ అయినా మీ అభిప్రాయానికే తల ఒగ్గుతాడు. అంత పెద్ద చదువులు చదివి, రేపో మాపో ఉద్యోగస్థులు కాబోయేవాళ్లు మీ ప్రేమానురాగాలు వదులుకోటానికి సిద్ధంగా లేరు" అంటూ కృష్ణ చెప్పిన మాటలకు వాళ్లు సులభంగానే ఒప్పుకొ న్నారు.

అలాగే ఖ్యాతికీ ఆ కుటుంబంలో పెద్ద కోడలి హోదా అమరుతుండటంతో ఆమె తీసుకోవాల్సిన బాధ్యతల గురించి చెప్పాడు కృష్ణ.

"భయపడకండి భయ్యా! అంతదూరం నుంచి ఈ అమ్మాయిని తెచ్చి చేసుకున్నా మనే బాధ నా వల్ల ఈ కుటుంబానికి రాకుండా చూసుకుంటాను" అతను చేసిన మేలుకు చెమర్చిన కళ్లతో చెప్పింది.

తనవల్ల ఇతరులకు మేలు కలగకపో యినా, హాని జరగకూడదనేది కృష్ణ అభి మతం. ఖ్యాతి తల్లిదండ్రులు రావటం, అందరూ ఇష్టపడి ముహూర్తాలు పెట్టుకో వటం జరిగాయి.

"నేను మా ఊరు వెళ్ళి, పెళ్ళి టైమ్‌కి వస్తానురా... ఇప్పటికే మమ్మీ ఎదురు చూస్తుంది" అంటూ వినయ్‌కి చెప్పి బయ లుదేరాడు కృష్ణ.

చెప్పినట్లుగానే పెళ్ళి టైమ్‌కి హాజర య్యాడు కృష్ణ. అనుకున్నదానికన్నా పెళ్ళి సందడిగా జరిగింది. ఇరవైరోజుల క్రితం విడిపోయిన ఫ్రెండ్సంతా మళ్ళీ కలుసుకు న్నారు.

"ఇంత గ్రంథం ఎప్పుడు నడిపా వురా...? " అంటూ ఆశ్చర్యపోయి అడిగిన వాళ్లందరికీ నాదేం లేదన్నట్లు కృష్ణని చూపించాడు వినయ్.

"కృష్ణా... మన ఫైనల్ బ్యాచ్‌లో వున్న ఉదయ్... జూనియర్ బ్యాచ్‌లో వున్న రేఖ ప్రస్తుతం ఇదే పొజిషన్‌లో వున్నార్రా. వాళ్లని కూడా ఇలాగే కలిపి పుణ్యం కట్టుకోరా..." ఫ్రెండ్స్ రౌండప్ అయ్యి అడుగుతుంటే అందరికీ ఓ నమ స్కారం పెట్టాడు కృష్ణ.

"నన్నొదిలేయండ్రా బాబూ..." చేతులు జోడించి అతను అడుగుతుంటే అక్కడ నవ్వులు జల్లులై కురిశాయి.

వచ్చిన అతిథులంతా వెళ్ళిపోయి, కృష్ణ మాత్రమే మిగిలాడు. అతనూ బయల్దేర టానికి బ్రీఫ్‌కేసు సర్దుకుంటుంటే వినయ్ వచ్చి నిలబడ్డాడు.

"ఏమిట్రా... ఆ కళ్లు... ఎర్రబారి..." అతనివైపు చూసి అడిగాడు కృష్ణ.

"నువ్వు చేసిన మేలు... ఈ జన్మలో మరిచిపోలేను. అసలు ఖ్యాతి వచ్చి నాతో జీవితం పంచుకుంటుంది అనే ఊహ కూడా లేనివాడ్ని నేను. అటువంటిది ఇంత పెద్ద కార్యం నీ భుజాలమీద వేస్కుని... నీకెలా థ్యాంక్స్ చెప్పాలో అర్థం కావటంలేదు" స్నేహితుణ్ణి హగ్

# విజయవాడలో ప్లాట్లు




**ప్రత్యేకతలు :**

- 40 అడుగుల రోడ్లు
- మంచి నీరు
- ఎలక్ట్రిసిటి
- బైపాస్ హైవే
- కాంపౌండ్‌వాల్
- మెయిన్ గేటు
- అంబాపురం టౌన్‌షిప్
- కార్పొరేషన్ టౌన్‌షిప్

CONTACT :

వెంకట్ : 99898 85656
వెంకట్ రాజు : 99896 66618
సురేష్ రెడ్డి : 99498 88699
వీర్రాజు : 99896 66619
కె.వి.ఎల్.రాజు : 92464 14229

## సాయి చరణ్ హౌసింగ్

H.O : 26-7-16, గరికపాటివారి వీధి, సురేష్ మూవీస్ ఎదురుగా, గాంధీనగర్, విజయవాడ-3. ఫోన్స్ : 0866-3202414, 6454314.

B.O : 18-97, 3వ ఫ్లోర్, ప్లాట్ నెం. 308, రజని గంధ అపార్ట్‌మెంట్స్, చైతన్యపురి బస్‌స్టాప్ ఎదురుగా, దిల్‌సుక్ నగర్, హైదరాబాద్. ఫోన్స్ : 040-64554314, 64553314

చేస్కుంటూ అన్నాడు వినయ్.

"పెద్ద పదాలు వాడకు. మీ పేరెంట్స్ ఈ జనరేషన్‌కి తగ్గట్లుగానే వున్నారు. నువ్వే వాళ్లని సరిగ్గా అంచనా వేయలేకపోయావ్. అంతేకానీ, నేను చేసిందేముంది? ఇవిగో మీ హనీమూన్ టిక్కెట్స్. మీ పెళ్ళికి నా గిఫ్ట్" అంటూ వినయ్ చేతిలో పెట్టాడు.

"నీ రుణం ఎలా తీర్చుకోవాలిరా...?" హార్ట్‌ఫుల్‌గా అడిగాడు వినయ్.

"ఇలా..." బ్రీఫ్‌కేసు సైడ్‌జిప్‌లో వున్న ఫొటో లాగి చూపిస్తూ అన్నాడు కృష్ణ.

అందులో వుంది పొగడపూలను దోసిట్లో పట్టుకుంటున్న జిలుగువెలుగుల నయనతార.

"ఓహ్హో! నా హడావిడిలోపడి నీ విషయమే మరచిపోయాను. నువ్వు రేపేకదా బయల్దేరుతున్నావ్? నువ్వు ట్రైనింగ్ పూర్తిచేసుకొచ్చేటప్పటికి నీ పెళ్ళికి నేను అన్నీ సిద్ధం చేసి పెడతాను" ఉత్సాహంగా అన్నాడు వినయ్.

అలా... ఆ ఫొటో కృష్ణ దగ్గరే వుండిపోయింది.

అతను ఎబ్రాడ్ వెళ్ళి కోర్సు పూర్తిచేసుకొచ్చేటప్పటికి "సారీరా... ఆ అమ్మాయికి మేరేజ్ అయిపోయింది. ఇంత త్వరగా చేస్తారనుకోలేదు" మొహం వేళ్ళాడేసుకుని చెప్పాడు వినయ్. ఒక్క క్షణం హృదయం పట్టుతప్పిన భావన అతనిలో.

వినయ్ బాధను చూళ్లేక "ఇట్సాల్‌రైట్, లీవిట్..." పైకి తేలిగ్గా చెప్పాడు కృష్ణ.

తొలి వలపు... తొలిప్రేమ... లవ్ ఎట్ ఫస్ట్‌సైట్... మొహబ్బత్... కాదల్... ప్రీతి.. ఎన్ని భాషల్లో ఎన్ని పేర్లున్నా దాని తొలిపలకరింపు ఇచ్చే అనుభూతే వేరు.

గుండెల్ని ఛిద్రం చేస్తూ అది మిగిల్చే విషాద అనుభూతీ మరపురానిదే.

మరో ఆర్నెల్లకి అతనికి వేరే అమ్మాయితో పెళ్లయిపోయింది.

కానీ... తన హృదయాన్ని దోచుకున్న ఆ ముగ్ధమోహన మళ్లీ ఓ ఆరేడేళ్లకు తన జీవితంలో ప్రవేశిస్తుందని, తన మనసులో మరోసారి ఆమెకు చోటివ్వాల్సొస్తుందని అతనికి తెలీదు.

## 2



ఉదయం పది గంటలు కావస్తోంది. సూర్యుడు ప్రతాపం చూపించటం మొదలుపెట్టాడు. "దుర్గాంబ మెమోరియల్ హోమ్" బిల్డింగ్‌పైన నేమ్‌బోర్డు ఎండకి మెరుస్తోంది. జుయ్‌మంటూ వచ్చి ఆగింది ఆ బిల్డింగ్ ముందు బ్లాక్ కలర్ మెర్సిడస్ బెంజి కారొకటి. దాన్లోంచి దిగింది నలభై ఏళ్ల ప్రౌఢ ఒకామె. తెల్లగా మెరిసిపోతూ అందానికి, ఐశ్వర్యానికి ప్రతీకలా వుంది ఆమె. అప్పటివరకు ఎ.సి. కారులో కూర్చుని రావటం మూలానేమో కారులోంచి బయటికి దిగుతూనే మొహం చిట్లించింది.

"నువ్విక్కడే వెయిట్ చెయ్" డ్రైవర్‌కి చెబుతూ లోపలికి నడిచింది.

దాదాపుగా ఊరి బయట రెండెకరాల స్థలంలో ఉంది ఆ హోమ్. కాంపౌండ్ చుట్టూ పచ్చని కొబ్బరిచెట్లు, అక్కడక్కడా నీడనిస్తూ మామిడి, జామ, సపోటా లాంటి ఫలవృక్షాలు ఉన్నాయి. మరో పక్క చిన్న మడిలాగా చేసి రకరకాల కూరగాయలు వేశారు. అన్నింటి మధ్యా నాలుగు

వేల చదరపు అడుగుల్లో వుంది కట్టుబడి. ఆ వాతావరణం... ఆ పరిసరాలు మన సుకి ప్రశాంతతనిస్తున్నట్లున్నాయి.

"రా నందినీ..." ఆఫీసు గదిలోంచి ఆమెను చూసి వరండాలోకొచ్చి పిలిచింది కమలమ్మగారు.

"బాగున్నారా...? " చిరునవ్వుతో ఆవిణ్ణి పలకరిస్తూ లోపలికి అడుగుపెట్టింది నందిని.

ఆదివారం కావడంతో పిల్లలంతా కాంపౌండ్‌లోనే ఆడుకుంటున్నారు. "వీళ్లంతా అనాథలు" అనుకోగానే నందిని మనసు ఒక్కనిమిషం బరువెక్కింది. తర్వాత తేరుకుని -

"ఇంకా రాలేదా? " అడిగింది కమలమ్మ గారిని.

"వచ్చే టైమైంది... లోపలికి వెళ్దాం పద" అంటూ దారితీసింది ఆవిడ.

గంట గడిచిపోయింది. నందినిలో అస హనం... పోయిన ఆదివారం కూడా ఇలాగే చూసీ చూసీ వెళ్లిపోయింది తను.

"ఎప్పుడూ ఈ టైమ్‌కి వచ్చేస్తుంది" వాచి చూసుకుంటూ అంది కమలమ్మ గారు.

ఈలోపు బయట ఒక్క పెట్టున సందడి మొదలైంది. "హే... హే... స్రవంతక్క వచ్చేసింది" మొత్తం పిల్లలంతా ఆమెని చుట్టేశారు. అప్పటిదాకా ఒంటరిగా మెట్ల మీద కూర్చుని కళ్లల్లో ప్రాణాలు పెట్టుకుని ఆమె కోసం ఎదురు చూస్తున్న మూడేళ్ల తరుణ్ వచ్చీరాని మాటలతో, బుడిబుడి నడకలతో పరుగులు తీశాడు, "చవంతి వచ్చింది... చవంతి వచ్చింది" అంటూ.

పాలబుగ్గలతో ముద్దొస్తున్న వాడిని గభాల్న ఎత్తుకుంది ఆమె.

చుక్కల్లో చందమామలా వుందా

యువతి... పిల్లల మధ్య. దాదాపు ఇరవై నాలుగేళ్ల వయస్సు. నిండు ఆరోగ్యంగా, చూపులకు లక్షణంగా... కుదురుగా... నెమ్మదిగా వుంది. ఆ అమ్మాయిని చేసేట ప్పుడు పారిజాతపూలన్నీ నూరిపోసి చేశా డేమో ఆ బ్రహ్మదేవుడు అనేంత మృదు వుగా వుంది. లేత గులాబీ రంగు కాటన్ చీర పొందిగ్గా కట్టుకుని... రాకుమారి చెలి కత్తెలా మారి ఇలా సాధారణంగా వచ్చిం దేమో అన్నట్లుగా వుంది.

"పదండి..." పిల్లలందరి మీద చేతులు వేసి నిమురుతూ చెట్టుకిందకి తీస్కెళ్లింది స్రవంతి. మామిడి చెట్టు కింద నీడపట్టున చప్టాలా వేసిన గట్టుమీద చుట్టూ కూర్చు న్నారు పిల్లలు. స్రవంతి పక్కనే వున్న పదహారేళ్ల రవి వెంట తెచ్చిన పెద్దపెద్ద క్యారేజీలు గట్టుమీద పెట్టాడు.

అందులోంచి పులిహోర తీసి వెంటతెచ్చిన డిస్పోజబుల్ ప్లేట్లలో తలా కాస్త పెట్టి ఇచ్చింది స్రవంతి. మరో ప్లేట్లో కమలమ్మగా రికి, ఆయాలకి తీసి రవి చేతికిచ్చింది. వాళ్ల కివ్వటానికి లోపలికి వెళ్లినవాడు నీళ్లబా టిల్స్, మంచినీళ్ల గ్లాసులు చంకలో పెట్టు కుని రివ్వున పరుగెత్తుకొచ్చాడు.

"అక్కా! కమలమ్మగారు లోపలికి రమ్మంటున్నారు" గస పెట్టుకుంటూ అన్నాడు. మళ్లీ వాడే "ఎవరో వచ్చారు" గుసగుసగా చెప్పాడు.

"బయట కారుందిగా... వాళ్లేనేమో" అనుకుంటూ, "మీరంతా తింటూ ఉండండి" అని చెప్పి ఒళ్లోనే కూర్చోపెట్టుకుని తినిపి స్తున్న తరుణ్‌ని కిందికి దింపి తినమని చెప్పి లోపలికి నడిచింది.

"రెండేళ్లుగా ఇదే తంతు. ప్రతి ఆది వారం స్రవంతి కోసం పిల్లలంతా ఎదురు చూస్తూ వుంటారు. సాయంకాలంవరకు ఆమె ఆడించే ఆటలకు, చెప్పే కథలకు పిల్లలకు సమయమే తెలీదు", కిటికీలో నుండి స్రవంతినే గమనిస్తున్న నందినికి చెప్పింది కమలమ్మగారు.

"అమ్మా! లోపలికి రమ్మన్నారట..." వాకిట్లో నిలబడి అడిగింది స్రవంతి.

అరవైఏళ్ల వయస్సున్న కమలమ్మగారిలో వుండే హుందాతనం... మాట తీరు... దైవత్వం మూర్తీభవించినట్లున్న ఆ ముఖ లక్షణాలు చూస్తే ఎవరైనా ఇట్టే అమ్మా అని పిలుస్తారు.

"కూర్చో స్రవంతి" నందిని పక్క కుర్చీ చూపిస్తూ చెప్పింది కమలమ్మగారు.

"ఈవిడ నందిని అని... నేను టీచరుగా వున్నప్పుడు నా స్టూడెంటే. ఇరవై ఏళ్లుగా వీరి తల్లిదండ్రులు కూడా నాకు బాగా పరి చయం. ఈ హోమ్ నడవటానికి వీరు కూడా సగం కారణం. నందిని స్వంతంగా గార్మెంట్స్ ఫ్యాక్టరీ నడుపుతోంది. 'శుచి పికిల్స్' అని, మన రాష్ట్రంలోనే పెద్ద సంస్థ. అది వీరిదే" అంటూ పరిచయం చేసింది.

"నమస్తే" గౌరవం కోసం చేతులు జోడించింది స్రవంతి.

'ఇప్పుడు నన్నెందుకు పరిచయం చేస్తు న్నట్లు' అన్నట్లున్న స్రవంతి కళ్లలో ప్రశ్నా ర్థకాన్ని చూసి, "మీ పొలాలు, ఇళ్లు సీత మ్మపురంలో కదా... అక్కడ వీరికి బిజి నెస్ వ్యవహారాలేవో వున్నాయట. ఆ ఏరియా గురించి తెలిసినవాళ్లెవరైనా వుంటే వీళ్లకి కరెక్ట్ ఇన్ఫర్మేషన్ ఇస్తారు కదా... మీ అన్నయ్య అయితే సరిపోతుం దని నేనే ఇక్కడికి రమ్మన్నాను. నాకేమో మీ ఇంటి అడ్రస్సు సరిగ్గా తెలీదు. అందుకే ఇక్కడికే రమ్మన్నాను" చెప్పింది కమలమ్మగారు.

"ఇప్పుడు వస్తారా... అన్నయ్య ఇంట్లోనే వున్నాడు" నందినిని అడిగింది స్రవంతి.

"సరే... బయల్దేరదాం" తల వూపింది ఆమె.

కమ్మలమ్మగారి దగ్గర వీడ్కోలు తీసుకుని బయల్దేరారు ఇద్దరూ. అసలు విషయం చెబితే స్రవంతి నందినిని ఇక్కడే ఆపేస్తుందని భయం ఆవిడకి.

"భగవంతుడా! ఈ పిల్లకు ఓ మంచి దారి చూపించు" మనసులోనే స్రవంతి గురించి వేడుకుంటూ పనిలో పడిపోయింది ఆవిడ.

"అక్కా! వెళ్లిపోతున్నావా?" పిల్లలంతా ఒకేసారి అడిగారు.

"మళ్లీ ఓ గంటాగి వస్తాలే... అందాక రవి ఇక్కడే ఉంటాడు" వాళ్లకు చెప్పింది.

తన చీర కుచ్చిళ్లు పట్టుకుని లాగుతున్న తరుణ్‌ని చూస్తూ "మళ్లీ వస్తా నాన్నా... ఆడుకుంటూ వుండు" మరోసారి వాణ్ణి ముద్దుపెట్టుకుంటూ చెప్పింది.

అందర్నీ ఆశ్చర్యంగా చూస్తోంది నందిని. వీళ్లందరికీ ఎంత ప్రేమ ఈ అమ్మాయంటే... తనూ అలాగే ఉంది. ఏ రిలేషన్ లేకుండా ఇవన్నీ సాధ్యమా! బిజినెస్ రంగంలో పక్కవాళ్లందరినీ మట్టి కరిపిస్తూ టాప్ పొజిషన్‌కి చేరుకోవటం కోసం ఎత్తుకు పైఎత్తులు వేస్తూ ఎప్పుడూ డబ్బులు లెక్కచూసుకునే ఆమెకి తనది కాని లోకాన్ని కొత్తగా చూస్తున్నట్లు వుంది.

**బిజినెస్ రంగంలో పక్కవాళ్లందరినీ మట్టి కరిపిస్తూ టాప్ పొజిషన్‌కి చేరుకోవటం కోసం ఎత్తుకు పైఎత్తులు వేస్తూ ఎప్పుడూ డబ్బులు లెక్కచూసుకునే ఆమెకి తనది కాని లోకాన్ని కొత్తగా చూస్తున్నట్లువుంది.**

"సీతమ్మపురంవైపు పోనియ్" కార్లో స్రవంతితో పాటు కూర్చుంటూ డ్రైవర్‌కి చెప్పింది నందిని.

ఎండ నడినెత్తికొస్తుంటే కారు ముందుకు దూసుకుపోతుంది. ప్రశాంతంగా, గంభీరంగా కూర్చున్న నందిని వైపు పరికించి చూసింది స్రవంతి.

చెవులకు రెండు చిన్న ప్లాటినం డైమండ్ దిద్దులు, మెళ్లో సన్నని మంగళసూత్రం... ఎడం చేతికి రేడో వాచ్... కుడిచేతికి సన్నని గాజొకటి.... ఒంటిమీద రెండువేల రూపాయల విలువైన క్రేప్ సిల్క్ శారీ... ఒక రకంగా చాలా సింపుల్‌గా వుంది ఆమె. కానీ, ఆమెని చూడగానే ఆమె హోదా ఏదో అర్థమయ్యేట్లుగా వుంది.

"ఈమె ఐశ్వర్యానికి వన్నె తెచ్చిందా? సంపద వల్ల ఈమెకి అందం వచ్చిందా?" తన ప్రశ్నకు తనే నవ్వుకుంది స్రవంతి.

స్రవంతి దారి చూపిస్తుంటే విశాలంగా వున్న పెంకుటింటి ముందు ఆగింది కారు. ఆ ఇంటి చుట్టూ ఆకుపచ్చని చాప పరిచినట్లుగా వున్నాయి పొలాలు. నాట్లయిపోయి మొలకలొచ్చి దాదాపు ఐదంగుళాల ఎత్తున పెరిగి వున్నాయి వరిచేలు. ఎండ పొద్దైనా ఎప్పుడూ పొలాలకి నీళ్లు పెడుతూ వుండటంతో గాబోలు ఇక్కడ వాతావరణం చల్లగానే ఉంది అనుకుంది నందిని.

దాదాపు కనుచూపు మేర అక్కడో గుడిసె, ఇక్కడో గుడిసె తప్పితే చుట్టుపక్కల ఎక్కువగా ఇళ్లు లేవు. 'ఎంత బావుంది ఇక్కడ?' అప్రయత్నంగా అనుకుంది నందిని.

"లోపలికి రండి" స్రవంతి మాటలతో లోపలికి నడిచింది.

"కూర్చోండి. అన్నయ్యను పిలుస్తాను" కుర్చీ చూపిస్తూ లోపలికి వెళ్లింది.

విశాలమైన వరండా. పాతకాలం నాటి టేకు ఫ్రేము కుర్చీ... చుట్టూ చల్లని గాలి సేద తీరుస్తున్నట్లుగా... వరండాలో నుంచి వాకిటి ముందు విరగబూసిన కన

కాంబరం చెట్లు... ఎంతో ఆహ్లాదంగా వుంది నందినికి.

ఎన్నెన్నో దేశాలు తిరిగొచ్చింది ఆమె. దుమికిపడే నయాగరా జలపాతాల్ని, ఈఫిల్ టవర్ అందాల్ని, డిస్నీలాండ్‌లోని సరదాల్ని చూసి తన కెమెరాలో బంధించుకొచ్చింది. కానీ ఇక్కడ, ఈ ప్లేసు... నేటివిటీ... రక్తంలో జీర్ణించుకుపోయిన భారతీయత నందిని పెదాలపై చిర్నవ్వు మొలకెత్తింది.

లోపల్నుంచి ఓ యువకుడు కుడికాలి పాదానికి చిన్న కట్టుతో కుంటుకుంటూ బయటికి వచ్చాడు.

స్రవంతికన్నా ఐదారేళ్లు పెద్దవాడు శివరాం. చూడగానే స్రవంతికి అన్నయ్య అని చెప్పేట్లు ఉన్నాయి అతని ముఖకవళికలు. ఎత్తు, ఎత్తుకి తగ్గలావు... పొలం పనులతో కాయకష్టం చేసేవాడు కావటంతో శరీరం గట్టిపడివుంది.

"నమస్కారం... మీరు..." తను ఎదురుకుర్చీలో కూర్చుంటూ అడిగాడు.

"నా పేరు నందిని. మీతో పనిబడి వచ్చాను" చెప్పింది, స్రవంతి ఇచ్చిన మజ్జిగ గ్లాసు చేతిలోకి తీసుకుంటూ.

"చెప్పండి" అడిగాడు.

"కాలికేమైంది" ఉపోద్ఘాతంగా మొదలెట్టింది.

"పొలం దగ్గర మోటారు రిపేర్ చేస్తుంటే... చిన్న గాయం" సన్నగా నవ్వాడు అతను.

"మీ ఇంటికి రావాలని పోయిన వారమే ఆశ్రమానికి వచ్చాను. కానీ స్రవంతి అక్కడికి రాలేదు. కమలమ్మగారేమో ఆఫీస్ అడ్రస్ తప్పితే, ఇల్లు ఎక్కడో తెలీదన్నారు" చెప్పింది నందిని.

"ఈ కాలి గాయం వల్లనే ఈరోజు కూడా చెల్లి వెళ్లనంటే ... పిల్లలంతా ఎదురుచూస్తుంటారని నేనే పంపించాను" చెల్లెలి వైపు చూస్తూ అన్నాడు. "ఇంతకీ మీరొచ్చిన పని..." ఆగిపోయాడు.

లోపలికి వెళ్ళబోతున్న స్రవంతివైపు చూస్తూ "మీరూ... ఇక్కడే ఉండండి" చెప్పింది నందిని- మొదలుపెడుతూ.

"మేము వుండేది హైదరాబాద్‌లో. నా భర్త ఇంతకుముందు మెరైన్ ఇంజినీర్‌గా చేసేవారు. ఈ మధ్య వాలెంటరీ రిటైర్‌మెంట్ తీస్కుని నా బిజినెస్ వ్యవహారాలే తను కూడా చూస్కుంటున్నారు. మీరు వినే వుంటారు. ఆషిక్ గార్మెంట్స్ ఫ్యాక్టరీ గురించి, అది మాదే..." అసలు విషయం ఎలా చెప్పాలి అన్నట్లు ఆగిపోయింది.

"ఫరవాలేదు. చెప్పండి" అన్నాడు శివరాం.

"అమ్మ పోయి రెండేళ్లు కావస్తోంది. నాన్నగారు వ్యాపారాలన్నీ తమ్ముడికిచ్చి ప్రస్తుతం ఇంట్లో ఖాళీగా వుంటున్నారు. వాడి పేరు చైతన్య. 'చైతన్య గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్' అధినేత వాడు. మాకు ఈ మధ్య ఓ సమస్య వచ్చి పడింది. అది మీ ద్వారా పరిష్కారం అవుతుందనుకుంటున్నా" చెప్పింది నందిని.

"మీరు పొరపాట్న వచ్చారనుకుంటా. నేను చిన్నపాటి రైతుని. అమ్మా, నాన్నా చేతిలో పెట్టిన ఇరవై ఎకరాల మాగాణి, చెల్లెలు తప్పితే..." కంగారుగా చెప్పబోయాడు శివరాం.

నవ్వింది నందిని. "మాది ఆర్థిక సమస్య కాదు. వినండి" అంటూ మళ్లీ మొదలుపెట్టింది.

"తమ్ముడికిప్పుడు ముప్పైరెండేళ్ల వయస్సు. వాడికి పెళ్లై ఏడేళ్లు కావస్తోంది. ఈ ఊర్లోనే వుంటున్నారు. ఇద్దరు ఆడపిల్లలు వాడికి. కవలలు. నాలుగేళ్ల వయసుంది వాళ్లకి. నా మరదలు వసంత... చాలా మంచి అమ్మాయి. రెండేళ్లుగా జబ్బుతో బాధపడుతోంది. నెర్వ్ డిజార్డర్,

కాకినాడలో మొట్టమొదటి B.Sc. నర్సింగ్ కాలేజ్

# సాయి కాలేజ్ ఆఫ్ నర్సింగ్
# సాయి స్కూల్ ఆఫ్ నర్సింగ్

(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, డైరెక్టర్ ఆఫ్ మెడికల్ ఎడ్యుకేషన్, A.P. నర్సింగ్ కౌన్సిల్, Dr.N.T.R. యూనివర్సిటీ ఆఫ్ హెల్త్ సైన్సెస్ మరియు ఇండియన్ నర్సింగ్ కౌన్సిల్, న్యూఢిల్లీ వారిచే గుర్తింపు పొందినది)

ఆర్.టి.సి.కాంప్లెక్స్ వద్ద, హీరోహూండా
షోరూమ్ ఎదురుగా, **రాజమండ్రి**
ఫోన్: 0883-2440555, 2440666
Cell: 98850 18850

# 70-7-61/1, కృష్ణనగర్, కొత్త
ఆర్.టి.ఓ.ఆఫీసు దగ్గర, **కాకినాడ**
ఫోన్: 0884-2340333, 2341333
Cell: 98850 18850




**కోర్సులు:**

★ **B.Sc.** (నర్సింగ్) స్త్రీలకు మాత్రమే
అర్హత: ఇంటర్ Bi.P.C.లేదా M.P.H.W.పాస్

★ **జనరల్ నర్సింగ్** (GNM)
స్త్రీలకు మాత్రమే

అర్హత : ఇంటర్ ( ఏ గ్రూపైనా) మరియు M.P.H.W.పాస్

**S.C., S.T.,**
మరియు **B.C.-C**
విద్యార్థులకు
**స్కాలర్‌షిప్ సౌకర్యం**
మరియు
**ఫీజు రాయితీ** కలదు

★ అడ్మిషన్లు జరుగుచున్నవి ★ హాస్టల్ వసతి కలదు

మా వసతులను పరిశీలించి అడ్మిషన్ పొందగలరు.

కాళ్లు, చేతులు, క్రమక్రమంగా చచ్చుబడిపోయి మంచానికి అంటుకుపోయేలా చేసే రోగమది. డాక్టర్లు నెలో, రెణ్ణెల్లో అంటున్నారు. ప్రాణాలన్నీ పిల్లల మీదే పెట్టుకుని బతుకుతోంది.

చివరాఖరికి ఇప్పుడు తనకి తన జీవితం ముగుస్తుందన్న బాధకన్నా, పసిమొగ్గల్లాంటి బిడ్డల జీవితం ఏమవుతుందో అనే శంక పీడిస్తోంది. కోట్ల ఆస్తి- ఈ ఐశ్వర్యానికి ఆశపడి ఎవరైనా తన బిడ్డల్ని అనాథల్ని చేస్తారేమో అని భయపడుతూ ఉంది. పైగా ఇద్దరూ ఆడపిల్లలే! అందుకని..." చిన్నగా దగ్గుతూ ఆగింది నందిని.

సమస్య తమవరకూ ఎందుకు వచ్చిందో అర్థం అయ్యీ, కాకుండా వుంది శివరాంకి.

"అందుకే... తనుండగానే మా తమ్ముడికి మళ్లీ పెళ్లి చెయ్యాలని ఆశ పడుతోంది. తనే తగిన అమ్మాయిని తనింటికి తీసుకురావాలని కోరుకుంటోంది. ఆస్తిపాస్తుల మీద వ్యామోహంలేని సాదాసీదా మనిషికి తన స్థానాన్ని అప్పచెప్పాలని ఆమె ఆశ. మంచితనం, ఇతరులపట్ల ప్రేమ, త్యాగనిరతి ఉన్నవాళ్లయితే కానీ కుదరదని ఆర్నెల్లుగా చాలామంది అమ్మాయిల్ని చూశాము", స్రవంతివైపు తిరిగి చూసి చెప్పటం ఆపింది.

శివరాంకి, స్రవంతికి మంచుపొర లేవో విడిపోతున్నట్లుగా, నందిని ఉద్దేశం ఏంటో తెలుస్తున్నట్లుగా ఉంది. అన్నా చెల్లెళ్లిద్దరూ ఒకళ్ల ముఖాలు ఒకళ్లు చూసుకున్నారు.

"ఎక్కడెక్కడో అమ్మాయిల్ని వెతికాం. ఎంతోమందిని చూశాం. కానీ ఒక్కరికి కూడా మాకు కావలసిన అర్హతలు లేవనిపించింది. కమలమ్మగారు మా చిన్నతనం నుంచీ మాకు తెలుసు. మా అమ్మగారి దగ్గర చాలాసార్లు ఆశ్రమానికి డొనేషన్లు తీసుకువెళుతుండేవారు. అనుకోకుండా ఓ రోజు కమలమ్మగారితో నేనీ విషయం మాట్లాడటం, ఆవిడ ఆ లక్షణాలన్నీ



ఉన్న అమ్మాయి మీ స్రవంతి అని పదేపదే చెప్పటంవల్ల... నేను ఇప్పుడు మీ ఇంటికి వచ్చాను" అంది నందిని.

ఈసారి స్రవంతి నోరు విప్పింది "క్షమించండి. మీరు రాంగ్ అడ్రస్‌కొచ్చారు."

సన్నగా నవ్వింది నందిని.

"నువ్వీమాట అంటావనే... కమలమ్మ గారు అక్కడేమీ మాట్లాడకుండా... మీ అన్నయ్యతో మాట్లాడమన్నారు" అంది చనువు తీసుకుంటూ.

శివరాం మాత్రం ఏమీ మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయాడు.

బిజినెస్ ఉమెన్ అయిన నందినికి



అతని మౌనం వెంటనే అర్థం అయింది. మాట్లాడలేదు- అంటే అతను ఆలోచనలో పడ్డాడన్నమాట.

"మీరు బాగా ఆలోచించుకోండి. ఒకసారి మా ఇంటికి వచ్చి మా వసంతతో కూడా మాట్లాడండి. మీకు అన్నీ ఓ.కె.

అనుకుంటేనే మనం ప్రొసీడవుదాం. ఎందుకంటే ఇది జీవితాల సమస్య. కానీ మాకు మాత్రం మీ స్రవంతి లాంటి అమ్మాయి మళ్లీ దొరుకుతుందనే నమ్మకం లేదు" చెప్పింది నందిని కుర్చీలోంచి పైకి లేస్తూ.

ఆవిడ అంతగా చెప్తుందంటే, స్రవంతి గురించి కమలమ్మగారు ఎంత ఇదిగా చెప్పారో... అని ఆవిడపట్ల కృతజ్ఞతతో నిండిపోయింది శివరాం మనస్సు.

శివరాం చెల్లెలికి సైగ చేయటంతో స్రవంతి లోపలికి నడిచింది.

"కూర్చోండి... ఒక్కనిమిషం. ఎండన పడి వచ్చారు" అన్నాడు శివరాం. ఈ లోపు స్రవంతి ఓ ప్లేట్లో పులిహోర, మరో చేత్తో నీళ్లగ్లాసు పట్టుకొచ్చింది.

నందిని మొహమాటపడుతుంటే "ఇంత దూరం వచ్చారు. భోజనాల వేళైంది. మీరు ఇంటికి చేరేటప్పటికి ఇంకా లేటవుతుంది. కొద్దిగా ఎంగిలిపడి వెళ్లండి" అని ఆమెతో తినిపించాడు శివరాం.

"మీరే చేశారా...? బావుంది" అంది నందిని, స్రవంతి వైపు చూస్తూ.

స్రవంతి పెదాలపై చిన్న దరహాసం వచ్చి మాయమైంది. ఈ అమ్మాయి ఇలా సైలెంట్‌గా కాకుండా నవ్వుతూ వుంటే ఇంకా బాగుంటుంది అనిపించింది నందినికి.

తను తినేలోపు స్రవంతి ఇంకో ప్లేట్లో డ్రైవర్‌కి ఇచ్చి తినమనటం చూసింది ఆమె.

"ఇక బయల్దేరతాను" స్రవంతి పెట్టిన కుంకుమ, తాంబూలం అందుకుంటూ చెప్పింది.

"ఇది నా విజిటింగ్ కార్డ్. ఫోన్ నంబర్స్ ఉన్నాయి" అంటూ లేచి నిలబడ్డ శివరాం చేతికిచ్చింది.

"మీకు స్రవంతి గురించి..." ఆగాడు.

"అంతా తెలుసు. కమలమ్మగారు చెప్పారు" అంది నందిని.

ఆవిణ్ణి కారుదాకా సాగనంపాక వరండాలో నిలబడ్డ స్రవంతిని చూస్తూ "అమ్మలూ! నువ్వు భోజనం చేసి కాసేపు రెస్ట్ తీసుకో. నేను అలా మామయ్య దగ్గరికి వెళ్లొస్తాను" బయటినుంచే కేకేశాడు శివరాం.

ఛర్‌మంటూ కోపం కనిపించింది స్రవంతి మొహంలో. తమాయించుకుంటూ "తినేసి వెళ్లన్నయ్యా!" అంటూ చెప్పింది.

"వచ్చాక తింటానులే. రాముడూ... ట్రాక్టర్ బయటికి తియ్యరా..." దగ్గర్లోనే గుడిసెలో ఉంటున్న పాలేరు రాముణ్ణి కేకేశాడు.

"అన్నయ్యా..." గట్టిగా పిలిచింది స్రవంతి.

తిరిగి చూసిన శివరాంకి అక్కడే కుర్చీలో పెట్టిన నందిని విజిటింగ్ కార్డ్ని చించి ముక్కలుచేసి గాల్లోకి విసిరేస్తూ కనిపించింది.

నవ్వుకుంటూ ట్రాక్టర్ ఎక్కి కూర్చుంటున్న అతణ్ణి చూసి విసురుగా లోపలికి వెళ్లిపోయింది.

అక్కడికి రెండు ఫర్లాంగుల దూరంలో ఉంది శివరాం మేనమామ రాఘవయ్య ఇల్లు. ఆయనా వ్యవసాయదారుడే. ఒక్కగానొక్క కూతురు సునంద. డిగ్రీవరకు చదివింది. నలభై ఎకరాల మాగాణి, సొంత డాబా ఇల్లు, ఉన్నదాంట్లో శ్రీమంతుల స్థితి వాళ్లది.

గత నాలుగేళ్లుగా బావ ఎప్పుడు మెళ్లో తాళి కడతాడా అని ఎదురుచూస్తోంది సునంద. చిన్నప్పట్నించీ అనుకున్న సంబంధమే అయినా, కూతురికి పెళ్లి వయసు మీరుతోందని రాఘవయ్యకి గుబులుగా వుంది. మరోపక్క చెల్లెలి

జీవితం ఓ దారినపడితే కానీ, తను పెళ్లి చేసుకోనని ప్రతిజ్ఞ చేసినట్లు మంకుపట్టు పట్టి కూర్చున్నాడు శివరాం.

అందుకే రాఘవయ్య కూడా స్రవంతి జీవితానికి ఓ గమ్యం కోసం వెతుకుతు న్నాడు. శివరాం వెళ్లేటప్పటికి బయటి వరండాలో కూర్చుని భుక్తాయాసం తీర్చు కుంటూ, గాలికోసం విసనకర్రతో విసురు కుంటూ ఉన్నాడు రాఘవయ్య.

"ఏమోయ్ అల్లుడూ! ఎండనపడి వచ్చావ్..? ఏమిటి విశేషం? " అడిగాడు.

"నీతో పనిపడింది మామయ్యా!" చిన్నగా కుంటుకుంటూ వరండా మెట్లెక్కి లోపలికి వస్తూ అన్నాడు శివరాం.

బావ గొంతు విని లోపల్నించి పరిగెత్తు కొచ్చి వాకిట్లో నిలబడింది సునంద.

"కబురు చేస్తే నేనే వచ్చేవాణ్ణిగా... ఇబ్బంది పడుతూ నువ్వు రావటం దేనికి? " అంటూ అడిగాడు రాఘవయ్య. కాలు నెప్పితో మెట్లెక్కుతున్న అతన్ని చూస్తూ బాధతో రెపరెపలాడుతున్న కూతురి కళ్ళను చూసి అన్నాడు.

"అది... అక్కడ మాట్లాడాల్సిన విషయం కాదులే..." కూర్చుంటూ చెప్పాడు శివరాం.

"సరే... లోపలికి రా. భోంచేసి చెబు దువు" అన్నాడు రాఘవయ్య.

"ముందు నే చెప్పేది విను" అంటూ నందిని ఇల్లు వెతుక్కుంటూ వచ్చిన విషయం, ఆమె తనతో మాట్లాడిన మాటలు అన్నీ చెప్పాడు. ఈలోపు సునంద తల్లి జానకి కూడా బయటికొచ్చి అల్లుడు మాట్లాడినవన్నీ విన్నది.

రెండు నిమిషాల వరకు ఏమీ మాట్లాడ లేదు రాఘవయ్య. చుట్ట వెలిగించు కుంటూ ఆలోచనలో పడ్డాడు. తనే అడి గాడు శివరాం "ఈ విషయం ఇక్కడితో మర్చిపోదామా... లేక ముందుకు పోదామా? ఆవిడేమో వచ్చి అన్నీ చూస్కొని ఆ అమ్మాయి వసంతతో కూడా మాట్లాడమని చెప్పెళ్ళింది.. పైగా ఇద్దరి పిల్లల బాధ్యత..."

"స్రవంతికి తెలుసా... తనేమంటుంది? " అడిగింది జానకమ్మ.

"దాని విషయం నీకు తెలిసిందే కదు అత్తా! ఈ జన్మకు పెళ్ళనేదే వద్దంటుంది" అంటూ చెప్పాడు.

"అయినా... వాళ్లలాగే వీళ్లూ ఇంటికొచ్చి పిల్లనడుగుతున్నారు. ఆలోచిస్తుంటేనే భయమేస్తుంది" అన్నాడు శివరాం, పాత జ్ఞాపకాలు ఇంకా వీడకపోవడంతో.

"సరే... ఏదీ ప్రయత్నం చేయకుండా ఊరుకోవటం దేనికి? ఏ పుట్టలో ఏ పాముందో... మన ప్రయత్నం మనం చేసి.. అప్పుడే ఏదో ఒకటి నిర్ణయించు కుందాం" ఆలోచనగా తలపంకిస్తూ చెప్పాడు రాఘవయ్య.

"సునందా... ఆ కేలెండర్ పత్రా..." తండ్రి మాటలు విన్పించడంతో లోపలికి వెళ్ళి తెచ్చిచ్చింది.

ఏదో ఒకటి, స్రవంతి బాధ్యత తీరితే తనకీ కళ్యాణయోగం పడుతుంది అని ఉత్సాహంగా వుంది ఆమెకి. మనసులో మరోపక్క గుబులుగా కూడా వుంది 'స్రవంతి ఒప్పుకుంటుందా' అని.

"శుభం! రేపు ఉదయం పది గంటలకు బావుంది. వెళ్ళి వాళ్లతో మాట్లాడి, అన్నీ విచారించి వద్దాం. తర్వాత మనం ఆలో చించుకొందాం" అంటూ చెప్పాడు రాఘ వయ్య.

అక్కడ- సాయంకాలమవుతోంది. మధ్యాహ్నం అనగా వెళ్ళిన అన్న ఇంకా రాలేదు అని ఎదురుచూస్తోంది స్రవంతి.

"అక్కా! పిల్లలంతా నీ కోసం ఎదురు చూసి అలసిపోయి బిక్కమొహాలు వేసు కుని కూర్చున్నారు. తరుణ్ అయితే ఏడు

స్తున్నాడు. నిన్ను తీసుకుని వస్తానని మాయమాటలు చెప్పి వచ్చేశా..." లోపలికి వస్తూ చెప్పాడు రవి.

"పాపం!" తరుణ్ పసిముఖం తల్చుకో గానే బాధగా అన్పించింది.

"నువ్వు రా...రా. ఎప్పుడు తిన్నావో ఏమిటో, భోజనం వడ్డిస్తా" అంటూ వాణ్ణి లోపలికి తీస్కెళ్ళింది.

రవి ఇల్లు అక్కడికి దగ్గర్లోనే వుంది. వాళ్ళ నాన్న సింహాచలం ఇంతకుముందు స్రవంతి వాళ్ల దగ్గరే పాలేరుగా చేసే వాడు. కొన్నాళ్ల తర్వాత పొలం పనులు మానేసి వర్కర్‌గా ఫ్యాక్టరీ పనులకు పోతున్నాడు. నలుగురు సంతానంలో రవి మూడోవాడు. వాడికి చిన్నప్పట్నించీ శివ రాంతో చేరిక. తల్లి పోయాక, స్రవంతికి తోడుగా వుంటాడని వాణ్ణి ఇంట్లోనే ఉంచే సుకున్నాడు శివరాం. నాలుగుమైళ్ల దూరాన వున్న స్కూల్‌కి సైకిల్ పైన వెళ్ళొ స్తాడు రవి. సాయంకాలాలు స్రవంతే వాడిని చదివిస్తుంటుంది. ఆదివారం వస్తే ఇద్దరూ కలిసి ఆరు కిలో మీటర్ల దూరంలో వున్న దుర్గాంబ హోమ్‌కి వెళ్ళొ స్తారు.

లేటుగా వచ్చిన అన్నని చూసి, "ఏంట న్నయ్యా.. పెళ్ళి పెత్తనాలు పూర్త య్యాయా...? లేక పెళ్ళి కూడా నిశ్చయిం చుకొచ్చావా? " వెక్కిరింపుగా అడిగింది.

మాటలు రాని మూగబొమ్మలా చిన్న నవ్వు నవ్వాడు శివరాం. తనేం మాట్లా డినా, సమస్య ఇంకా జటిలమవుతుందని తెలుసు అతనికి.

నందిని విజిటింగ్ కార్డ్, ఫోన్ నంబర్స్ స్రవంతి చించేయటంతో, ఓసారి కమ లమ్మ గారితో మాట్లాడదామని మర్నాడు వెళ్ళారు శివరాం, రాఘవయ్య.

"మీ కోసమే చూస్తున్నాను" వాళ్లను చూడగానే చెప్పింది ఆవిడ.

"అదేనమ్మా... నిన్న వచ్చారు కదా... స్రవంతి కోసం... ఆ విషయం మాట్లాడదామని" అడిగాడు రాఘవయ్య.

"అవును. రెండునెలల క్రితం నందిని నన్ను కలిసి విషయమంతా చెప్పింది. నాకు వెంటనే మన స్రవంతి మనసులో మెదిలింది. చెప్పాను. వసంత, నందిని ఇద్దరూ నే చెప్పినదంతా విన్నారు. ఆలోచిస్తామన్నారు. కానీ వాళ్ల దగ్గర్నుంచి మళ్ళీ నాకెటువంటి కబురూ రాలేదు. ఏమనుకున్నారో, ఏమిటో అనుకుని నేనూ... ఊరుకుండిపోయాను. లేదంటే ముందుగా నేనే శివరాంతో అన్ని విషయాలూ మాట్లాడేదాన్ని. పోయిన ఆదివారం నందిని సడన్‌గా వచ్చి స్రవంతిని చూడాలి. వాళ్లన్నయ్యతో మాట్లాడాలి అంది. కరెక్ట్‌గా స్రవంతి కూడా ఆరోజు రాలేదు. అందుకే నిన్న తను మళ్ళీ రావాల్సొచ్చింది. సరే... తననే వెళ్ళిరానీ... ఇల్లూ వాకిలీ, మీ పద్ధతులు చూసినట్లుంటుంది అని స్రవంతితో పంపాను" అంటూ చెప్పిందావిడ.

"సరేనమ్మా... మరి ఆవిడ వాళ్ల విషయాలన్నీ చెప్పింది. మనం ప్రొసీడవుదామా...? లేక..." అడిగాడు శివరాం.

"శివరాం... నందిని చెప్పగానే వాళ్లకే కాదు, స్రవంతికీ ఆ ఇంట్లో చక్కని జీవితం అమరుతుందనిపించింది. మీరొకసారి ఆ ఇల్లు, ఆ మనుషులను చూస్తే కాదనుకోరు..." నమ్మకంగా చెప్పింది ఆవిడ.

"ఇప్పుడు వర్షం అదీ లేకుండా సమయం బాగుంది. మీరు కూడా మాతో వస్తే.. బయలు దేరదాం" అడిగాడు రాఘవయ్య.

"తప్పకుండా... ఆశ్రమం వ్యాన్‌లోనే బయల్దేరదాం" నందినికి ఫోన్ చేస్తూ చెప్పిందావిడ.

పనులన్నీ అక్కడి పనివాళ్లకి చెప్పి బయల్దేరేటప్పటికి మరో పది నిమిషాలైంది.

ఆశ్రమం నుంచి దాదాపు నలభై కి.మీ. దూరంలో ఊరికి మరో పక్కగా వుంది 'చైతన్య గ్రూప్ ఆఫ్ కంపెనీస్' సంస్థ. అదీ దాదాపుగా ఊరిబయటి స్థలమే.

"ఇక్కడి నుంచి మొదలవుతుంది వీళ్ల ఫ్యాక్టరీ. హార్డ్‌వేర్ పార్ట్స్ తయారీ జరుగుతుంది లోపల" అంటూ చెప్పింది కమలమ్మగారు.

ఎన్నో కి.మీ. పొడుగుతో నిలువెత్తుగా వుంది ఫ్యాక్టరీ కాంపౌండ్ గోడ.

"ఇక దీనిపక్కనే... ఈ చివరగా ఇల్లు..." ఫ్యాక్టరీ కాంపౌండ్ తర్వాత మొదలైన ఇంటి కాంపౌండ్ చూపిస్తూ చెప్పిందావిడ.

అప్పటికే- "ఇదేదో పెద్ద వ్యవహారంలాగా వుందే... మనమెక్కడ? వీళ్లెక్కడ?" అనుకోసాగారు శివరాం, రాఘవయ్య.

వ్యాన్ ఇంటిముందుకు చేరగానే అక్కడే వున్న గేట్‌కీపర్ గేట్ ఓపెన్ చేశాడు.

బిల్డింగ్ ముందుభాగం చూడగానే కళ్లు తిరిగినట్లైంది శివరాంకి. దాదాపు రెండు ఫర్లాంగులు లోపలికి వెడితేకానీ, ఇంటి పోర్టికో రాలేదు. కరెక్టుగా గేటునుంచి పోర్టికో వరకు రోడ్డులాగా వుంది. దానికి అటూ, ఇటూ విరగబూసిన పేరు తెలియని పూలు, రంగు రంగుల్లో వింత అందాన్నిస్తున్నాయి. ఐదెకరాల స్థలం, దానిలో మధ్యగా రాజభవంతిలాంటి ఇల్లు, ఇంటిముందు వాటర్‌ఫౌంటెన్స్, చుట్టూ పచ్చని లాన్... మరోపక్క దూరంగా టెన్నిస్‌కోర్ట్, స్విమ్మింగ్‌పూల్ కనిపిస్తున్నాయి.

చిన్నప్పుడెప్పుడో స్కూల్ ఎక్స్‌కర్షన్‌లో మైసూరు వెడితే చూశాడు శివరాం టిప్పు సుల్తాన్ భవంతిని. అచ్చంగా అలాగే



# CONGRATULATIONS TO OUR SSC TOPPERS MARCH - 2007



500 పైగా మార్కులు సాధించిన మా ట్రినిటీ ఆణిముత్యాలు...


P.SANTHOSH 563


NITHIN LADDA 556


G.PRATHYUSHA 553


N.SRIRAM 548


B.SUMA SRAVYA 541


R.VINAY 540


S.JYOTHIRMAI 539


D.ANUDEEP 537


FIRASATH AHMEDI 536


MD.AFROZ 535


P.KAVITHA 532


E.ANVESH 531


B.SWETHARANI 530


N.MANISHA 529


V.BHAVANI PRASANNA 528


R.MRUNALINI 528


M.PRATHYUSHA 528


N.SUDHAMAHESWARI 525


V.VARUN 524


MD.AFZALUDDIN 524


S.SOMASHEKAR 523


E.TULASI 523


L.ANNAPURNA 521


K.RAGHU KUMAR 520


D.SAI KRISHNA 520


B.SWARAJ REDDY 519


S.HARSHA 518


B.RANJITH KUMAR 518


VARSHA SOMANI 517


S.SAI VARUN 516


P.KARTHIK 515


K.PRAVEEN 515


BONNY JOHN 514


SABA NAAZ 513


A.CHANDER SHEKAR 512


R.SAMPATH 511


V.USHA KIRAN 510


K.SRAVANTHI 508


B.SINDHUJA 507


V.CHANDANA 507





T.SAI TEJA 506


D.SAI KUMAR 503

MATHS : 100/100 - 5 Students
SCIENCE : 99/100 - 4 Students
SOCIAL : 99/100 - 5 Students




# TRINITY
## HIGH SCHOOL & HOSTEL

GOUTHAMI NAGAR, MANCHERIAL

Ph: 08736-252823, Cell: 94400 60808, 94400 19033



JOHN THOMAS
M.A. B.Ed., PRINCIPAL

వుంది ఇక్కడ. ఇంకా రెండింతల అందంతో. ఆ రాజసాలన్నీ రాజులకే సాధ్యం అనుకునేవాళ్లు చిన్నప్పుడు.

ఇటువంటి ఇంటికి ఏ తోటమాలి పనికో తామిద్దరూ సరిపోతాం అనిపించింది శివరాం, రాఘవయ్యలకు. కొంచెం భయంగానే లోపలికి అడుగుపెట్టారు. సినిమాల్లో సెట్టింగ్స్‌లా విశాలంగా వుంది ఇల్లు. గ్రానైట్ ఫ్లోరింగ్‌తో విశాలమైన హాలు, గోడలు కనిపించకుండా ఉడెన్ ఫినిషింగ్స్‌తో చేసిన ఇంటీరియర్ డిజైనింగ్... గొప్ప గొప్ప చిత్రకారులు గీసిన అందమైన పెయింటింగ్స్ ఒకటి రెండు చోట్ల హేంగ్ చేసి వున్నాయి. అక్కడక్కడా దేశవిదేశాల్నుంచి తెచ్చిన అద్భుత ఆకృతిలో వున్న స్టాచ్యూస్ నిలబెట్టి వున్నాయి. ఐశ్వర్యం ఎంత అద్భుతాన్నైనా చూపిస్తుందన్నట్లుగా, సామాన్యులకు కళ్లు మిరుమిట్లు గొలిపేలా వుంది ఆ భవంతి.

"లోపలికొచ్చి కూర్చోండి" సోఫాసెట్ చూపిస్తూ చెప్పింది యాభైఏళ్ల వయసావిడ.

"ఏం సావిత్రమ్మా... బాగున్నావా?" పలకరిస్తూ కూర్చుంది కమలమ్మగారు.

"ఆఁ... తమరెలా వున్నారు? ఆశ్రమం... పిల్లలు..." అడిగింది ఆవిడ.

"అంతా క్షేమమే" నవ్వింది ఆవిడ.

వాళ్లకి చల్లటి మంచినీళ్లందించి, "మీరొచ్చారని చెప్పొస్తాను" అంటూ లోపలికెళ్ళింది ఆవిడ. అంత చల్లని నీళ్లు తాగినా ఒంటిమీద చిరుచెమటలు తగ్గలేదు మామా, అల్లుళ్లిద్దరికి. మామూలుగానైతే ఇటువంటివాళ్లు కార్లో వెడుతూ కూడా తమింటివైపు చూడరేమో... వారిద్దరి పరిస్థితి గమనించిన కమలమ్మగారు కంగారు పడవద్దని కళ్ళతోనే సైగ చేసింది.

లోపల్నుంచి హుందాగా నడుచుకుంటూ వచ్చింది నందిని. "నమస్తే" చేతులు జోడించిన వారికి ప్రతి నమస్కారం చేసి తనూ ఎదురుగా కూర్చుంది.

"మా మేనమామగారు" పరిచయం చేశాడు శివరాం.

సంభాషణ ఎలా మొదలుపెట్టాలో ఎవరికీ అర్థంకాలేదు. ఈలోపు సావిత్రమ్మ ట్రే నిండుగా యాపిల్ స్లైసెస్.. టీ కప్పులు తీసుకొచ్చింది.

ముందుగా శివరాం మాట్లాడాడు "మీరు ఇంత పెద్ద అంతస్తుకి చెందినవారనుకోలేదు. మీ స్థితిగతులు వేరు... మా పరిస్థితులు వేరు" చెప్తున్న అతణ్ణి మధ్యలోనే ఆపేసింది నందిని.

"స్రవంతి గురించి త్వరపడి నేనీ నిర్ణయానికి రాలేదు. కమలమ్మగారు చెప్పాక రెణ్ణెల్లుగా అన్నీ ఆలోచించుకునే ఈ డెసిషన్‌కి వచ్చాను. ఈ ఇంటి మీద, ఈ ఐశ్వర్యం మీద చాలామందికి ఆశ వుంది. వీటిమీద ఆశతోకాక, తన బిడ్డల మీద ప్రేమతో పూర్తి ఇష్టాన్ని ప్రదర్శించే వ్యక్తి కావాలని కోరుకుంటోంది వసంత..." మధ్యలోనే తండ్రి రావటం చూసి జరిగి తన పక్కన చోటిచ్చింది.

దాదాపు డెబ్బై ఏళ్ళ వయసుంది ఆయనకి. వయసులో వున్నప్పటి హేండ్‌సమ్‌నెస్‌కి పెద్దరికం తోడవటంతో గౌరవంగా వున్నాడు ఆయన. ఈమధ్యకాలంలో కోడలు అనారోగ్యం పాలవటం, కొడుకు జీవితనావ అటూ, ఇటూ ఊగటం ఆయన్ని బాగా కుంగదీసింది. ఏడేళ్లుగా కన్నబిడ్డలాగా తనని ఆదరించిన వసంత

**ఈ ఇంటిమీద, ఈ ఐశ్వర్యం మీద చాలామందికి ఆశ వుంది. వీటిమీద ఆశతోకాక, తన బిడ్డల మీద ప్రేమతో పూర్తి ఇష్టాన్ని ప్రదర్శించే వ్యక్తి కావాలని కోరుకుంటోంది వసంత...**

చావుబతుకుల మధ్య కొట్టుమిట్టాడుతుంటే చూడలేకపోతున్నాడు ఆయన.

"ఈయన స్రవంతి అన్నగారు, ఆయన మేనమామ" అంటూ తండ్రికి పరిచయం చేసింది నందిని.

"వ్యవసాయమట కదా... అమ్మాయి తోనే మాట్లాడండి. ప్రస్తుతం బాధ్యతలన్నీ తనవే..." అంటూ రెండునిమిషాల్లోనే పైకి లేచాడు ఆయన.

పక్కనున్న కమలమ్మగారిని కూడా గమ నించలేదంటే... ప్రస్తుతం జరుగుతున్న విషయం ఆయనకెంత దిగులుగా వుందో అనిపించింది అందరికీ.

"మీకు స్రవంతి గూర్చి పూర్తిగా తెలుసు కదా..." మరోసారి అడిగాడు శివరాం.

"కమలమ్మగారు ఏ విషయం నా దగ్గర దాచిపెట్టలేదు" అంది నందిని పైకి లేస్తూ.

అంతా కలిసి ఇల్లంతా చూస్తూ వసంత గదిలోకి నడిచారు. వీళ్లకోసమే ఎదు రుచూస్తున్నట్లుగా లేచి దిండ్లకానుకుని మంచంమీద కూర్చుని వుందామె. పక్కనే వున్న నర్సు ఏదో టానిక్ తాగిస్తోంది.

తమ ఇల్లంతా కలిపితే ఈ బెడ్రూమ్ అవుతుందేమో అన్నంత విశాలంగా వుంది ఈ గది అనుకున్నాడు శివరాం. ఎ.సి. రూమ్ చల్లదనంతో ఏదో కొత్త లోకంలోకి వచ్చినట్లుంది.

బెడ్‌కెదురుగా వుంది నిలువెత్తు లామి నేషన్ చేయించిన ఫ్యామిలీ ఫొటో.

ఒకప్పుడు ఈ ఇల్లు నవ్వుల హరివిల్లుకి నిలయం అని తెలిపే విధంగా అందులో వసంత, చైతన్య... వారిద్దరి మధ్య మురి పాలొలుకుతూ చిన్నారులు ఆషా, నిషా... చూడచక్కగా వున్నారు.

ఓ పక్కగా వున్న చెయిర్స్ చూపించింది వసంత అందరికీ.

"ఏమ్మా... ఎలా వుంది ఇప్పుడు? " దగ్గ రికెళ్ళి ఆప్యాయంగా పలకరించింది కమల మ్మగారు.

నోటమాట రాక జలజలా కన్నీళ్లు రాలాయి వసంతకి.

"నో... నో... ఆఫ్టర్ ఫైవ్... ఐ విల్ బి బిజీ..." చెవిలో మొబైల్ ఫోన్‌లో ఎవరి తోనో మాట్లాడుతూ లోపలికి వచ్చాడు చైతన్య.

రావటంతోటే వసంత కళ్ళమ్మట నీళ్లు... కమలమ్మగారి చేతిలో ఆమె చెయ్యి వుండటం చూసి చిరాకనిపించింది అతనికి. ఈ మధ్యకాలంలో ఎలా వున్నావు...? ఆఖరి చూపు అంటూ వచ్చే పోయే అతిథులెక్కువైపోయి వసంతని మరింత బాధపెడ్తున్నారు అందరూ. అది గమనించి పనివాళ్లందరికీ గట్టిగా చెప్పే శాడు చైతన్య. మరీ ముఖ్యమైనవాళ్లు తప్పితే ఎవరొచ్చినా వసంత నిద్ర పోతోం దనో... రెస్ట్ అనో చెప్పి పంపించెయ్యమం టున్నాడు.

"బాగున్నారా? " కమలమ్మగారిని ముక్త సరిగా పలకరించాడు.

"వసంతా... టాబ్లెట్స్ వేసుకున్నావా? జ్యూస్ తీసుకున్నావా? " అడిగాడు.

ఆమె 'ఊ' అన్నట్లు తల ఊపింది. అను మానంగా నర్సువైపు చూశాడు. "తీస్కున్నా రండి" అంటూ చెప్పిందావిడ.

తనక్కావలసినవి ఏవో వెతుక్కుని తీసు కుంటూ, నందినిని బయటికి రమ్మని సైగ చేస్తూ వచ్చినంత వేగంగా బయటికి నడి చాడు.

'అక్కా! నీకెన్నిసార్లు చెప్పాను... ఎవర్నీ లోపలికి రానివ్వద్దని బాధతో అతను అడుగుతున్న మాటలు లోపలివైపు విండో దగ్గర కూర్చున్న శివరాం, రాఘవయ్య విన్నారు. ఓ పక్కగా సోఫాలో కూర్చున్న వాళ్ళిద్దర్నీ అతను గమనించలేదు. నందిని ఏదో సర్దిచెప్పి లోపలికి వచ్చింది.

వసంతను దగ్గరగా పిలిచి శివరాం, రాఘవయ్యలను పరిచయం చేసింది నందిని. ఆమెకు దగ్గర్లో చెయిర్స్ వేసింది నందిని. నర్సుని చూపులతోనే కాసేపు బయటికి వెళ్ళమని చెప్పింది.

వడిలిపోయి, కళ్ళల్లో గూడుకట్టుకుపోయిన బాధ కనిపిస్తున్నా వసంత ఎంత అందగత్తో అన్పించేట్లు ఆమె ముఖం మీద అందం ఛాయలు సమసిపోలేదు.

వసంత చెప్పటం మొదలు పెట్టింది. "అమ్మా, నాన్నలకు నేనొక్కర్తే సంతానం. పెళ్ళి తర్వాత మొదలైన ప్రేమబంధం నాదీ, చైతన్యదీ! రెండేళ్ల క్రితం అమ్మా, నాన్న, మా అత్తగారు కలిసి దక్షిణ భారత యాత్రల టూర్‌కని వెళ్లినవాళ్లు యాక్సిడెంట్‌లో పోయారు. మామగారు మోకాళ్ల నెప్పులంటూ వెళ్లకపోవటంతో మాకు మిగిలారు. ఆ టైమ్‌లోనే నా ఈ.. జబ్బు బయటపడింది. బంగారంలాంటి భర్త, ముత్యాల్లాంటి బిడ్డలు... కొండమీద కోతినైనా తెచ్చిపెట్టే సంపద... నా అదృష్టం ఆపై వాడిక్కూడా ఈర్ష్య అన్పించిందేమో... నా సంసారజీవితం మూణ్ణాళ్ళ ముచ్చటైంది.

"అటు నా తల్లిదండ్రుల యాక్సిడెంట్, ఇటు నా జబ్బు విషయం బయటపడటంతో ఎంతోమంది పారిశ్రామికవేత్తలు, బిజినెస్ మేగ్నెట్స్... బంధువులు తమ కూతుళ్లను చైతన్యకిచ్చి చేయటం కోసం కాచుకుని కూర్చున్నారు. వాళ్ల దృష్టంతా కళ్లు తిరిగే మా ఆస్తిపాస్తులపైనే. కృత్రిమ ఆపేక్షలు కురిపించే జనాన్ని స్వచ్ఛమైన పంటచేల మధ్య బతికే మీరు ఊహించలేరు" ఆయాసపడుతూ ఆగింది ఆమె.

నందిని గ్లాసులో చల్లటి మంచినీరు ఒంపి ఇచ్చింది.

తాగి మళ్లీ కొనసాగించింది వసంత "మామగారు పెద్దవారయ్యారు. వదిన ఒక్కతే ఇంతమంది మధ్య పోరాడలేదు. అటు చూస్తే పసిపిల్లలు... దానితో ఆయన్ని బలవంతపెట్టి నేను నా బాధ్యతలు నెరవేర్చుకుని హాయిగా వెళ్లిపోవాలని ఆశపడుతున్నాను" కళ్ళల్లో నీళ్లు తిరుగుతుంటే చెప్పింది.

ఆమె మాటలు వింటూ, ఆమె పరిస్థితి గమనిస్తున్న వాళ్లకి గుండెలు ద్రవించిపోయేట్లుగా వుంది ఆ సన్నివేశం. ఆమె అణువణువూ కదిలిపోతూ, ఉద్విగ్నంగా చెబుతుంటే ఆ ఇల్లన్నా, ఆ కుటుంబమన్నా ఆమెకెంత ప్రాణమో అన్పించింది వాళ్లకి.

"స్రవంతి గూర్చి నాకు అన్ని వివరాలు పూర్తిగా తెలుసు. వదిన చెప్పింది. మీ అమ్మాయికి ఇక్కడ ఏ లోటూ రాదు" చెప్పింది వసంత.

"అలాగేనమ్మా! మరి మేం ఓ సారి ఆలోచించుకుని ఏ సంగతీ చెబుతాం" అంటూ పైకి లేచాడు రాఘవయ్య.

బయలుదేరి వస్తుంటే చిన్నారి ఆషా, నిషాలు ఆయాలతో, కారు డ్రైవర్‌తో గార్డెన్‌లో ఆడుతూ కనిపించారు. ఏ విషయం తెలీని, ఏ బాధలూ లేని స్వచ్ఛమైన బాల్యంలో అమాయకంగా విరిసిన మొగ్గల్లా వున్నారు వాళ్లు.

★ ★ ★

వ్యాన్ ఆశ్రమం చేరేవరకూ ముగ్గురూ ఏమీ మాట్లాడుకోలేదు. నిశ్శబ్దంగా కూర్చున్నారు. అష్టైశ్వర్యాలు వున్నా వసంత అనుభవిస్తున్న దుస్థితి... వాళ్ల మనసుల్ని ఇంకా వదల్లేదు.

"డ్రైవర్... వీళ్లని సీతమ్మపురంలో వదిలిపెట్టు" కమలమ్మగారు దిగుతూ చెప్పింది.

"మరి... శెలవు. ఉంటామమ్మా..." చెప్పారు ఇద్దరూ.

"ఊఁ నీ అభిప్రాయం ఏంటిరా? " దిగి

పోతూ అడిగాడు రాఘవయ్య

"నేనీ పెళ్ళి పొరపాటున కూడా చెయ్యను మామయ్యా! అసలక్కడికి వెళ్ళ టమే తప్పనిపిస్తుంది నాకు" అంటూ చెప్పాడు.

శివరాం ఈ సంబంధాన్ని తేలిగ్గా ఒప్పు కుంటాడనుకున్న రాఘవయ్య ఈ జవా బుతో ఖంగుతిన్నాడు.

"అవును మామయ్యా! వాళ్ల ఆస్తిపా స్తులు కాపాడ్డానికి, వాళ్ల పిల్లలకు రక్షణగా ఉండటానికి స్రవంతి జీవితం పణంగా పెట్టలేను. పైగా పెళ్లైన దగ్గర్నుంచి... ఇక వసంత ఎన్నాళ్లు బతుకుతుందో అంటూ ఎదురుచూస్తూ గడిపే కసాయివాళ్లలాగా మనమూ మారిపోతాం. వాళ్ల వరకు వాళ్ల పరిస్థితి, డెసిషన్స్ ఓకే. కానీ మనం... ఓ సారి నా చేజే తులా దాని జీవితాన్ని నాశనం చేశాను.

మళ్ళీ ఇప్పుడు ఇంకో ఊబి లోకి నెట్టలేను. జీవితంలో అది ఇప్పటివరకు ఏ సుఖ సంతోషా లకు నోచుకోలేదు. వాళ్లు చెప్పి నదాన్ని బట్టి... ఇంతింత పెద్ద బాధ్యతలు దాని నెత్తిన పెట్టి... దానికి ఏ సంతోషం లేకుండా చేయలేను. ఏనాటికైనా తను మనసు మార్చుకుని పెళ్లి చేస్కుంటుందని, సంతోషంగా బతు కుతుందని ఇన్నాళ్లూ ఓపిగ్గా ఎదురుచూశా ను. ఇప్పుడు... ఈ పిల్లల తండ్రిని తెచ్చి చేస్కోవాల్సిన పరిస్థితి... నా కిష్టం కావ ట్లేదు. ఎప్పటికైనా మంచివాడు దొరికితే నా ఇల్లు, పొలం అమ్మేసైనా... దానికి కావలసినంత కట్నం ఇచ్చైనా పెళ్లి చేస్తాను. లేదా కలకాలం ఇలాగే నా దగ్గరే ఉండిపోతుంది" దృఢంగా చెప్పాడు శివరాం.

**ఓ సారి నా చేజే తులా దాని జీవితాన్ని నాశనం చేశాను. మళ్ళీ ఇప్పుడు ఇంకో ఊబిలోకి నెట్ట లేను. జీవితంలో అది ఇప్పటివరకు ఏ సుఖ సంతోషాలకు నోచు కోలేదు. వాళ్లు చెప్పిన దాన్ని బట్టి... ఇంతింత పెద్ద బాధ్యతలు దాని నెత్తిన పెట్టి... దానికి ఏ సంతోషం లేకుండా చేయలేను.**

వాళ్ల ఐశ్వర్యం అతన్ని ప్రలోభ పెట్టక పోగా... చెల్లెలి మీద అతనికున్న ప్రేమ రాఘవయ్యకు అబ్బురమనిపించింది. అత నంత గట్టిగా చెప్పాక మాట్లాడలేకపో యాడు ఆయన. అదే క్షణంలో తనేమైనా మాట్లాడితే తన కూతురి భవిష్యత్ కోసం, స్రవంతిని ఎలాగైనా పంపాలని అనుకుం టున్నాడని శివరాం తప్పుగా అభిప్రాయ పడే అవకాశముంది.

"భోజనం చేసి వెళ్ళరా..." చెప్పాడు అల్లుడికి.

"వద్దు మామయ్యా! అన్నీ చేసిపెట్టి వెళుతుంది కదా" అన్నాడు.

ఆయన మౌనంగా దిగి పోయాడు.

"కమలమ్మగారిని రెండ్రో జులాగి కలుస్తానని చెప్పు" డ్రైవర్‌తో చెప్తూ ఇంటి దగ్గర దిగాడు శివరాం.

రోజూ ఉదయాన్నే టిఫిన్ రెడీచేసి, దానితోపాటు కూరలు సర్ది పెట్టి రైస్ మాత్రం కుక్కర్‌లో పెట్టి వెళ్ళిపోతుంది స్రవంతి. దగ్గ ర్లోనే వున్న కాల్ సెంటర్లో పద్నాలుగువేల జీతంమీద అకౌంటెంట్‌గా పనిచేస్తోందామె. తను, రవి తిని బాక్సుల్లో పెట్టుకుని ఉదయం తొమ్మిది గంటలకు వెళితే ఇల్లు చేరేసరికి సాయంత్రం ఏడు గంటలవుతుంది. రాగానే అందరికీ కాఫీలు, మళ్ళీ వంట... మధ్యలో కాసేపు రవిని చదివించటం... ఆదివారాలు ఆశ్ర మంలో విజిట్స్... ఇలా సాగిపోతోంది ఆమె దినచర్య. శివరాం పొలం పనులు చూస్కుంటూ వుంటాడు.

రెండేళ్లుగా స్రవంతికి రకరకాల పెళ్ళి

ప్రయత్నాలు చేస్తున్నారు రాఘవయ్య, శివరాం. కానీ స్రవంతిని ఒప్పించటం కుదరడం లేదు. ఇప్పుడీ వసంత వాళ్ళింటికి వెళ్లటం కూడా 'ఓ సారి చూసివస్తే ఏం?' అనుకుంటూ వెళ్ళటమే.

ముందుగానే కాలునొప్పితో బాధపడుతూ వుండటం, మరోపక్క లేటుగా భోజనం చేయటం. మానసికంగా వసంత పరిస్థితి మనసును బాధ పెట్టటం... శివరాం ఆ మిట్ట మధ్యాహ్నంవేళ మంచంమీద పడుకుండిపోయాడు. చుట్టూ చల్లని గాలి సేదతీరుస్తోంది అతన్ని. ఆలోచనలు ఎక్కడికో వెనక్కి పరిగెడుతున్నాయి.




పదహారేళ్ల స్రవంతి... అల్లరిగా... సంతోషమంతా తనదే అన్నట్లు ఎప్పుడూ నవ్వుతూ తిరిగే స్రవంతి గుర్తొచ్చింది అతనికి.

"చూడండి బాబూ... నేను గడ్డివాముకు ఆనుకుని నిద్రోతుంటే అమ్మాయిగారు నా అవతారం ఇలా చేసేశారు" ఏడుపు మొహంతో రాముడు చెపుతుంటే వాడి అవతారం అందరికీ నవ్వు తెప్పించింది.

వాడి మొహమంతా పౌడర్ దట్టంగా అద్ది, తిలకం బొట్టు నుదిటికి, చెంపలపై దిద్ది.. వాడిది కాస్త పొడుగుజుట్టు కావటంతో కృష్ణుడి కొప్పులాగా కట్టి పూలదండ వేలాడేట్లుగా వాడి తలలో పెట్టింది స్రవంతి.

"రోజురోజుకీ నీ అల్లరి ఎక్కువైపోతోంది" తల్లి గట్టిగా కేకలేసింది.

"ఏం లేదులే..." బుంగమూతి పెట్టి చెప్పింది.

"చూడన్నయ్యా! నువ్వు ఎండలకి మంటలు త్వరగా అంటుకుంటున్నాయి అని జాగ్రత్తంటూ నాల్రోజుల్నించి పొలం దగ్గర వాణ్ణి కాపలాకు పెడితే రెండ్రోజుల్నించీ చూస్తున్నా... ఒకటే నిద్ర... కుంభకర్ణుడిలాగా... నీకు చెపితే నమ్మావా? వాడికి జడవేసి, పూలు పెట్టి, తిలకం అద్దితే కూడా మెలకువ రాలేదు. ఇంక కాపలా ఏం కాస్తాడు చెప్పు" అమాయకంగా ఇంతలేసి కళ్ళు తిప్పుకుంటూ చెపుతుంటే చెల్లినేమీ అనబుద్ధి అయ్యేది కాదు శివరామ్‌కి. "దాన్ని కాదురా... దాన్నలా తయారుచేస్తున్న నిన్ననాలి" తల్లి విసుక్కుంటూ లోపలికి వెళ్ళిపోయేది.

భర్త పోయిన దగ్గర్నుంచి ఉన్న కొద్దిపాటి పొలం జాగ్రత్త చేసుకుంటూ బతుకుతోంది ఆవిడ. పిల్లలిద్దరి మీద ప్రాణాలు పెట్టుకుని వాళ్లకోసమే అన్నట్లు జీవితాన్ని నెట్టుకొస్తుంది. తనకు ఆపద సమయంలో కొండంత అండగా నిలబడ్డ అన్న రాఘవయ్య మీద బోల్డంత ప్రేమ ఆమెకి. ఆ కృతజ్ఞతతోనే సునందని తన కొడుక్కి చేసుకోవాలని, అన్న రుణం తీర్చుకోవాలని అనుకుంటోంది ఆమె.

ఆనాటి స్రవంతి... గలగలపారే ఒక జీవనదిని గుర్తుకు తెచ్చేది. ఆమె కబుర్లకి తోటలో వున్న మల్లెలు, కనకాంబరాలు తలలూపేవి. పెరట్లోని జామ చెట్టుమీద వున్న చిలకమ్మ ఆమె ఫ్రెండే. పశువుల పాకలో వున్న లేగదూడలు ఆమెను చూస్తే ముందు కురికేవి. ఇక వాకిట్లో పెంచే పావురాలు... ఉదయం నుంచి తమ నేస్తం స్కూల్‌కి వెళ్ళి కనిపించలేదని ఆమె రాగానే భుజాల మీద వాలిపోయేవి. పనివాళ్లతో, పాలేర్లతో



అలాగే సంతోషంగా సాగిపోతున్న వాళ్ల జీవితాల్లో... కడివెడు పాలల్లో ఒక్క విషంచుక్క చాలన్నట్లుగా శివ రాంను చూడటానికి ఆ పల్లెటూరికి వచ్చాడు అతని బెస్ట్‌ఫ్రెండ్ రాజేష్. ఇద్దరూ కలిసే డిగ్రీ వరకు చదువుకు న్నారు. ఆపైన శివరాం వ్యవసా యంలో పడిపోతే, రాజేష్ పై చదువు

ఆప్యాయంగా మాట్లాడేది. వాళ్లని ఉడికిం చేది, ఏడ్పించేది కూడా ఆమే. ఏ రోజైనా ఎవరైనా జ్వరాన పడి పనికి రాలేదని తెలిస్తే తల్లితో వంట చేసి పెట్టమని చెప్పి తీసుకెళ్ళి ఇచ్చొచ్చేది. ఆ వయసులోనే ఆమె దయాగుణం, ఇతరుల పట్ల మానవీయత వాళ్లని అబ్బురపరిచేది. అందుకే స్రవం తంటే వాళ్లందరికీ అంత ఇష్టం.

లకని వెళ్ళిపోయాడు. రెండ్రోజులు వాళ్లింట్లోనే గడిపిన రాజేష్ చూపు స్రవం తిపై చిక్కుకుంది. ఆ ఊరు... ఆ స్వచ్ఛత... ఆ మనుషుల అమాయ కత్వం... గ్లోబలైజేషన్‌తో చిన్నదైపోతున్న ప్రపంచంలో వుంటున్న ఈ రోజుల్లో... ఇంకా ఇలాంటి మనుషులా? అతనికి ఆశ్చ ర్యంగా అన్పించేది. రాక రాక వచ్చిన ప్రాణ

మిత్రుణ్ణి చూసి సంతోషంతో ఉక్కిరిబిక్కిరై మర్యాదలతో సాగనంపాడు శివరాం.

మరో ఏడాదికి రాజేష్ దగ్గర్నుంచి ఫోన్ కాల్ వచ్చింది. 'తనకి జాబ్ వచ్చిందని, పాతికవేల జీతమని... మీకిష్టమైతే అమ్మా, నాన్న స్రవంతిని చూడటానికి వస్తారు' అని దాని సారాంశం.

అనుకోని ఆఫర్ శివరాంని ఏమీ ఆలోచించుకోనివ్వలేదు. కోరి పిల్లనడుగుతున్నారంటే తన చెల్లెలు ఎంత అదృష్టవంతురాలు.. తల్లితో అదే మాట చెప్పాడు.

"అమ్మా! నాకు వాడి గురించి బాగా తెలుసు. ఒక సిగరెట్ కానీ, కాఫీ కానీ అలవాటు లేని బుద్ధిమంతుడు. చాలా మంచివాడు. ఈ సంబంధాన్ని మించి ఇంకోటి మాత్రం స్రవంతికి తేలేము. అది మాత్రం నిజం" ఖచ్చితంగా చెప్పాడు.

"చిన్నపిల్ల... అప్పుడే ఏం తొందర? " అంటూ వెనకా, ముందాడుతున్న తల్లిని, మేనమామని ఊపిరాడనివ్వలేదు శివరాం. రాజేష్ తరపున వకాల్తా పుచ్చుకుని ఎంతో సంతోషంగా వాళ్ల వివరాలన్నీ చెప్పాడు. వాళ్లు సరే అనటం, రాజేష్ తల్లిదండ్రులు రావటం... అమ్మాయిని ఓ. కె. చేయటం... జరిగాయి. పెళ్లిచూపులగ్గానీ, నిశ్చితార్థానికి కానీ ఒక్కసారి కూడా రాజేష్ రాకపోవటం బాగా నిరాశపర్చింది స్రవంతిని. అన్నయ్య ఉత్సాహం చూసి ఒప్పుకుంది కానీ, ఏడాది క్రితం చూసిన రాజేష్ రూపురేఖలు సరిగ్గా గుర్తులేవు ఆమెకి. ఉన్నంతలో పెళ్లి బాగా జరిపి పంపించారు స్రవంతిని.

పెళ్ళయ్యాక స్రవంతిని తీసుకుని హైదరాబాద్ వెళ్లిపోయాడు రాజేష్.

అతను పలికీ, పలకనట్లుగా ముభావంగా వుంటే మొహమాటం, కొత్తవల్ల కాబోలు అనుకుంది.

వాళ్ల జీవితాన్ని కలవేసుకోవాల్సిన తొలి రాత్రి.. ముందుగా ఒకరినొకరు అర్థం చేస్కోవాలి, ఈ తతంగాలదేముంది అంటే, ఉత్తముడు అని సంతోషపడింది.

మరో పదిరోజులకు తోడుగా వచ్చిన అత్తగారు అన్నీ సర్దిపెట్టి, బాధ్యతలన్నీ స్రవంతికి అప్పచెప్పి వాళ్ల ఊరు వెళ్ళిపోయింది.

ఆ రోజు సాయంత్రం వరకు ఒంటరిగా, దిగులుగా అన్పించింది ఆమెకు. అతను ఇంటికి రాగానే ఆమె కళ్లల్లో వెలుగుతున్న సంతోషాన్ని చూసి, ఆమె చూపులో చూపు కలపలేక తడబడ్డాడు.

ఆరోజు రాత్రి ఆమె జీవితంలో విషాదం చిందిన రోజు. ఆమెకి తెలియని కొత్త లోకాలు, కొత్త నిజాలు... నిశ్చేష్టురాలై వుండిపోయింది అతను చెప్తుంటే. అంత అందంగా, హుందాగా కన్పించే రాజేష్ సంసారజీవితానికి పనికిరాడంటూ అతనే చెప్పిన నిజం. కాసేపటికి తేరుకుంది ఆమె.

"పోనీలెండి... డాక్టర్స్ దగ్గరికి వెళితే అన్ని సమస్యలూ సాల్వ్ అవుతాయి" తన కున్న కొద్దిపాటి జ్ఞానంతో చెప్పింది.

"అన్నీ అయిపోయాయి. నీ జీవితాన్ని నాశనం చేస్తున్నానని తెలుసు. కానీ, నీ మీద ఇష్టంతో..." బేలగా అతను చెప్తుంటే కరిగిపోయింది.

"ఎంతమంది ఎన్నిరకాల సమస్యలతోటి బతకటం లేదూ... మనమూ అలాగే... ఒకరికొకరం చాలు" నిశ్చయంగా చెప్పింది.

తర్వాత్తర్వాత... నిదానంగా అతనిలో వుండే మరో మనిషి బయటికి రాసాగాడు. తాను అందరిలాగా లేననే ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్... స్రవంతి మీద చూపించటం మొదలుపెట్టాడు. నిలబడితే తప్పు, కూర్చుంటే తప్పుగా అయింది స్రవంతి పరిస్థితి. ఆమె విషయాల్లో అన్నీ తప్పులుగా

# గోళ్ళ గోల

అందంగా కత్తిరించుకుని, దుస్తులకు తగినట్టుగా గోళ్ళ రంగులు వాడటం వలన స్త్రీ అందం ఇనుమడిస్తుంది. ఆధునిక యువతులు గోళ్ళ సంరక్షణ, గోళ్ళ రంగులకు ఎంతో ప్రాముఖ్యతనిస్తారు. నెయిల్ పాలిష్‌లతో గోళ్ళమీద అభిమాన తారలు, నాయకుల బొమ్మలు పెయింట్ చేయించుకుంటారు.

చేతుల్ని ఎక్కువసేపు డిటర్జెంట్, రసాయనాలలో ఉంచటం వలన చేతిగోళ్ళు బలహీనపడతాయి. గోళ్ళమీద మన వయసు ప్రభావం కూడా ఉంటుంది. గోళ్ళ వెనక ఉండే పల్చని చర్మం (క్యూటికిల్) చిట్లి, కొన్ని సందర్భాల్లో బాధతో బాటు, రక్తం కూడా వస్తుంది. చర్మ డాక్టరు సలహా ప్రకారం ఆయింట్‌మెంట్లు వాడాలి. ఎక్కువసేపు నీళ్ళలో రసాయనాలలో ఉంచాల్సొచ్చినపుడు చేతికి 'గ్లోవ్స్' వాడాలి.

కొంతమంది చేతిగోళ్ళు పసుపు, కాఫీ రంగుల మరకలు కట్టి ఉంటాయి. దీనికి కారణం ఫంగల్ ఇన్ఫెక్షన్. అలాగే ఎరుపు, ముదురు రంగుల నెయిల్ పాలిష్‌లు వాడటం వల్ల కూడా గోళ్ళ రంగు మారుతుంది. వైద్యుల్ని సంప్రదించండి. క్యూటికిల్ చిట్లటం, మంటలు పుట్టటం నివారణ కోసం అర చేతుల్ని రెండు [illegible] వేడి నీటిలో ఉంచి, తర్వాత ఆయింట్‌మెంట్ వాడటం వల్ల ఉపశమనం కల్గుతుందని నిపుణులు చెప్తున్నారు.



వుండేవి అతనికి. పాలవాడొచ్చినా, పేపరు వాడొచ్చినా అనుమానంతో ఆమెకి నరకం చూపించేవాడు. పక్కింటివాళ్లతో మాట్లాడినా అతనికి ఇష్టం వుండేది కాదు.

వంట త్వరగా చేస్తే... "తర్వాత ఎవరితో మాట్లాడాలి? పని ముగించావ్" అంటాడు. లేటుగా చేస్తే "వేడిగా వడ్డించుకుని ఎవరితో తినాలకుంటున్నావ్?" అనేవాడు. మరోరోజు "ఏమిటీ? స్టీరియోలో పాటలు వింటూ వంట చేస్తున్నావ్... నా బతుకెలాగూ వీడితో అయిపోయింది అని ఊహల్లో ఆ హీరోతో కలలు కంటున్నావా?" అనడిగేవాడు. చివరికి టి.వి.లో ప్రోగ్రాం చూస్తున్నా తప్పు పట్టేవాడు.

ఎన్నోసార్లు అతనికి సర్దిచెప్పేది ఆమె, తనకలాంటి ఊహలు లేవని. మనసా, వాచా అతనితోనే జీవించాలనుకుంటున్నట్లుగా... అతన్ని చూస్తూ ఏడుస్తూ ఆమె చెప్పే మాటలు అతన్ని కరిగించేవి కావు. తల్లిమీద, అన్నమీద ప్రేమతో జరిగే విషయాలు వాళ్లకు చెప్పకపోవటం అతనికి మరింత అలుసైపోయింది. వాళ్ళొచ్చినప్పుడు చాలా మంచివాడిలా ప్రవర్తించేవాడు. తన దగ్గర మాత్రమే ఈ విపరీత ధోరణి... ఈ రెండు రకాల నైజం ఆమెను అయోమయంలో పడేసింది.

రాన్రాను అతనికి తగ్గట్టుగా అన్ని విషయాల్లో తనని తాను మార్చుకుంది స్రవంతి. పెదాలపై చిరునవ్వనేది ఎప్పుడో

మాసిపోయింది. పక్కింటివాళ్లతో పలకరింపులు కూడా మానేసింది. వాకిట్లో నుంచి బయటికి అడుగు పెట్టటం మర్చిపోయింది అతనికోసం. కూరగాయలక్కూడా ఇల్లు కదిలేది కాదు. అతనే తెచ్చేవాడు. ఓ సినిమా, ఓ సరదా... ఓ షికారు లేనేలేవు.

క్రమంగా ఓరోజు అతడి తాగుడు అలవాటు బయటపడింది. కాఫీ అలవాటు కూడా లేదనుకున్న అన్నయ్య ఎంత అమాయకుడు అనుకుని ఏడ్చేది. తలుపులు తీయటం ఒక్క నిమిషం లేటైతే ఎవరున్నారు లోపల అంటూ ఆమె ఒంటిమీద దెబ్బలు పడేవి. దెబ్బలు తినీ తినీ ఆమె మనసూ, శరీరం చచ్చుబడిపోయాయి. రెండేళ్ల కాపురం జీవితకాలపు పాఠాల్ని నేర్పింది ఆమెకి.

ఓరోజు గట్టి నిశ్చయానికొచ్చింది. అమ్మ దిగులుపడుతుందనో, అన్నయ్య బాధపడతాడనో ఇక తను భరించలేదు. రాజేష్ గురించి మామూలుగా చెప్పినా ఎవరూ నమ్మరు. ఈసారి ఊరు వెళ్ళినప్పుడు అన్నీ మొదట్నించీ తల్లితో, అన్నతో చెప్పుకురావాలి అని నిశ్చయించుకుంది. అంతే కాదు... తన జీవితానికో ఆధారం కావాలి. ఇంతకుముందులాగా అన్నమీద భారం మోపలేదు. తన కాళ్లమీద తను నిలబడాలి. సమస్యల్ని ఎదుర్కొని ధైర్యంగా ముందడుగు వేయాలంటే తనకొక ఆర్థిక ఆధారం ముఖ్యం అనుకుంది.

వెంటనే ఆమె చేతులు నాలుగు రోజుల క్రితం కిటికీలోంచి వచ్చిపడ్డ కంప్యూటర్ అకాడెమీ పాంప్లెట్ కోసం వెతికాయి. తీసి చూసింది. ఇంటికి కూడా దగ్గర్లోనే వుంది ఆ ఇన్‌స్టిట్యూట్. రాజేష్ ఆఫీస్‌కి వెళ్ళాక ఇంటికి తాళం వేసి అకాడెమీలో జాయిన్ అయ్యివచ్చింది. ఇంతకుముందు ఇంట్లోంచి బయటకు రావాలంటే భయం. వీగిపోయే సంసారానికి ఇంకా భయమెందుకు అని తనే ధైర్యం చెప్పుకుంది. అతనికి తెలీకుండా రెణ్ణెల్లుగా శ్రద్ధగా పాఠాలు నేర్చుకుంటోంది ఆమె. ఓ రోజు ఆఫీస్ నుంచి మధ్యాహ్నమే ఇంటికి వచ్చాడు అతను. స్రవంతి ఇంట్లో లేదు. రెండు గంటలపైగా వాకిట్లోనే కూర్చుని ఎదురు చూశాడు పంతంగా. అతనిలో దానవుడు క్షణక్షణానికీ నరమాంసభక్షణకోసం ఆవురావురుమంటున్నట్లు పైపైకి లేస్తున్నాడు.

వాకిట్లోకి రాగానే తనకోసం ఎదురుచూస్తున్న రాజేష్‌ని చూసేటప్పటికి పై ప్రాణాలు పైనే పోయాయి స్రవంతికి. నిశ్శబ్దంగా తాళాలు తెరిచింది. లోపలికి రావటంతోనే ఆమె వెనగ్గా నడుస్తూ, "ఎవడితో వెళ్ళావే ఇప్పటిదాకా?" అంటూ వెనుకనుండి బలంగా కాలితో తన్నాడు రాజేష్. ముందుకు బోర్లాపడిపోయింది. చేతిలో వున్న పుస్తకాలన్నీ చెల్లాచెదురైపోయాయి. ఆశ్చర్యంగా వాటిని తీస్కుని చూశాడు. "బేసిక్ నాలెడ్జ్ ఇన్ కంప్యూటర్స్" అక్షరాలు కనిపిస్తుంటే ఒక్కసారిగా నిలువెత్తు క్రోధం కమ్మేసింది అతన్ని. మనిషి రాక్షసుడైపోయాడు.

"ఎంత ధైర్యం నీకు? క్లాసులకెళ్తున్నావా? అంటే ఉద్యోగం చేద్దామనా... చేసి... నా ఎదురుగా నువ్వెంత అని మాట్లాడదామనా...? ఎంత పొగరే నీకు? మెత్తగా వుంటూ ఏమీ తెలీని నంగనాచిలా నాకు తెలీకుండా బయటికెళ్తున్నావా?" చేతుల్తో, కాళ్లతో స్రవంతిని అందిన చోటల్లా కొట్టసాగాడు.

అన్ని తన్నులు తింటూ కూడా... ఎన్నడైనా నోరెత్తని స్రవంతి ఆరోజు ఒక్కసారిగా లేచి నిలబడి వెనక్కి తోసింది అతన్ని. కళ్లల్లో నిప్పులు కురిపిస్తూ చూసింది అతనివైపు. "అవును. ఉద్యోగం చేద్దామనే వెళుతున్నాను. ఇంత జరిగాక

నీతో వద్దని అనుకునే వెళుతున్నాను. నీ నపుంసకత్వం కన్నా నీ శాడిజం నన్నెక్కువ బాధపెడుతోంది. ఇన్నాళ్లు ఓర్చుకుంది ఏనాటికైనా నీ మనస్తత్వం మారుతుంది, నన్ను అర్థం చేసుకుంటావనే ఆశతోనే. నువ్వు ఫిజికల్‌గానే కాదు మెంటల్‌గా కూడా అన్‌ఫిట్. టోటల్‌గా అన్‌ఫిట్ మేన్‌వి నువ్వు. ఏం చేస్తావో చెయ్. నీ చేతనైంది చేస్కో..." కోపంగా తిరగబడింది.

ఆమె కళ్లల్లో క్రోధాగ్నికి ఒక్క నిమిషం జంకాడు. కానీ అతనిలో పురుషాహంకారం ఆమెది పైచేయి కావటం ఇష్టంలేక మూర్ఖంగా "నన్నే ఎదిరిస్తావా?" అంటూ బెల్ట్‌తో బలంగా కొట్టసాగాడు.

ఒంటిమీద ఒక్కో దెబ్బ పడుతుంటే స్త్రీ సహజమైన అబలత్వంతో... నొప్పికి ఓర్చుకోలేక దెబ్బలు గట్టిగా తగలటంతో పొత్తికడుపు పట్టుకుని గిలగిలలాడసాగింది.

వాతావరణం ఇంత బీభత్సంగా వున్నప్పుడు చేతిలో ఓ ఫ్రూట్స్ బ్యాగ్, అమ్మచేసి పంపిన పిండివంటల లగేజి పట్టుకుని లోపలికి ఎంటరయ్యాడు శివరాం.

**ఒంటిమీద ఒక్కో దెబ్బ పడుతుంటే స్త్రీ సహజమైన అబలత్వంతో... నొప్పికి ఓర్చుకోలేక దెబ్బలు గట్టిగా తగలటంతో పొత్తికడుపు పట్టుకుని గిలగిలలాడసాగింది. వాతావరణం ఇంత బీభత్సంగా వున్నప్పుడు చేతిలో ఓ ఫ్రూట్స్ బ్యాగ్, అమ్మచేసి పంపిన పిండివంటల లగేజి పట్టుకుని లోపలికి ఎంటరయ్యాడు శివరాం.**

చెల్లెలు నేలమీదపడి గిలగిలలాడటం, రాజేష్ నిలబడి కాళ్లతో, చేతుల్తో ఆమెని కొట్టటం అతని కళ్ళబడింది. అంతే! ఉగ్ర నరసింహుడే అయ్యాడు. ఒక్కతోపులో రాజేష్‌ని అవతలికి నెట్టిపడేశాడు. గబగబా ఆటోని పిలిచి మాట్లాడే స్థితిలో లేని చెల్లెల్ని హాస్పిటల్‌కి తరలించాడు.

"ఎవరయ్యా ఇక్కడకు తీసుకురమ్మంది? కేసవుతుంది. ఆ అమ్మాయికి విపరీతంగా దెబ్బలు తగిలాయి. ఒళ్ళంతా లోపల పచ్చిపుండులా అయింది. ఏమన్నా అయితే నా బాధ్యత లేదు" అంటూ లేడీ డాక్టర్ శివరాం మీద కేకలు పెట్టింది.

"ఏదో... భార్యాభర్తల గొడవ, కొంచం చూడండమ్మా..." సర్దిచెప్పాడు.

కాసేపటికి అతన్ని లోపలికి రమ్మంది డాక్టర్.

"పెళ్లై ఎన్నాళ్ళయ్యింది?" అడిగింది ఆవిడ.

"రెండేళ్లు" చెప్పాడు.

"ఓ... షిట్. షి ఈజ్ వర్జిన్. పొత్తికడుపుకి బలంగా దెబ్బలు తగిలాయి. మెడిసిన్ రాస్తున్నాను. నాలుగురోజులు ఇక్కడే ఉంచండి" అంది ఆవిడ.

డాక్టర్ చెప్పిన మాటలకు శివరాంకి తల తిరిగినట్లైంది.

కన్సల్టింగ్ రూమ్‌లోంచి బయటకువస్తుంటే నర్సు ఎదురైంది. "ఆ అమ్మాయి మిమ్మల్ని పిలుస్తోంది" అని చెప్పింది. లోపలికి వెళ్ళాడు. దుఃఖంతో మాట రావటం లేదు స్రవంతికి. ఏడుస్తూనే రెండేళ్లుగా తను అనుభవించిన జీవితం వివరించింది. చివరికి "ఇక నేను ఇక్కడుండను అన్నయ్యా!" అంటూ తన నిర్ణయాన్ని కూడా చెప్పేసింది. రాజేష్ లోపలిరూపం తను కళ్ళారా చూశాడు కాబట్టి శివరాం కూడా చెల్లెలినేమీ అనలేదు. పైపెచ్చు తన ప్రాణానికి ప్రాణమైన చెల్లెలి జీవితం నాశనం చేశాడని అతనిమీద కోపం పేరుకుపోసాగింది. తమ కోసం... తాము బాధపడకూడదని ఇన్నాళ్లుగా ఇంత

హింసని అనుభవించిన స్రవంతిమీద ప్రేమ వెల్లువై పొంగింది.

మర్నాడు తల్లి, మేనమామ హాస్పిటల్‌కి వచ్చారు. విషయాలన్నీ విన్న వాళ్ల అమ్మ నిశ్చేష్టురాలైంది.

"బిడ్డలో సంతోషం లేదురా... రోజురోజుకీ నవిసిపోతుందిరా అంటే, 'ఏంలేదు లేమ్మా... నీ కళ్ళకి అలా కనిపిస్తుంది' అని నా మాటలు కొట్టిపడేసేవాడివి కదరా..." అంటూ శివరాంని పట్టుకుని ఏడ్చేసింది ఆవిడ.

వాళ్ళంతా హాస్పిటల్‌లో వుండగానే... ఇప్పుడే వస్తాను అని శివరాం రాజేష్ దగ్గరికి వెళ్ళాడు. కనీసం రెండ్రోజులుగా స్రవంతిని చూడటానికి కూడా రాలేదు అతడు. వెళ్ళేటప్పటికి చక్కగా బీరుబాటిల్సు ఓపెన్ చేస్కుని... బిర్యానీ తింటూ... టీవీ చూస్తున్నాడు. జరిగిందేమీ తనకు పట్టనట్లు చాలా రిలాక్స్‌డ్‌గా వున్నాడు అతను.

అతన్నలా చూడగానే శివరాం కోపం కట్టలు తెంచుకుంది. కసితీరేవరకు చేతికేది దొరికితే అది పట్టుకుని విరగబాదేశాడు అతన్ని. ఓ పక్క తన్నులు తింటూనే "యూ రాస్కెల్... ఆ బజారుదాని కోసం నన్ను కొడతావా?" అంటూ తిరగబడుతూనే ఉన్నాడు.

ఆ మాటలతో శివరాంకు మరింత మండింది. రాజేష్‌ని ఎముకల్లో సున్నం లేనట్లుగా కొట్టాడు.

"మరోసారి పెళ్ళి, గిళ్ళి అంటూ ఆడవాళ్లవైపు చూసినట్లు తెలిసిందో చంపేస్తాను. చాతకాని వెధవ" అంటూ అతణ్ణి తిడుతూ విసురుగా బయటికి వచ్చేశాడు.

"ఎంత పని చేశావురా...? ఇక దాని జీవితం?" వాళ్లమ్మ దిగులుగా అడిగింది.

"ఇంకా ఏంటమ్మా! మనతోనే వుంటుం దిలే. ఇప్పటికి అది అనుభవించింది చాలు. ఇంకా వాడి దగ్గరికే పంపిస్తే ఏదో ఒకరోజు దాన్ని చంపి మనకప్పగిస్తాడు. నీకో సంగతి తెలుసా? అసలు అత్తారిళ్లల్లో ఆడపిల్లలు రోజుకోరకంగా చస్తున్నారంటే ఆ తప్పు అత్తగార్లదో... మొగుళ్ళదో కాదమ్మా! పుట్టింటివాళ్లదే. తిరిగి వస్తే పుట్టింటి ఆదరణ వుండదనే... ఇక్కడ బతకలేక, అక్కడ బలవంతంగా బతుకుతూ సగంమంది చస్తున్నారు. తెలిసో, తెలియకో లక్షలకి లక్షలు కట్నాలు ఎవడి చేతిలోనో పోసే తల్లిదండ్రులు, బిడ్డ తిరిగొస్తే గుండెల్లో పొదువుకుని, అంత ముద్ద పెట్టి, వాళ్లకో బతికేదారి చూపిస్తూ ధైర్యాన్నిస్తే ఎందుకమ్మా చనిపోతారు?" ఆవేశంగా అడుగుతున్న అతడిని, "కరెక్టేరా!" అంటూ భుజం తట్టాడు రాఘవయ్య.

స్రవంతి వైవాహిక జీవితం ఓ విషాద గాథలా ముగిసిపోయింది.

వారం తర్వాత డిశ్చార్జీ అయ్యేరోజు రూమ్‌లోంచి బయటికొస్తుంటే స్ట్రెచర్‌మీద ఓ డెడ్‌బాడీని చూశారు వాళ్లు.

"పాపం లవ్ మ్యారేజ్ అంట. అతనూ... ఇవాళో, రేపో అనేట్లున్నాడు" చెప్పుకుంటూ తీసుకెళుతున్నారు. ఆ మాటలకి అనుకోకుండా అటుపక్కకి చూసింది స్రవంతి.

"అన్నయ్యా! లక్ష్మి..." వెర్రిగా కేకపెట్టింది స్రవంతి. అంతా స్ట్రెచర్ ఆపి చూశారు.

"అవును. లక్ష్మి... ఎలా జరిగింది?" నమ్మశక్యంగా లేదు ఎవరికీ.

"యాక్సిడెంటండీ... రూమ్ నెం. 9లో ఈవిడ భర్త వున్నాడు. ఎవరో ధర్మాత్ములు.. హాస్పిటల్‌లో చేర్చి డబ్బు కట్టి వెళ్ళారు" చెప్పారు వాళ్లు.

"అమ్మా... అన్నయ్యా..." అని ఏడుస్తూ అక్కడే కూలబడిపోయింది





# సాయి మయూరి

## టూరిస్టు రిసార్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్

షిరిడి ప్రవేశమే - సర్వదుఃఖ పరిహారం

ఒక టైమ్ షేర్ కొనండి - 3 లాభాలు పొందండి



## ప్రధాన కార్యాలయం

సాయి కాంప్లెక్స్, మొదటి అంతస్తు,
మయూరీ జంక్షన్,
**విజయనగరం.**
ఫోన్: 08922-550445,
235950 (ఆఫీసు)
సెల్: 93931 06791,
94409 73945, 93900 55554

## వివరములు:

### గోల్డ్ కార్డ్ వివరములు

1. మా గోల్డ్ కార్డు పొందిన ప్రతి సభ్యుడు రూ॥ 20,000/- చెల్లించిన పిదప ఒక టైమ్ షేరు ఇవ్వబడును.
2. మా హోటల్ యందు ప్రతి సభ్యుడు సుందర అలంకరణములతో కూడిన ఎయిర్ కండీషన్డ్ అతిథి గృహమునకు 3 రోజులు ఉచితముగా పొందగలరు.
3. ఏ సభ్యుడైన వారికి కేటాయించబడిన 3 రోజుల వసతి సౌకర్యము ఉపయోగించుకొనని యెడల సదరు సభ్యునకు ఆ సంవత్సరమునకు రూ.1,500/- లు నగదు పొందే సౌలభ్యము కలదు.
4. ఏ సభ్యుడైనా తనకు కేటాయించిన 3 దినముల ఉచిత వసతి అయిపోయిన తరువాత యింకనూ మా హోటల్‌లో బస చేసిన యెడల వారికి మా హోటల్ యందు 15% తగ్గింపు ఇవ్వబడును.
5. ప్రతి సభ్యుడుకు మా హోటల్ యందు గల రెస్టారెంట్‌లో 15% తగ్గింపు పొందగలరు.

### సిల్వర్ కార్డ్ వివరములు

1. మా సిల్వర్ కార్డు పొందిన ప్రతి సభ్యుడు రూ॥10,000/- చెల్లించిన పిదప ఒక టైమ్ షేరు ఇవ్వబడును.
2. మా హోటల్ యందు ప్రతి సభ్యుడు సుందర అలంకరణలతో కూడిన అతిథి గృహమును మూడు రోజులు ఉచితముగా పొందగలరు.
3. ఏ సభ్యుడైనా వారికి కేటాయించబడిన 3 రోజుల వసతి సౌకర్యము ఉపయోగించుకొనని యెడల సదరు సభ్యునికి ఆ సంవత్సరమునకు రూ. 750/-లు నగదు పొందే సౌలభ్యము కలదు.
4. ఏ సభ్యుడైనా తనకు కేటాయించిన 3 దినముల ఉచిత వసతి అయిపోయిన తరువాత యింకనూ మా హోటల్‌లో బస చేసిన యెడల వారికి మా హోటల్ యందు 15% తగ్గింపు ఇవ్వబడును.
5. ప్రతి సభ్యుడుకు మా హోటల్‌యందుగల రెస్టారెంట్‌లో 15% తగ్గింపు పొందగలరు.

ఇతర వివరములకు మా సాయి గ్రూప్ ఆఫ్ కంపెనీస్

## సాయి పైడిమాంబ ఫైనాన్స్ లిమిటెడ్

మొదటి అంతస్తు, సాయి కాంప్లెక్స్, మయూరి జంక్షన్, విజయనగరం. ఫోన్ నెం. 08922-550445

**ప్రియన్ జ్యూయలరీ**
గంటస్థంబం దరి, మెయిన్ రోడ్,
విజయనగరం. ఫోన్ నెం. 08922-550885

**సాయి వాసవీ చిట్‌ఫండ్స్**
కళ్యాణి ఎస్టేట్స్, రైల్వే ఆసుపత్రి ఎదురుగా,
విశాఖపట్నం ఫోన్ నెం. 0891-2761275

**ధనసహాయ ఫైనాన్స్ కార్పొరేషన్**
మంచుకొండవారి వీధి, విజయనగరం.
ఫోన్ నెం. 08922-550665

స్రవంతి.

స్రవంతికి ప్రాణ స్నేహితురాలు లక్ష్మి. ఇద్దరూ ఒకరికోసం ఒకరు ప్రాణంగా వుండేవారు. అటువంటిది నాలుగేళ్ల క్రితం సుధీర్‌ని ప్రేమించి, ఇంట్లోవాళ్లు ఒప్పుకోక పోవడంతో లెటర్ రాసిపెట్టి ఎటో వెళ్ళిపో యింది. మళ్ళీ ఇదే చూడటం. 'కనీసం నాకు కూడా చెప్పలేదు' అనుకుంటూ వుండేది స్రవంతి.

అంతా కలసి సుధీర్ రూమ్‌లోకి వెళ్ళారు. కొన ఊపిరితో వున్నాడతను. శరీరం అంతా బ్యాండేజిలతో నిండి పోయి... మొహం వాచిపోయి... కళ్లు మాత్రమే కన్పిస్తున్నాయి. ఒంటినిండా మిషన్లు టిక్‌టిక్‌మంటూ సౌండ్ చేస్తు న్నాయి. ఒకటి రెండుసార్లు లక్ష్మి పక్కన స్రవంతిని చూడటం వల్ల అంత బాధ లోనూ... ఆమెని గుర్తుపట్టాడు. కళ్ళతోనే సైగ చేశాడు పక్కన బ్యాగ్ చూపిస్తూ. స్రవంతి వెళ్ళి అది అతని దగ్గరగా తెచ్చి ఓపెన్ చేసింది. బట్టలన్నీ బయటకి తీసింది. కాదు.. కాదు... అంటూ తల ఊపుతున్నాడు. ఇంకా లోపల్నించి అన్నీ లాగేసింది. 'ఇదా...? ఇదా...?' అని అడుగుతుంటే లాస్ట్‌కి పోస్టల్ కవరొకటి బయటపడింది. అతను అవునన్నట్లుగా చూపులు మార్చాడు. తీసి చూస్తే దానిపై 'టు స్రవంతి' అంటూ అడ్రస్ రాసి వుంది. ఓపెన్ చేసి చదివింది.

"స్రవంతీ... ఎలా వున్నావ్? ఇంకా నా మీద కోపం పోలేదా? లేక నీ లక్ష్మిని పూర్తిగా మర్చిపోయావా...? నీకు పెళ్లై నట్లు మొన్నీమధ్య మన ఫ్రెండ్ రమ కలిసి చెప్పింది. అడ్రస్ కూడా ఇచ్చింది. వచ్చేవారం మీ హైదరాబాద్‌లో సుధీర్‌కి ఆఫీస్ వర్క్ వుంది. అలాగే నేనూ తనతో పాటు వస్తున్నాను. కేవలం నిన్ను చూడ టానికే సుమా! నా కోసం ఎదురుచూస్తూ వుంటావు కదూ...? అన్నట్లు మా అను రాగ చిహ్నం పేరు తరుణ్. వయసు నాలుగు నెలలు. వాడిని చూస్తే నువ్వు వదిలిపెట్టవు. అంత ముద్దొస్తాడు. ఏంటీ... తన కొడుకుని తనే పొగిడేసుకుం టుందనుకుంటున్నావా? ఏం చేద్దాం?



వాడి ముద్దు మురిపాలు చూడటానికి అమ్మమ్మలు, నాన్నమ్మలు కలిపి చేసిన పెళ్ళి కాదు మాది. ఇంకా అటువాళ్ళకి, ఇటు వాళ్ళకి మా మీద కోపాలు పోలేదు. నాకంటూ వుంటే నువ్వొక్కదానివే

స్రవంతీ...! నాలాగా కాకుండా నీలాగా... నువ్వేది కోరితే అది తెచ్చే అన్న ప్రేమ, నీ కోసం అనుక్షణం తపించే నీ తల్లిప్రేమ వంటి అదృష్టాలు దొరికేలా వాడిని పెంచాలనుకుంటున్నా. ఎప్పుడైనా... ఏదో



రోజు... కొన్నాళ్లైనా వాణ్ణి నీ దగ్గరే వుంచేస్తా. నీ అదృష్టం వాడికి కూడా కొంచం తగలనీ... ఇంకా బోల్డన్ని కబుర్లతో వస్తాలే... వుంటాను.

నీ లక్ష్మి...

'పోస్ట్ చెయ్యటంలో నేను సూపర్‌లేట్. నాకన్నా ఓ గంట ముందు ఈ లెటర్ చేరితే తిట్టుకోకు' అని కింద రాసి వుంది. అక్కడక్కడా కన్నీటి చుక్కలతో లెటర్ తడిచి వుంది.

"అదృష్టవంతురాలు... తన నేస్తం బతుకు సుడిగుండంలో చిక్కుకుందని తెలీకుండానే వెళ్ళిపోయింది" నిర్వేదంగా అనుకుంది స్రవంతి.

"బాబు... బాబు..." సుధీర్ మాటలు ముద్దగా వస్తున్నాయి.

"అవునూ... బాబెక్కడ? " అందరూ ఒకేసారి అడిగారు.

అప్పుడర్థమైంది అందరికీ... అతను ఆ లెటర్ ఎందుకు చదవమన్నాడో...

సుధీర్ చెప్పటానికి ప్రయత్నించినా... అతని వల్ల కావటం లేదు. నిస్సహాయంగా చూశాడు. అక్కడే వున్న నర్సు చెప్పింది. "దుర్గాంబ మెమోరియల్ హోమ్" వాళ్ళొచ్చి నిన్ననే తీస్కెళ్ళారు. ఆయనే సంతకం కూడా చేశారు. వాడొక్కడే దూరంగా ఎగిరిపడటంతో బయటపడ్డాడట"

"బాబు విషయం నే చూస్కుంటాను. మీరు నిశ్చింతగా వుండండి. వాడి బాధ్యత నాది" అతని దగ్గరిగా నిలబడి గట్టిగా చెప్పింది స్రవంతి.

ఆ మాటల కోసమే అతను బతికున్నట్లు... అప్పటిదాకా జీవంతో వున్న వాడు తృప్తిగా... మూసుకున్న కళ్లు మరి తెరవలేదు.

భార్యాభర్తల కర్మకాండలన్నీ శివరాం దగ్గరుండి చేశాడు. వాళ్లవాళ్లెవరూ రాలేదు. మనుషులెంత కఠినాత్ములు, పంతాలు... పట్టుదలల ముందు అన్ని బంధాలు తెగిపోయిన దారాలేనా అనిపించింది స్రవంతికి.

**రాజేష్ శివరాం మీద, స్రవంతి మీద రకరకాల కేసులు పెట్టాడు. తనని కొట్టారని, తన భార్య తనని మానసికంగా టార్చర్ చేస్తుందని... రోజుకో విధంగా వాళ్లని ఇబ్బంది పెట్టాడు. రాజేష్ తల్లిదండ్రులకి విషయాలన్నీ రాఘవయ్య ముందుగానే వివరించి వచ్చాడు.**

ఇంటికి చేరిన స్రవంతి నెమ్మదిగా అన్నీ మర్చిపోయే లోపు రాజేష్ శివరాం మీద, స్రవంతి మీద రకరకాల కేసులు పెట్టాడు. తనని కొట్టారని, తన భార్య తనని మానసికంగా టార్చర్ చేస్తుందని... రోజుకో విధంగా వాళ్లని ఇబ్బంది పెట్టాడు. రాజేష్ తల్లిదండ్రులకి విషయాలన్నీ రాఘవయ్య ముందుగానే వివరించి వచ్చాడు. దానితో వాళ్లు కొడుక్కి ఎటువంటి సపోర్ట్ ఇవ్వలేదు. కనీసం అంతవరకైనా నయం అనుకుంది స్రవంతి వాళ్లమ్మ. రాజేష్‌ని ఎదుర్కొని... అతనిపై స్రవంతితో విడాకులకు అప్లై చేయించి రెండేళ్ల పాటు కోర్టుల చుట్టూ తిరిగాడు శివరాం.

ఎక్కువగా ఏ విషయాలూ చెల్లితో మాట్లాడకుండా చూసుకునేవాడు, ఆమె బాధపడుతుందని. మరికొన్నాళ్లకి విడాకులు మంజూరు చేసింది కోర్టు. ఈలోపు స్రవంతి తరుణ్ కోసం 'దుర్గాంబ హోమ్'కి వెళ్లటం... కమలమ్మగారితో పరిచయం... కాల్ సెంటర్లో ఉద్యోగం, జీవితం ఓ ఒరవడిగా సాగింది.

భార్యతో ఎన్నోసార్లు అనేవాడు రాఘవయ్య "అన్నా చెల్లెళ్ళిద్దరూ చూడవోయ్... ఎంత చక్కగా జీవితాల్ని సరిదిద్దుకుంటు

న్నారో... " అంటూ ముచ్చట పడేవాడు. మధ్యలో స్రవంతి తల్లి జబ్బునపడి కాలం చేసింది. కూతురిమీద బెంగతోనే పోయిందని అనుకున్నారు అందరూ. అన్నీ బాగుంటే... ఈపాటికి శివరాం, సునందల పెళ్ళి జరిగివుండేది అంటూ నిట్టూర్చేవాడు రాఘవయ్య.

లక్ష్మిమీద ప్రేమతో... తరుణ్‌ని చూసి ముచ్చటపడి అన్నను ఎన్నోసార్లు అడిగింది స్రవంతి, వాడిని ఇంటికి తెచ్చేసుకుందామని. చెల్లెలి కోరిక ఏదీ కాదనే అలవాటు లేని శివరాం తరుణ్‌ని మాత్రం ఇంటికి తేవద్దనేవాడు.

"వాణ్ణి మధ్యలో వెళ్లి చూసొద్దాం. వాడి చదువుకు కావలసిన ఏర్పాట్లు చేద్దాం. కొన్నాళ్లు పోనీ... అప్పుడు తీసుకొచ్చి మనమే వుంచుకుందాం... వాడి బాధ్యత మనదే..." అంటూ విషయాన్ని దాటేసేవాడు.

మరికొన్నాళ్లకైనా స్రవంతి జరిగినవన్నీ మర్చిపోయి ఓ దారినపడితే... ఓ ఉత్తముడిని వెతికి పెళ్ళిచేసి... పిల్లా పాపలతో ఆమె కళకళలాడుతుంటే చూడాలని అతని కోరిక. స్రవంతితో తరుణ్‌ని ఎవరైనా చూస్తే... వాడిని ఆమె బిడ్డ అని పొరబడే అవకాశం వుంది అనే అభిప్రాయం అతనిది.

★ ★ ★

అక్కడ- వసంతతో మాట్లాడుతోంది నందిని, "ఇక ఇవన్నీ కాల్చేద్దామా- రేపెవరికైనా తెలిస్తే బాధపడే అవకాశం వుంది" చేతిలోని ఫైల్స్ చూపిస్తూ అడిగింది.

స్రవంతి గురించి కమలమ్మగారు మరీ మరీ చెప్పాక నందిని ఆమె గురించి పర్సనల్‌గా అబ్జర్వేషన్ చేయించింది. ఆమె ఎటువంటిదో స్వయంగా తెలుసుకోవాలనుకుంది. వందలకోట్ల ఆస్తికి హక్కుదారు కాబోయే అమ్మాయి... ఇద్దరు పసిబిడ్డల బాధ్యత తీస్కోబోయే అమ్మాయి... మానసికంగా స్వచ్ఛమైన మనిషి కావాలనుకుంది. దానితో తన మనుషులను పెట్టి రెండు నెలలుగా స్రవంతి దినచర్య

## న్యాయస్థానాలలో నవ్వుల పువ్వులు

**న్యాయస్థానాలలో సాగే లావాదేవీలు సీరియస్‌గా ఉన్నా, అప్పుడప్పుడు నవ్వులూ పూయిస్తాయి. వకీళ్లు, సాక్షులు, న్యాయమూర్తుల హాస్యస్ఫూర్తే దీనికి కారణం. బద్దిగం పాండురంగారెడ్డి ఏర్చికూర్చిన అలాంటి జోకులు కొన్ని మీకోసం ప్రత్యేకం..**

### నేనున్నాను

ఒక కేసులో ఉభయ పక్షాల న్యాయవాదులూ పరస్పరం వాదులాటకు దిగారు.

'నీకంటే మూరుణ్ణి నేనెక్కడా చూడలేదు' అని ఒక లాయరు అంటే- రెండో లాయరూ 'నేనూ అదే అనుకుంటున్నాను' అన్నాడు.

వాళ్ళను అదుపులో పెట్టే ఉద్దేశంతో న్యాయమూర్తి 'చూడండి, మీరిద్దరూ నేనిక్కడ వున్నానన్న సంగతి విస్మరిస్తున్నారు' అన్నాడు.



గురించి ఆరా తీయించి, రికార్డు రాయించింది.

ఆమె చేతిలో వున్న ఫైల్స్... చంద్రుడికైనా మచ్చవుంటుందేమో కానీ, ఈ స్రవంతి వ్యక్తిత్వానికి ఎటువంటి లోటు లేదు అని ఆమె తెలుసుకున్న నిజాలు. బిజినెస్ ఉమెన్ అయిన నందిని కొన్ని కుటుంబ విషయాల్లో కూడా పక్కా బిజినెస్ ఉమెన్‌గా ఆలోచిస్తుంది, చేస్తుంది. రెండు నెలలుగా ఉదయం నిద్రలేచిన దగ్గర్నుంచి... రాత్రి నిద్రబోయేవరకూ స్రవంతి ఏంచేసిందో ప్రతిరోజూ రికార్డ్ చేయబడ్డ వివరాలన్నీ వున్న ఆ ఫైల్స్‌ని మరోసారి చూసి తనే స్వయంగా కాల్చిపడేసింది నందిని.

వారం గడిచినా శివరాం దగ్గర్నుంచి ఎటువంటి కబురూ రాలేదు కమలమ్మగారికి. జరిగిందేమీ తెలియని స్రవంతి ఎప్పటిలాగా ఆ ఆదివారం ఆశ్రమానికొచ్చింది. స్రవంతే కాదని వుంటుందనుకున్న ఆమె డైరెక్టుగా స్రవంతితోనే మాట్లాడింది.

"స్రవంతీ... పెద్దదాన్ని ఏదో చెప్తున్నాను అనుకోకు. అన్ని విషయాల్లోనూ మొండిపట్టు పనికిరాదు. జీవితమన్నాక ఎగుడుదిగుళ్లు వుంటాయి. సర్దుకుని ముందుకు వెళ్ళటమే మనుషుల లక్షణం" చెప్పుకుపోయింది ఆవిడ.

"మీరు ఏ విషయం మాట్లాడుతున్నారు?" అయోమయంగా అడిగింది.

"అదే... నందిని వచ్చిపోయిన విషయం. శివరాం అన్నీ చూసే వచ్చాడుగా... చైతన్య ఎంతో మంచివాడు. నీ విషయమే తీసుకో. ఎన్నాళ్ళిలా మోడువారినదానిలా వుంటావ్? మీ అన్నయ్య వయసెంతని? అతను మాత్రం పెళ్ళిచేస్కోని సంతోషంగా ఉండొద్దా? అతని కోసం మీ మావయ్య కూతురు ఎన్నో ఆశలు పెట్టుకుని ఎదురుచూస్తుందని ఒకసారి నువ్వే చెప్పావు. ఎవరమ్మా... తోడ బుట్టినవాళ్లు. ఒకరికోసం ఒకరు పెళ్ళిళ్ళయ్యాక కూడా బాధపడుతూ కూర్చునేది? నాకు తెలిసి ఎంతోమంది అన్నదమ్ములు... చెల్లో, అక్కో ఇంటికి తిరిగివస్తే ఎక్కడ తనమీద పడుతుందోనని ముందు ముందుగానే తప్పించుకుంటారు. అటువంటిది నీ కోసం తన పెళ్ళి కూడా వాయిదా వేస్కొని నీ జీవితం బాగుండాలని శివరాం తాపత్రయపడుతున్నాడు. అతని కోసం కూడా కొంచం ఆలోచించు" చెప్పింది ఆవిడ.

"అంతగా అన్నయ్య జీవితానికి నేనే అడ్డు అనుకుంటే... మీలాగే... ఇక్కడే జీవితాంతం ఇలాగే ఈ పిల్లల సేవలోనే గడిపేస్తాను. ఇక్కడే వుండిపోతాను" కళ్ళల్లో నీళ్లు తిరుగుతుంటే చెప్పింది స్రవంతి.

"పిచ్చిదానా... నిండు జీవితాన్ని అనుభవించినదాన్ని నేను. మా వారి కలలదీపం ఈ 'దుర్గాంబ హోమ్'. పిల్లలు లేని మాకు మా అత్తగారి పేర్న స్థాపించిన ఈ హోమ్ ఎంతోమంది పిల్లల్ని కన్న తృప్తినిచ్చింది. కాకపోతే ఒకరు ముందు, మరొకరు వెనుకగా... నాకు ఈ బాధ్యతలను అప్పచెప్పి ఆయన ముందుగానే వెళ్ళిపోయారు" గొంతు గద్గదమయింది ఆమెకి.

"మీ అన్నయ్య తెచ్చే పెళ్ళికొడుకు చైతన్యలాగా వుంటాడో లేదో కానీ... చైతన్యను పొందిన స్త్రీలు నిజంగా అదృష్టవంతులే. పైగా ఇక్కడి పిల్లలతో అనుబంధం పెనవేసుకున్నట్లే... అక్కడ తల్లి ప్రేమకు దూరం కాబోతున్న ఇద్దరు చిన్నారులను చేరదీసి వాళ్ల జీవితానికి ఓ గమ్యాన్ని చూపిస్తే... నీ జన్మ సార్థకమయినట్లే. మీ అన్నయ్య దృష్టిలో నీ జీవితానికీ... ఓ అర్థం దొరికినట్లే..." చెప్పింది ఆవిడ.

స్రవంతి శ్రద్ధగా వినటం చూసి, "ఈ విషయాలన్నీ ఇప్పటిదాకా చైతన్యకు తెలియవు. నందిని, వసంత ఆలోచనలు మాత్రమే. అతన్ని వాళ్లెలా ఒప్పిస్తారో వాళ్లకే తెలియాలి" అంది.

కమలమ్మగారి మాటలతో భార్య వుండగానే మరో పెళ్ళికి ఒప్పుకున్న మగాడిగా అతని మీద ఏర్పడ్డ దురభిప్రాయం తొలగింది స్రవంతికి. నిజమే... ఆ పసిపిల్లల్ని చూస్కుంటూ అయినా తను గడిపేస్తుంది. తనకి తన అన్నయ్య జీవితం ముఖ్యం. తన బతుకు ఏమయితేనేం? ఇప్పుడేమైనా సర్వసుఖాలతో భర్త నీడన అలరారుతోందా తను? ఆలోచనలో పడింది స్రవంతి.

స్రవంతికి చెప్పినట్లే శివరాంకీ చెప్పింది కమలమ్మగారు.

"నువ్వు తెచ్చే పెళ్ళికొడుకు రేపు స్రవంతిని నానా మాటాలూ అనడని గ్యారంటీ ఏమిటి? నీ పాత మొగుడు నీతో ఎలా వుండేవాడు అని తనని గుచ్చిగుచ్చి చంపితే దిక్కెవరు? ఎంత మందిని చూడటం లేదు...? ఎన్ని కథలు చదవటం లేదు...? చైతన్య గురించి నాకు తెలుసు కాబట్టి నేను హామీ ఇవ్వగలుగుతున్నాను. పైగా పిల్లల ఆలనా, పాలనా చూస్కుంటూ స్రవంతి కూడా తన కొత్త జీవితానికి అలవాటు పడిపోతుంది. అక్కడ నీ చెల్లెలు చేయాల్సిన పనులేమీ లేవు. కొద్దిగా ఆ పసిబిడ్డల్ని పట్టించుకోవటం తప్పితే. నువ్వే చూశావుగా... అక్కడెంతమంది పనివాళ్లున్నారో... అంతేకాదు ఈ సంబంధం స్రవంతి కూడా ఒప్పుకుంది."

ఆ మాటలతో అతను మెత్తబడ్డాడు.

వీళ్ల దగ్గర్నుంచి ఎటువంటి రిప్లై రాకపోవటంతో... అక్కడ వసంత దిగులుగా పిల్లలిద్దర్నీ అక్కున చేర్చుకుని బిక్కుబిక్కుమంటూ గడుపుతూ వుంది. వీళ్లకిక దిక్కెవరు? చైతన్య ఎప్పుడు చూసినా బిజీ. కోట్ల రూపాయల టర్నోవర్. ఎంత చెట్టుకి అంత గాలి అన్నట్లు బిజినెస్ వ్యవహారాలు మధ్యలో వదిలేస్తే భూస్థాపితమై పోతారు. నందిని ఆమె పరిస్థితి చూసి ధైర్యం చెబుతోంది.

నువ్వు తెచ్చే పెళ్ళికొడుకు రేపు స్రవంతిని నానా మాటాలూ అనడని గ్యారంటీ ఏమిటి? నీ పాత మొగుడు నీతో ఎలా వుండేవాడు అని తనని గుచ్చిగుచ్చి చంపితే దిక్కెవరు? ఎంత మందిని చూడటం లేదు...? ఎన్ని కథలు చదవటం లేదు...? చైతన్య గురించి నాకు తెలుసు కాబట్టి నేను హామీ ఇవ్వగలుగుతున్నాను.

"మేమంతా లేమా? నాకు మాత్రం పిల్లలున్నారా? వీళ్లని చూస్కోకుండా గాలికి వదిలేస్తామని ఎలా అనుకుంటున్నావ్?" అంటూ మందలిస్తుంది.

"మీరంతా బిజినెస్ మేగ్నెట్స్. బిజీ పీపుల్. కానీ నా దృష్టిలో నా బిడ్డలకి సంపూర్తిగా నాలా తల్లిలా అంకితమయ్యే వాళ్లు కావాలి" చెప్పే ధైర్యం లేక మనసులోనే బాధపడుతుంది వసంత.

ఓ రోజు కమలమ్మగారి దగ్గర్నుంచి ఫోన్ అందుకున్నారు, పెళ్ళి ఏర్పాట్లు చేసుకొమ్మని. లా ప్రకారం వసంత అన్నింటికి ఒప్పుకుంటున్నట్లుగా ఫామ్స్ తయారయ్యాయి.

ఆఖర్న చైతన్య చెవిన వేశారు విషయం అంతా.

భార్య అతన్నెంత ప్రాధేయపడిందో, వాళ్లెంత తర్జన భర్జనలు పడ్డారో భగవం తుడికే తెలియాలి.

భార్య పరిస్థితి ఇవాళో, రేపో అన్నట్లుగా వుండటం... అతను ఆ బాధ రెండేళ్లుగా అనుభవిస్తూనే వున్నాడు. కానీ ఈ పెళ్ళి.. అతనికి మరింత షాక్ నిచ్చింది.

మరో పదిరోజుల్లో రిజిస్ట్రార్ ఆఫీసులో నందిని, ఆమె భర్త రాఘవయ్య, జాన కమ్మ గార్ల సాక్షి సంతకాలతో పెళ్ళి జరిగి పోయింది.

సంతకం చేస్తూ చైతన్య అనుభవిస్తున్న నరకం అతని మొహంలో కనబడుతోంది అందరికీ. ఎవరివైపూ చూడలేదు అతను. పక్కన నిలబడ్డ అమ్మాయెవరో తెలుసుకో వటానికి కూడా అతను ఇష్టపడలేదు. ఇంటికొచ్చేవరకు తప్పు చేసిన వాడిలాగా తల దించుకునే వున్నాడు.

సంప్రదాయం ప్రకారం స్రవంతిని కుడి కాలు పెట్టి లోపలికి రమ్మంది నందిని. తండ్రి గదిలోకి తీస్కెళ్ళింది. ఆమెనాశీర్వ దిస్తుంటే ఆయన కళ్ళవెంట నీళ్ళు రాలాయి. "ఎవరిని సంతోష పెట్టటానికి చేసుకుంది తను?" స్రవంతికి ఒక నిమిషం భయంగా అన్పించింది.

"పద... వసంత రూమ్‌లోకి వెళ్ళు. నేను రెండు నిమిషాల్లో జ్యూస్ తీసుకొ స్తాను" గది చూపిస్తూ అంది నందిని. వసంత రూమ్‌లోకి నడుస్తుంటే స్రవంతి కాళ్లు వణకసాగాయి. తడబడే అడుగులతో లోపలికి నడిచింది.

అక్కడ- "ఆఖరి కోరికన్నావు. ఇప్పుడు నీకు సంతోషంగా వుందా? దిగులుగా ఏడుపు గొంతుతో భార్యని అడుగుతున్నాడు చైతన్య. అతని మానసిక ఘర్షణకు అద్దం పడుతున్నట్లుగా ఇందాక అతని మెడలో వేలాడిన పూలదండ విసిరేసి నేలకేసి కొట్టి నట్లుగా పూలన్నీ చిందరవందరగా నేలంతా పరచుకుని వున్నాయి. వసంత బెడ్‌పైన కాళ్లు జాపుకుని దిండ్ల కానుకుని కూర్చుని వుంటే, చైతన్య నేల మీదుగా మోకాళ్లపై కూర్చుని ఆమె ఒళ్లో మొహం దాచుకుని వున్నాడు. అతను ఏడుస్తున్నట్లుగా ఎగిరె గిరి పడుతోందతని వీపు. ఆమె సజలనయ నాలతో అతని జుట్టులోకి వేళ్లు పోనిచ్చి తల నిమురుతోంది, అతని దుఃఖాన్ని తగ్గించడానికన్నట్లు.

ఆ దృశ్యం చూసిన స్రవంతి ఒక్క నిమి షంలో పక్కకు తప్పుకుంది. "ఎంత చక్కని జంట... వీళ్ళకా ఈ బాధలు..." స్రవంతి కనుకొనలు తడి అయ్యాయి.

"ఇంకా ఇక్కడే నిలబడ్డావ్... పద వెళ్దాం" జ్యూస్ తీసుకొని బెడ్‌రూం దగ్గరికి వచ్చింది నందిని. బయట మాటలు విన్పించటంతో చైతన్య వడివడిగా లేచి బయటికి వెళ్ళిపోయాడు.

"రా..." స్రవంతిని చెయ్యి చాపి సాద రంగా ఆహ్వానించింది వసంత.

"ఇలా కూర్చో..." తన పక్కనే మంచంమీద జరుగుతూ చోటిచ్చింది. ఎన్నో ఏళ్లు పరిచయమున్న దానిలాగా స్రవంతి చేతిని తన చేతిలోకి తీసుకుంది. ఆ స్పర్శలోనే తెలిసిపోయింది స్రవంతికి... తనంటే ఆమెకి ఎంత ఇష్టమో... ఏ పరి చయం లేకుండా ఇదెలా సాధ్యం? అను కుంది.

"మీకిప్పుడు ఒంట్లో ఎలా వుంది?" చిన్నగా గొంతు పెగుల్చుకుని అడిగింది.

"అలాగే... గడుస్తోంది" ఆమె పెదా లపై నిర్లిప్తమైన నవ్వు.

నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ పిల్లలిద్దరూ... అప్ప టిదాకా బయట ఆడుకుంటున్నవాళ్లు "మమ్మీ!" అంటూ ఒకరి తర్వాత ఒకరు దూకుడుగా వచ్చేశారు.

"ఆషా... అలా గబుక్కున మంచం మీద పడిపోవద్దని చెప్పానా..." గట్టిగా

అంది నందిని.

"పోనీలే వదినా..." వాళ్లని దగ్గరికి తీసుకుంటూ చెప్పింది వసంత.

"ఇది ఆషా... పెద్దది. నిషా... చిన్నది... బాగా అల్లరి" స్రవంతికి పరిచయం చేసింది వసంత.

"హాయ్ ఆంటీ..." విష్ చేశారు ఇద్దరూ కోరస్‌గా. ముద్దులొలుకుతూ... ముద్ద బంతి పువ్వుల్లా వున్న వాళ్లని చూసి "వీళ్ళిద్దరిలో ఎవరు ఎవరో కనిపెట్టడం కొద్దిగా కష్టమే" అనుకుంది స్రవంతి.

"మీరిద్దరూ ఏం చదువుతున్నారో ఆంటీకి చెప్పండి..." అంది వాళ్లమ్మ.

"ఎల్.కె.జి." అని ఒకరంటే, "లిటిల్ ఏంజిల్స్ స్కూల్" అంటూ మరొకరు చెప్పారు.

"అయితే నేను.. సెక్షన్ ఎ, నిషా.. బి" చెప్పింది ఆషా.

"మరేం మా టీచర్‌కి కన్‌ఫ్యూజ్ అయిపోతుందంట మమ్మల్ని చూసి. అందుకే వేర్వేరే సెక్షన్స్‌లోకి డివైడ్ చేసింది" నిషా అంది.

"నాకు బోల్డన్ని రైమ్స్ వచ్చు" ఆషా అంది.

"నాకు స్టోరీ టెల్లింగ్ కూడా వచ్చు, ఆషాకి రాదు" వెక్కిరింపుగా అంది నిషా.

"ఏం లేదు... మా టీచర్ నెక్స్ట్ వీక్ చెప్తానన్నారుగా..." ఉడుక్కుంటూ అంది ఆషా.

"మీ టీచర్‌కి సరిగ్గా రాదు"

"మీ టీచర్‌కే సరిగ్గా రావు"

"కాదు"

"కాదు"

"ఆపండర్రా బాబూ... ఏదో ఆంటీకి మిమ్మల్ని చూపిద్దామనుకుంటే... పోట్లాటల్లోకి దిగిపోయారు"

"ఎప్పుడూ ఇంతే స్రవంతి... నిమిషంలో కలిసి ఆడుకుంటే మరో నిమిషంలో పోట్లాడుతూ వుంటారు" కూతుళ్ళిద్దరినీ మురిపెంగా చూస్కుంటూ అంది వసంత.

అలా... ఆ ఇంట్లో ఆమె మొదటిరోజు మొదలైంది.

ఓ ఇరవైరోజులు గడిచేటప్పటికి కొద్దిగా అలవాటు పడసాగింది స్రవంతి. వసంత చనువుగా మాట్లాడటం నందిని కూడా తోడుగా ఇక్కడే వుండటంతో కొత్తదనం వదిలి భయం తగ్గసాగింది. కానీ ఆ ఇంటి వాతావరణం తనకు తెలిసినట్లుగా మాములుగా లేకపోవటంతో ఆ ఇంటి గాంభీర్యత... హోదా... తనెప్పటికీ ఇక్కడ కొన్నాళ్లు గడపటానికి వచ్చిన అతిథిలా అనిపిస్తుంది. ఒక్కోసారి మనసులో దిగులు కమ్ముకునేది. 'తనెప్పటికీ ఇక్కడే వుండాలా? ఇదే తన జీవితమా? కానీ వసంత పరిస్థితి ముందు తనదెంత?' అన్పించేది. చనిపోతానని తెలిసీ... పసిబిడ్డల్ని వదల్లేక... భర్తకి తన కళ్లముందే మరో మనిషితో ముడిపెట్టి ఆమె ఎంత బాధననుభవిస్తోందో అన్పించేది.

**'తనెప్పటికీ ఇక్కడే వుండాలా? ఇదే తన జీవితమా? కానీ వసంత పరిస్థితి ముందు తనదెంత?' అన్పించేది. చనిపోతానని తెలిసీ... పసిబిడ్డల్ని వదల్లేక... భర్తకి తన కళ్ల ముందే మరో మనిషితో ముడిపెట్టి ఆమె ఎంత బాధను అభవిస్తోందో అన్పించేది.**

చైతన్య ఆఫీస్‌కి వెళ్ళిపోయాక వసంత దగ్గర ఎక్కువగా గడిపేది. అతను ఇంట్లో ఉంటే గదిలోంచి బయటకు వచ్చేది కాదు. ఏదో తెలీని భయం. వసంత మాత్రం పిల్లల ఇష్టాలు, చైతన్య ఇష్టాలు... మామగారి అలవాట్లు... వాళ్ల దినచర్య అన్నీ సమస్తం ఓ ఫ్రెండ్‌కి చెప్పినట్లుగా చెప్తూ వుండేది. ఒక్కోసారి అప్పగింతలు పెడుతున్నట్లుగా మాట్లాడేది. చైతన్య బంధు

వుల దగ్గర కూడా జాగ్రత్తగా వుండమని చెప్పేది. మరోసారి కనీసం మా తల్లిదండ్రులు బతికుంటే నేనింత అధైర్యపడేదాన్ని కాదు అంటూ ఏడ్చేది. అటువంటప్పుడు స్రవంతికి ఏమని ఓదార్చాలో అర్థం అయ్యేది కాదు. తన పెళ్లైన నాటినుండి తీసిన ఫొటో ఆల్బమ్స్, వీడియోలు చూస్తూ ఉండేది. వీటి గురించి చెప్పినప్పుడు ఆమె కళ్లలో విపరీతమైన వెలుగు... సంతోషం కనిపించేవి. చైతన్య గురించికానీ, పిల్లల గురించికానీ మాట్లాడేటప్పుడు కోటి సూర్యుల ప్రకాశాన్ని ఆమె మోములో చూసేది స్రవంతి.

"ఇది స్విట్జర్లాండ్‌లో తీసిన ఫొటో. అప్పుడేం జరిగిందో తెలుసా...?" ఆ ప్రాంతానికి వెళ్ళిపోయేది ఆమె మనస్సు.

"ఇది న్యూయార్క్‌లో. చైతన్యతో బిజినెస్ కాన్ఫరెన్స్‌కి వెళ్ళినప్పుడు..." మరోసారి మైమరచిపోయేది.

ఓ రోజు, "ఇవి నీ దగ్గర వుంచు" అంటూ ఏవో పేపర్స్ స్రవంతి చేతిలో పెట్టింది.

"ఏమిటక్కా ఇవి?" కొంచెం చనువు ఏర్పడటంతో అడిగింది.

"ఇవి నేనొక్కదాన్నే కావటంతో నాకు వచ్చిన పుట్టింటి ఆస్తి. అందులో వున్న స్థలాలు, బిల్డింగ్స్ అన్నీ ఐదుకోట్ల రూపాయల విలువ చేస్తాయి. నీ పేర్న రాశాను. దీనితో చైతన్యకెటువంటి సంబంధం లేదు. ఏ రోజుకైనా నా బిడ్డలనుంచో, చైతన్య నుంచో, అతని తరపు వాళ్లనుంచో నీకన్యాయం జరిగితే.... నా కోసం బలవంతపెట్టి నిన్నిక్కడికి తీసుకువచ్చాం. నీకు నేను చేయగలిగిన న్యాయం ఇదొక్కటే" ఆయాసపడింది.

"ఇవన్నీ నేనేం చేస్కుంటాను? అయినా నేనంత మంచిదాన్నని మీరెలా...?" స్రవంతి మాటల్ని అడ్డుకుంటూ,

"పాలు చిక్కనైనవా, కావా అని తెలుసుకోవటానికి గృహిణులకు ఒక్క నిమిషం చాలు" విశ్వాసంగా చెప్పింది.

ఇంతకుముందు స్రవంతికొచ్చే జీతంలో ఇంటికి అయిదువేలు ఖర్చుకి వాడితే, మిగతాసగం కమలమ్మగారికి ఆశ్రమానికి ఇచ్చేది. ఆపైన వచ్చే నాలుగువేలూ... రవి పేర్న, తరుణ్ పేర్న చెరిసగం ఫిక్సెడ్ చేసేది. ఈ విషయం కమలమ్మగారు చెప్పగా విన్నది వసంత.

"దయచేసి మన బంధాన్ని డబ్బుతో ముడిపెట్టకండి" బాధగా అంది స్రవంతి.

"కరెక్టే... కానీ, నేను ఈ పని చేసింది ఎందుకో తర్వాత్తర్వాత నీకే అర్థమవుతుంది. నీకు వద్దనుకుంటే కొన్నాళ్లాగి కమలమ్మగారికి అందచెయ్. నలుగురు అనాథల జీవితాన్నికైనా ఉపయోగపడుతుంది" చెప్పింది.

"నీకో సంగతి తెలుసా స్రవంతీ... చైతన్య ప్రాపర్టీస్ విలువ ఈరోజు బయటి మార్కెట్లో సుమారుగా 400 కోట్ల రూపాయలు. ఐరన్ పార్ట్స్ తయారుచేసే ఫ్యాక్టరీ, వదినగారిలా గార్మెంట్స్ ఫ్యాక్టరీ, ప్లైవుడ్ షీట్స్ తయారీతో ఇంటర్నేషనల్ ఎక్స్‌పోర్ట్ చేసే ఫ్యాక్టరీ ఇక్కడ, హైదరాబాద్‌లో ఎన్నో స్టార్ హోటల్స్, బిల్డింగ్స్ వాటిమీద వచ్చే ఆదాయాలు... లెక్క చూసుకోవటానికి కూడా చైతన్యకు టైమ్ సరిపోదు. మామగారు ఇచ్చినదాన్ని పదింతలు చేశారు. అంతే కాదు... ఆయన ఎంత మంచివారంటే..." చెప్తున్న ఆమె కళ్ళల్లో మెరుపు... "అన్ని రకాల ఫ్యాక్టరీస్ వున్న చోటల్లా... వర్కర్స్‌కి 30 శాతం షేర్... ఏ సంవత్సరం లాభం ఆ సంవత్సరం వాళ్ల ఎకౌంట్స్‌లోకి వెళ్ళిపోతుంది. ప్రతిచోటా పనిచేసే వాళ్లందరికీ ఫ్యాక్టరీ పక్కనే కొన్ని ఎకరాల స్థలాల్లో పక్కా ఇళ్లు కట్టించి ఇచ్చారు. వాళ్ల పిల్లల చదువులకైనా... రోగాలకైనా... అవసరం

పడివస్తే... ముందూ, వెనకా చూడకుండా సహాయం చేస్తారు. వర్కర్స్ అంతా చైత న్యంటే ప్రాణం పెడతారు. ఒక మనిషి తేలిగ్గా డబ్బు సంపాదించవచ్చు కానీ, అంత మంది మనుష్యుల ఇష్టాన్ని సంపాదించటం చాలా కష్టం. ఎప్పుడైనా, ఎవరైనా... చివరికి నేనైనా తనని మెచ్చుకుంటే ఒప్పుకోరు. ఇదంతా మా టీమ్‌వర్క్ ఫలితం అంటారు"

వింటున్న స్రవంతికి ఆశ్చర్యం వేసింది. చిన్నప్పుడు డబ్బున్న పక్క పొలాల భూస్వాములు ఎవరైనా వీళ్ల మీదికి అన్యా యంగా గొడవకొస్తే తల్లి విసుక్కునేది. "కూడేకొందికి కుండ పెంకులు ఏరాలనిపి స్తుంది వీళ్లకి" అని తిట్టుకునేది. సంపద అంతటి వ్యామోహాన్నిస్తుందన్న మాట అనుకునేది.

కానీ చైతన్య విషయం విన్నాక ఇలాంటి వారు కూడా వుంటారా అన్పించింది.

"నేనొచ్చిన దగ్గర్నుంచీ అలిసిపోతు న్నారు. నర్సు కూడా అంటోంది... పడు కోండి" దుప్పటి కప్పి బయటికి వచ్చేసింది స్రవంతి. తన గురించి అన్ని మాట్లాడిన వసంత, స్రవంతి పాత జీవితం గురించి మాటవరసకైనా ఎత్తలేదు. ఆమె సంస్కా రానికి ముచ్చటేసింది.

"హాయ్ ఆంటీ..." హాల్లో కూర్చుని హోంవర్క్ చేస్తున్న నిషా చెప్పింది.

"ఆంటీకాదు. చిన్న మమ్మీ... నిన్న మమ్మీ చెప్పింది కదా..." ఆషా కోప్ప డింది.

"కాదు... ఆంటీనే..."

"కాదు చిన్న మమ్మీ..."

ఇద్దరూ వాదనలోకి దిగిపోయారు. "అరే... మీరిలా పోట్లాడుకుంటే ఎలా...? రేపు టీచర్‌కి హోంవర్క్ ఏం చూపి స్తారు? " మధ్యలో కూర్చుని వాళ్ల బుక్స్ చూస్తూ హోంవర్క్ కంప్లీట్ చేయించింది. వాళ్లతో ఇప్పుడిప్పుడే చనువు ఏర్పడుతోంది స్రవంతికి. వాళ్లకి ఊహ తెల్సిన దగ్గ ర్నుంచీ... తల్లి బయటికి రావటం ఎప్పుడూ చూళ్లేదు. బెడ్‌రూంలో మంచా నికి అతుక్కుపోయి వుండేది. కానీ, ఆమె తోపాటు వున్న కొంచం సేపైనా వాళ్లమీద అనంతమైన ప్రేమ కురిపించేది. బయట ఆయాలు, వాచ్‌మెన్‌లు, పనివాళ్లు ఎంత మందున్నా... అంతప్రేమ వాళ్లు మళ్ళీ ఎవరి దగ్గరా చవిచూడలేదు. ఇప్పుడు కొత్తగా స్రవంతి చూపిస్తున్న ప్రేమ... వాళ్ళకి అర్థమయ్యీ కాకుండా వుంది.

'బిజినెస్ పనులున్నాయి, చూసుకునివ స్తాను' అంటూ నందిని, వాళ్ల ఊరు వెళ్ళి పోయింది. రెండేళ్లుగా వసంత జబ్బుపడ్డ ప్పటినుండీ నందిని వస్తూ, పోతూ ఇక్కడే ఎక్కువగా గడుపుతోంది.

చైతన్య ఇంటికి ఫోన్ చేశాడు. "వచ్చేది అర్ధరాత్రి దాటొచ్చు. మెడిసిన్ తీసుకుని నా కోసం ఎదురుచూడకుండా, త్వరగా నిద్రపో..." అని వసంతకు చెప్పాడు. ఎన్ని బిజీపనులున్నా, రెండేళ్లుగా అతడు వసంత దగ్గర కూర్చుని ఓ గంటసేపు మాట్లాడి కానీ బయటకు వెళ్ళడు. ఏ విష యంలో కూడా ఆమెను నిర్లక్ష్యం చేస్తున్న ట్లుగా వుండేవాడు కాదు. తనవల్ల ఆమె బాధ మరింత ఎక్కువ కాకూడదని అతని తాపత్రయం. "ఈ జన్మకి ఈ ప్రేమ చాలు" తృప్తిగా అనుకునేది వసంత.

అర్ధరాత్రి రెండు దాటాక బజర్ శబ్దం విని తలుపు తీసింది సావిత్రమ్మ.

చేతిలో వున్న బ్రీఫ్‌కేసు ఆమెకి అందిస్తూ, "వసంత నిద్రపోతోందా...? " అని అడిగాడు.

"పడుకున్నారు బాబూ! భోజనం వడ్డిం చమంటారా? " అడిగింది.

"ఆకలిగా లేదు" చెప్పి, మేడపైకి నడి చాడు.

వసంతకి రెండ్రోజులుగా జ్వరం వ

స్తోంది. ఒక్కసారి తనను చూస్తే కానీ నిద్రపోలేను అనుకుని గదిలోకి నడిచాడు. నైట్ డ్యూటీ నర్స్ ఓ పక్కన కుర్చీలో కునుకు తీస్తోంది. హృదయం మీద ఫ్యామిలీ ఫొటో పెట్టుకుని నిశ్చింతగా నిద్ర పోతోంది వసంత. ప్రశాంతంగా వుంది ఆమె మోము. ఈ మధ్య మందులు కొంచం పనిచేస్తున్నట్లున్నాయి. ఆ మాటే ఆమెతో అంటే "ఆరిపోయే దీపానికి వెలుగెక్కువ" అంటూ నవ్వింది. కాళ్లకు సగం వరకు దుప్పటి కప్పి వుంది. ఫొటోతీసి పక్కన పెట్టి, దుప్పటి సరిచేశాడు. ఎందుకో అనుమానమొచ్చి నుదుటిమీద చెయ్యిపెట్టి చూశాడు. ఐసుగడ్డలా వుంది శరీరం.

"వసంతా... మైగాడ్" అతను అరిచిన అరుపుకి నర్సు ఉలిక్కిపడి లేచింది.

ఇల్లంతా లైట్లు వెలిగాయి.

4



ప్రశాంతంగా... పునిస్త్రీగా తన బాధ్యతలన్నీ నెరవేర్చుకుని వెళ్ళిపోయింది వసంత. ఇరవైరోజులుగా బాగా అలవాటు కావటంతో స్రవంతికి బాధగా అన్పించింది. తనకే ఇలా వుంటే... ఇక ఇంట్లో పరిస్థితి...? ఆమె ఆలోచించలేకపోయింది. నందిని భర్తతో వచ్చింది. ఎవరెవరో వచ్చేవాళ్లు, వెళ్లేవాళ్లు... అవిశ్రాంతంగా చైతన్యను పలకరిస్తున్నారు. తల్లికోసం దుఃఖించే పసిపిల్లలను ఆపటం ఎవరితరమూ కాలేదు. చైతన్య తండ్రి పది రోజులుగా గదిదాటి బయటికి రాలేదు.

స్రవంతి అన్న, రాఘవయ్య, జానకమ్మ అంతా వచ్చి వెళ్లారు. గంభీరంగా వున్న చైతన్యను పలకరించటానికి వాళ్లు సాహసించలేక, ఆనందరావుగారి దగ్గర కాసేపు కూర్చుని వెళ్ళారు.

ఆనందరావుగారి గదిలో ఆయన ఫ్రెండెవరో మాట్లాడుతూ వున్నారు. "రోజూ నాతో శారదాపీఠానికి వస్తావు. నీకు తెలియనివా...? డెత్ ఈజ్ ఎ కామా, నాట్ ఎ ఫుల్‌స్టాప్" అన్నారు. ఈ సృష్టి మొదలైన దగ్గర్నుండి ఈ భూమ్మీదకు వచ్చిన వాళ్లు ఎవరూ నిలబడలేదు. పుట్టిన ప్రాణి చావక మానదు. చచ్చినవాడు కర్మశేషమున్నంతవరకు పుట్టకా మానడు. ఇక శోకించటం దేనికి? బతికివున్న నాలుగురోజులు... కృష్ణా, రామా... అనుకోవటమే.

ఏకవృక్ష సమారూఢా నానాజాతి విహంగమాః।

ప్రభాతే విదిశోయాంతి కా తత్రపరిదేవనా।

సాయంకాలం ఒకే చెట్టుపై గుమిగూడే పక్షులన్నీ తెల్లవారితే ఎక్కడికో ఎగిరిపోయినట్లు, రుణానుబంధంతో ఒకే కుటుంబంగా వున్నా, ఎవరికి వారై మనమూ విడిపోవలసిన వాళ్లమే. అలాంటప్పుడు ఈ దుఃఖమెందుకు? ఇవాళో, రేపో... కొన్ని సంవత్సరాలలో... చావక తప్పదు. బంధువులు, కుటుంబీకులు, స్నేహితులు... ఎవరు శాశ్వతం? నీకు నేను చెప్పేవాడినా...?" కాఫీ కప్పులు నిశ్శబ్దంగా అక్కడ పెట్టేసి వచ్చింది స్రవంతి.

"ఈ అమ్మాయెవరు?" ఆయన అడుగుతున్నట్లున్నాడు.

స్రవంతి విషయం ఆ ఇంట్లో నలుగురైదుగురు ముఖ్యమైన వాళ్లకు తప్పితే ఇంకా ఎవరికీ తెలీదు. ఇంతకుముందు ఇంటి మెయిన్‌టెనెన్స్ కింద ఇరవైమంది వర్కర్స్

# సిగరెట్‌కి వీడ్కోలిలా

"సరదా సరదా సిగరెట్టూ... ఇది దొరల్ తాగు బల్ సిగిరెట్టూ" అని పాడుకుంటూ, సిగరెట్లు కాలుస్తుంటే, వ్యాధులు కూడా అంతే సరదాగా వచ్చేస్తాయి. గుండెజబ్బులు, క్యాన్సర్, ఊపిరితిత్తుల జబ్బులు, అసలు సిగరెట్లు తాగటం మానేస్తే... ఆ ఆలోచన వచ్చిందా? అయితే... ఇలా చేసి చూడమంటున్నారు హృద్రోగ నిపుణులు.



★ నిర్ణయం తీసుకున్న తక్షణం నుండే సిగరెట్‌ని విసర్జించి దృఢంగా ఉండండి.

★ నిర్ణయం అమలుకు కుటుంబ సభ్యులు, స్నేహితులు, సహోద్యోగుల సహాయం తీసుకోండి.

★ ప్రతిరోజూ వ్యాయామం చెయ్యటం వలన మానసిక ఒత్తిడి తగ్గి, సిగరెట్ తాగాలన్న ధ్యాస తగ్గుతుంది.

★ సానుకూల ఆలోచనలు పెంచుకుంటే విసర్జించిన అలవాటు పైకి మనసు మళ్ళదు.

★ సిగరెట్ తాగాలన్న కోరిక మళ్ళీ మొదలయి, తీవ్రమయితే మూడు ని॥లు దానిని అణిచి పెట్టుకుని, తర్వాత ఓ గ్లాసు నీళ్ళు తాగండి.

★ మిత్రులు ఎవరైనా సిగరెట్ తాగమని బలవంతపెడితే, సున్నితంగా తిరస్కరించి, ఆ ప్రదేశం వదిలి వెళ్ళండి.

★ సిగరెట్ల మీద వెచ్చించే డబ్బు దాచి పెట్టండి. మీ సేవింగ్స్ ఎంత పెరుగుతుందో గమనించండి.

★ అవసరమైతే డాక్టర్ల సహాయం తీసుకోండి. ప్రతిరోజూ సిగరెట్ తాగని రోజుగా మార్చుకుంటే, మీ ఆరోగ్యానికీ, కుటుంబానికీ, మీ పర్సుకీ మంచిది మరి!

వుండేవాళ్లు. వసంత జబ్బు విషయం బయటికి ఎక్కువగా ప్రచారం కావటం, పలకరించటానికి వచ్చిపోయేవాళ్లు ఎక్కువ కావటంతో చాలా మందిని పనిలోంచి తగ్గించాడు చైతన్య.

వసంత కర్మకాండలన్నీ పూర్తయ్యాక మరో రెండ్రోజులకు లాస్‌వెగాస్ నుంచి దిగారు ఆనందరావు చెల్లెలు వసుంధర, ఆమె భర్త మూర్తి, కూతురు రజని.

ఇంట్లోకి రావటంతోనే వరుసగా ఏడుపులు అందుకున్నారు వసుంధర, రజని.

"అన్నయ్యా! ఎంత పని జరిగిపోయింది..." అంటూ నిశ్శబ్దంగా వున్న ఇల్లు మారుమోగేట్లుగా మొదలు పెట్టింది వసుంధర.

"బావ ఎక్కడ! ముందు నేను బావను చూడాలి..." ఏడుస్తూ అడిగింది రజని.

"పైనున్నారమ్మా!" చెప్పింది సావిత్రమ్మ. గబగబా పైకి నడిచింది ఆమె.

వాళ్లని చూస్తున్న స్రవంతికి వాళ్ల ఏడుపు లోపల్నుంచి రావట్లేదనిపించింది. వాళ్ళ బిహేవియర్ కూడా ఎబ్బెట్టుగా తోచింది. "స్రవంతీ... వాళ్లకి స్నానాలు... అవీ ఏర్పాటు చెయ్యమ్మా!" చెప్పి లోపలికి వెళ్ళారు ఆనందరావుగారు. అంత పెద్ద పెట్టున ఏడ్చినవాళ్ళు, ఆయనలా వెళ్లగానే నార్మల్‌గా అయ్యారు. స్నానాలు కానిచ్చి వసుంధర, రజని వంట గదిలోకి వచ్చారు. అప్పటికే మూర్తిగారు టిఫిన్ కానిచ్చేస్తున్నారు. వచ్చిన దగ్గర్నుంచీ

స్రవంతి అటూ, ఇటూ తిరగటం చూస్తూనే వున్నారు వాళ్లు. సావిత్రమ్మ టిఫిన్లు పెడుతుంటే వసంత గురించి, 'ఎలా జరిగింది... ఎప్పుడు... ఏటైమ్‌లో? ' అని అడుగుతూ తిన్నారు.

పిల్లలిద్దర్నీ స్కూల్‌లో దింపి అప్పుడే ఇంటికి వచ్చింది నందిని. ఆమెను చూడటంతోనే మరోసారి బావురుమంది వసుంధర. "మాకు వెంటనే తెలీలేదు. నిన్నటికి నిన్న ప్రైవేట్ ఫ్లైట్‌లో ఛార్జెస్ ఎక్కువగా పెట్టి బయలుదేరాం" అంటూ చెప్పుకొచ్చింది.

"మా బాధలో మేమున్నాం అత్తయ్యా! ఎవరికి కబురు వెళ్లిందో, లేదో గమనించలేదు."

"పుణ్యాత్మురాలు... ఎక్కువకాలం బాధ పడకుండా పోయింది. ఎంత మంచి పిల్ల. ఎప్పుడైనా ఇక్కడికి వచ్చినప్పుడు 'పిన్నిగారు' అంటూ ఆప్యాయంగా పిలిచేది" వసంత గురించి పొగిడింది ఆవిడ.

"అక్కయ్యే కళ్లలో మెదులుతున్నది... ఎంత మంచిదో... ఎంత స్నేహంగా వుండేదో" వాళ్లమ్మకు వంత పాడింది రజని.

"అవునూ... ఈ పిల్లవెధవలిద్దరూ ఏరి? " గుర్తొచ్చి అడిగింది వసుంధర.

"ఇన్నాళ్లుగా... వాళ్లు ఇంట్లోనే కూర్చున్నారు కదా... కాస్త దిగులైనా తగ్గుతుందని నేనే స్కూల్‌లో దింపి వచ్చాను" అంది నందిని.

"సరే... నేనలా చైతన్యను పలకరించి వస్తాను" మేడపైకి దారితీసింది ఆవిడ.

అలా పలకరించటానికని వచ్చినవాళ్లు నాలుగునెలలైనా ఇంట్లోంచి కదల్లేదు. గంటకోసారి ఈ వాతావరణం మా వల్లకాదు అంటూ జ్యూస్‌ల మీద జ్యూస్‌లు లాగించే వాళ్లు. వాళ్లకి టిఫిన్లు, జ్యూస్‌లు సప్లై చేయలేక చతికిలబడిపోయారు స్రవంతి, సావిత్రమ్మలు. ఉదయం లేచిందగ్గర్నుంచీ పిల్లలకు తినిపించటం, స్కూలుకి రెడీ చేసి పంపటం... ఆనందరావుగారి అవసరాలు గమనించటం అన్నీ స్రవంతి నిర్వహణలోకి వచ్చాయి. పైగా నందిని "స్రవంతీ!" అంటూ ఆప్యాయంగా చీటికీ, మాటికీ పిలుస్తుండటంతో వసుంధరకు అనుమానమొచ్చింది. పనిమనిషిని పిలిచే పిలుపులాగా లేదు. స్రవంతి కట్టూ, బొట్టూ చూస్తే డాబుసరిగా లేకుండా సాధారణంగా వుంది.

"ఎవరీ దిష్టిబొమ్మ? " సావిత్రమ్మ దగ్గర ఆరా తీసింది ఆవిడ.

"అమ్మా! అందమైన దిష్టిబొమ్మ" రజని వాళ్లమ్మ మాటలను సరిచేసింది.

"చిన్నమ్మగారు!" సావిత్రమ్మ బాంబు పేల్చింది.

ఏ బస్టాండ్‌లలోనో, రైల్వేస్టేషన్‌లలోనో కళ్ళముందే ఆర్‌డిఎక్స్ బాంబులు పేలాక తునాతునకలైన శరీరాల్ని చూస్తూ నిశ్చేష్టులైనట్లుగా నోటమాట రాలేదు తల్లీకూతుళ్ళిద్దరికీ.

"అంటే" ఇద్దరూ ఒకేసారి అడిగారు.

"వసంతమ్మగారు తనుండగానే పిల్లల ఆలనా, పాలనా చూస్కోవాలని నెలక్రితమే రిజిస్ట్రార్ ఆఫీసులో వీళ్లకి పెళ్ళి అయిందనిపించారు"

ఆరోజు ఇంట్లో పెద్ద యుద్ధమే జరిగింది. నందినిమీద, ఆనందరావుగారి మీద పెద్ద గొడవే పెట్టుకుంది వసుంధర. "అప్పుడడిగితే మేనరికం చేస్కోను అన్నాడు. పైపెచ్చు మా పిల్ల ఏదో చెడ్డదానిలాగా త్వరగా పెళ్ళిచేసేయండని సలహా ఇచ్చాడు. మా ఆశలన్నీ వమ్ముచేసి... మా గుండెల్లో గునపాలు గుచ్చాడు. తను మాత్రం ఏం బావుకున్నాడు? ఇన్నాళ్లూ... ఆ రోగిష్టిదానితో పేరుకి కాపురమేగా... పోనీలే... వాడి కష్టం తీరింది. ఇప్పుడైనా మన పిల్లనిచ్చి చేస్తే వాడి జీవితానికి ఓ అందచందం అని నేననుకుని దాన్ని

కూడా తీసుకువస్తే... ఇలా ముందే పూల రంగడిలా పెళ్ళి చేస్కొని రెడీ అవుతాడా?" చైతన్యని నానా శాపనార్థాలు పెట్టింది ఆవిడ.

"ఇందులో వాడిదేం లేదు. వాణ్ణి బలవంతాన వసంతే ఒప్పించుకుంది", ఆవిడ శాపాలు తమ్ముడికి తగలటం ఇష్టంలేక అంది నందిని.

"ఆహా..." ఈసారి మరింత దీర్ఘాలు తీసి హావభావాలు వికృతంగా మార్చింది ఆవిడ.

"ఐతే ఇదంతా ఆ మహాతల్లి ప్లాన్ అన్నమాట. నా బిడ్డను వద్దని దాన్ని కట్టుకున్నాడు. మా ఉసురు తగిలే అర్థాంతరంగా చచ్చింది. ఊరికే పోకుండా... రోడ్డుమీది వాళ్లని తెచ్చి ఇంట్లో తగిలించిందన్నమాట. దాని ఆత్మ పైలోకాల్లో వున్నా శాంతించదులే..." ఏడుస్తూ, చేతులు తిప్పుతూ నానా గోలగా అరిచింది ఆవిడ. మరోపక్క వలవలా కన్నీళ్లు కారుస్తోంది రజని.

వింటున్న నందిని కోపం పట్టలేకపోయింది. "అత్తయ్యా! పెద్దదానివని మర్యాదిస్తుంటే... నీ నోటికి హద్దూ పద్దూ లేదా! చనిపోయిందని కూడా లేకుండా వసంతని అనటానికి నీకు నోరెలా వచ్చింది? ఛీ! ఛీ!" విసుక్కుంటూ అక్కడ్నించి లేచి వెళ్ళిపోయింది.

వాళ్ల మాటలూ, కోపతాపాలూ... దూరంగా వున్న స్రవంతి చెవుల్లో పడుతూనే వున్నాయి. భయంతో ఆమె కాళ్లూ, చేతులు కంపించసాగాయి.

ఆరోజు మధ్యాహ్నం భోజనాలయ్యాక "స్రవంతీ!" అని పిలుస్తూ గదిలోకి వచ్చింది వసుంధర.

విశ్రాంతిగా కూర్చుని పేపర్ చదువుతున్న స్రవంతిని చూడగానే ఆవిడకు భగ్గుమంది. ఈ సుఖం నా బిడ్డకి లేకుండా చేసింది కదా అన్పించింది.

"ఏంటి పిన్నిగారూ..." అన్ని అడుగుతున్న స్రవంతివైపు చూడకుండా రూమంతా పరికించి చూసింది. మంచం పక్కనే వున్న టీపాయ్ మీద శివరాం ఫొటోమీద పడింది ఆవిడ దృష్టి. పొలంలో వరినాట్లు అంటుతూ తలకి టవల్ చుట్టుకుని షర్ట్, నిక్కర్ మీద వున్నాడతను. అతను చిన్న కుర్రాడిగా వున్నప్పుడు స్రవంతి తీసిన ఫొటో అది. అతని గుర్తుగా తెచ్చుకుంది.

"మా అన్నయ్య!" ఆవిడ కళ్లల్లో ఆరాటం చూసి చెప్పింది.

"పల్లెటూరివాళ్లా మీరు?" విచిత్రమైన విషయం విన్నట్లుగా కనుబొమ్మలు పైకి కిందికి వింతగా ఆడిస్తూ అడిగింది.

"కాదండీ... ఇక్కడే... వ్యవసాయం"

"అదేలే... పొలం పన్లన్నమాట. కూలీపన్లకు వెళతారా? సొంతంగా భూమి ఏమన్నా వుందా?"

స్రవంతికి కళ్లల్లో నీళ్లు చిప్పిల్లాయి. తాము వీళ్లంత స్థితిపరులు కామని ఆవిడకి చులకన భావం వుందని ఎప్పుడో అనుకుంది స్రవంతి.

"అన్నయ్యా, నేనూ... డిగ్రీ వరకు చదువుకున్నాం. సొంత పొలమే. అన్నయ్య వ్యవసాయంలో దిగాడు. నాన్న చిన్నప్పుడే పోయారు. అమ్మే మమ్మల్ని పెంచింది"

"మరి ఇంత పెద్ద సంబంధం ఎలా పట్టారు?"

చివుక్కున తలెత్తి చూసింది స్రవంతి. తడబడింది ఆవిడ.

"అదే... ఇంత హోదాగల సంబంధం మీ తరఫున ఎవరు నిర్వహించారూ... అని"

"మాకు తెలీదు... నందినిగారు వచ్చి అన్నయ్యతో మాట్లాడారు" ముక్తసరిగా చెప్పింది.

అంతంత మాత్రంగా వున్న బతుకులన్నమాట. ఈ ఇల్లూ, వాకిలీ, ఐశ్వర్యం

చూస్తే మామూలు వాళ్లకే గుండె జారటం ఖాయం. ఇలాంటి వాళ్లకు దొరికితే వదు ల్తారా...? ఇదంతా ఆ నందిని, వసంత కలిసి చేసిన పని. రజనిలాంటి బంగారు బొమ్మను పెట్టుకుని... రక్తసంబంధం తలదన్నుకుని తమకి ఒక్క విషయం కూడా తెలీకుండా ఇంతకి తెగించారు. కాస్తో, కూస్తో రూపు తప్పితే ఈ అమ్మా యిలో ఏం స్పెషాలిటీ వుందని? ఈ దిక్కులేనిది అయితే చెప్పిన మాట విని ఆ పిల్లలిద్దర్నీ చూస్కుంటూ ఈ ఇంటికి కాప లాకుక్కలాగా పడివుంటుందనుకున్నా రేమో... ఆస్తుల విలువ తప్పితే మమకా రాల విలువ తెలియని ఆవిడకి కడుపులో బాధ సుళ్ళు తిరగసాగింది.

ఆ మర్నాడు ఆనందరావుని కదిపింది వసుంధర. "జరిగిందేదో జరిగింది. ఇప్పు డైనా మించిపోయింది లేదు. ఆ పిల్లకి ఎంతో కొంత ముట్టచెప్పి పంపిద్దాం. రజ నీని చైతన్యకు చేస్కోండి. పిల్లల్ని కూడా నా కూతురైతే వాడిమీద ఇష్టంతో తన సొంత బిడ్డల్లా చూసుకుంటుంది. అయినా నా కూతురికేం తక్కువ? అందం, వయసు... తెలివి కలది. నెలకు రెండు లక్షలు సంపాదిస్తోంది..." చెప్పుకుంటూ వచ్చింది.

"వసుంధరా... రజని గురించి, దాని అలవాట్లు గురించి నా నోటితో చెప్పిం చకు. దాన్ని చేస్కునే ప్రసక్తిలేదని చైతన్య అప్పుడే చెప్పేశాడు. అసలిన్నాళ్లూ దానికి పెళ్లి చేయకుండా ఎందుకుంచావ్? ఫారి న్‌లో నీ కూతురి వ్యవహారాలు, దాని బాయ్‌ఫ్రెండ్స్... ఇవన్నీ మాకు తెలీవను కున్నావా...? ఈ ప్రస్తావన ఇంకెప్పుడూ నా దగ్గర తేవద్దు" గట్టిగా చెప్పాడు ఆయన.

"నా కూతుర్ని వంక పెట్టడం సరే... ఇప్పుడొచ్చిందే... దాని కథేమిటి? అసలు ఎవరు? ఏమీ భాగోతాలు లేని అమాయ కురాలా...? " కసిగా అడిగింది.

"ఎవరైనా కానీ... వసంతకిష్ట మైంది... అంతే" ఆయన ఆ సంభాషణ తుంచేశాడు.

నిజంగా రజనిని చేస్కుంటే పిల్లలిద్దర్నీ మర్నాడే హాస్టల్ కి, తనని ఓల్డ్ ఏజ్ హోమ్ కి పంపి, ఇంటిని తన బాయ్ ఫ్రెండ్స్ తో డిస్కోథెక్ లాగా చేయగలదని ఆయనకి తెలుసు.

తమ పాచికలు నందిని, ఆనందరావుల



దగ్గర పారకపోవటంతో స్రవంతి దగ్గర మొదలుపెట్టారు. బోల్డంత డబ్బిస్తాం వెళ్ళి పొమ్మన్నారు ఒకసారి. 'అసలు వాడు నీ మొహమే చూడటంలేదు. నువ్వొకదానివి వున్నట్లే వాడికి గమనింపులేదు. నీ జీవితం ఇక్కడ పనిమనిషిలాగా సాగిపోవాల్సిందే' అని భయపెట్టాలని చూశారు. 'అదే మా రజని అయితే క్షణాల్లో వాణ్ణి మామూలు మనిషిని చేస్తుంది. ఈ జీవితం నీకెందుకు?' అంటూ చెప్పింది వసుంధర.

అన్నింటికీ మౌనమే సమాధానం స్రవంతి నుంచి.

"ఇది మన మాటలు ఎందుకు వింటుందీ... మనమిచ్చే కాస్తా, కూస్తా డబ్బు దీనికేం సరిపోతుంది? ఇంత ఆస్తి చూశాక ఎవరైనా అంతేలే..." స్రవంతి వినేట్లు మాటలతో గుచ్చేది వసుంధర.

నందిని వున్నప్పుడు మాత్రం "అమ్మా! స్రవంతీ!" అంటూ ఆప్యాయంగా పిలిచేది.

"వసంతక్కా! ఇవన్నీ తట్టుకునే ధైర్యాన్ని నువ్వే ఇవ్వాలి" మనసులోనే ప్రార్థించేది స్రవంతి. ఆమె ఎందుకు ఈ ఇంటికో ఇల్లాలు కావాలనుకుందో కొద్దిగా అర్థం అవ్వసాగింది స్రవంతికి. మూర్తి గారు మాత్రం ఏమీ మాట్లాడేవారు కాదు. తన తిండి, స్నానం కానిచ్చుకుని క్లబ్ కెళ్ళేవారు. ఇక్కడికి రావటం ఆయనకి ఆటవిడుపులా వుంది. నందిని స్రవంతికి ఎన్నో జాగ్రత్తలు చెప్పి తన ఊరు వెళ్ళిపోయింది. నందిని ఊరు వెళ్ళటం, చైతన్య ఉదయం వెళ్తే అర్ధరాత్రి వరకు ఆఫీసు పనులతో గడపటంతో రజనికి ఆటవిడుపుగా మారింది. తన పాత ఫ్రెండ్స్ అందర్నీ ఇంటికే పిలుచుకొచ్చేది. నానాగోలగా మాట్లాడుతూ, కేకలు వేస్తూ... జోక్స్‌తో పగలబడినవ్వటం... ఇంటి ప్రశాంతత పోయింది. ఆనందరావు ఎక్కువగా గదిలోనే గడపటంతో ఆయనకి ఈ విషయాలేమీ తెలియవు.



ఫ్రెండ్స్ ముందు కావాలని "మా బావ ఇల్లు చూశారుగా... ఎలా వుందో... అందుకే దిష్టిచుక్కను పెట్టాం. ఏయ్... దిష్టిబొమ్మ... యాపిల్ జ్యూస్" స్రవంతిని పిలిచి ఆర్డర్ చేసేది.

వాళ్లెంత రెచ్చిపోతున్నా, ప్రశాంతంగా వున్న స్రవంతిని చూస్తుంటే సావిత్రమ్మకు ఆశ్చర్యం వేసేది.

ఉన్నట్లుండి ఓ రోజు స్రవంతి గదిలోకి వచ్చింది రజని "ఏం చేస్తు

న్నావ్?" అంటూ. ఉతికిన బట్టలన్నీ సర్దుతోంది స్రవంతి.

"నాకు శారీ కావాలి. అఫ్‌కోర్స్... నీ దగ్గరున్నవి నా రేంజ్‌కి సరిపోవనుకో. అయినా నువ్వు ఆ కాటన్ శారీస్‌లో కూడా... ఎందుకో లుకింగ్ నైస్. ఈ రోజు పార్టీకి శారీ కట్టుకొస్తానని ఫ్రెండ్స్‌తో చెప్పాను. నా దగ్గర అన్నీ జీన్స్, టాప్స్. ఇప్పుడు షాపింగ్ చేసేంత ఓపిక లేదు" చిత్రంగా భుజాలు ష్రగ్ చేస్తూ జబర్దస్తీగా స్రవంతి వార్డ్‌రోబ్స్ వెతకసాగింది.

అడుక్కోవటంలో కూడా ఈ శ్రీమంతులకు ఎంత అహంకారం... స్రవంతి పెదాలపై చిరునవ్వు పూసింది.

ఓ అయిదు నిమిషాలు మడతలు పెట్టిన చీరలన్నీ అటూ, ఇటూ చేతులతో లాగి చివరికి ఓ చీర బయటికి తీసింది రజని. "ఒ.కె. బై..." తన చీర తనే తీసుకున్నంత లుక్ ఇస్తూ బయటికి వెళ్ళింది.

ఆ రోజు రాత్రి చీరమీద రెస్టారెంట్లో తినొచ్చిన డిషెస్ మరకలు... షాంపేన్ వాసన గుప్పుమంటుంటే... అర్ధరాత్రి ఇంటికొచ్చింది రజని. డోర్ తీసిన స్రవంతి తూలిపోతున్న రజనిని రూమ్‌దాకా తీస్కెళ్లింది.

"నీ శారీ సూపర్బ్. ఈ రోజు హేండ్‌సమ్ గైస్ అంతా నా చుట్టూ మూగారు. ఐ ఫీల్ జెలస్ ఎబౌట్ యువర్ హోమ్లీ లుక్..." ఏం మాట్లాడుతోందో తెలీకుండా స్రవంతి మీద వాలిపోయింది.

కూతురు ఎక్కడికి వెళ్ళిందో, ఎందుకెళ్లిందో లాంటి దిగుల్లేమీ లేకుండా బెడ్‌మీద నిశ్చింతగా నిద్రపోతోంది వసుంధర. ఈవిడకసలు బాధ్యత లేదా! ఎటువంటి తల్లి...! ఒక్క క్షణం స్రవంతి మనసు ఇంటివైపు పరుగులు తీసింది.

తనకి కానీ, అన్నయ్యకు కానీ చిన్నపాటి జ్వరమొచ్చినా కదిలిపోయి రాత్రంతా బెడ్ పక్కనే కూర్చుని నిద్ర పాడు చేసుకునే తల్లి గుర్తుకొచ్చింది.

ఓరోజు స్రవంతి నిద్ర లేచేటప్పటికి ఆమె చీరలన్నీ నేలమీద చిందరవందరగా పడివున్నాయి.

వాటిల్లో చాలా వాటిమీద కిచెన్‌లోని టమాటో సాస్ తెచ్చి వంపినట్లు... సాస్ అంతా ఎర్రగా నేలమీద పాకుతూ వుంది. చాలా చీరలు కత్తిరించి ముక్కలు ముక్కలుగా రూమంతా అక్కడక్కడా పడి ఫ్యాన్ గాలికి ఎగురుతున్నాయి. బ్లౌజులు కొన్ని ముక్కలుగా కత్తిరించి... కిటికీ నుండి డోర్‌వరకు ఓ రోప్‌లాగి దానికి అసహ్యంగా క్లిప్ చేసి వున్నాయి.

కడుపులో తిప్పినట్లయ్యింది స్రవంతికి.

ఆషా, నిషాలిద్దరూ గాఢమైన నిద్రలో వున్నారు. ఇది రజని పనే అని, అసూయతో చేసిందని తెలిసిపోతుంటే... పిల్లలిద్దరూ లేచి జడుసుకోకముందే రూమ్ క్లీన్ చేసింది స్రవంతి.

పనికొచ్చేవాటిని వాషింగ్‌కి వేసేస్తూ, పనికిరాని వాటిని డస్ట్‌బిన్‌లో వేస్తుంటే అన్న గుర్తొచ్చాడు స్రవంతికి. ఆమె వచ్చేటప్పుడు వద్దన్నా వినకుండా తనకి చేతనైనంతలో ఖరీదైన చీరలు కొన్నాడు శివరాం, "అక్కడ నువ్వు ఆ ఇంటికి తగ్గట్లు వుండాలమ్మా" అంటూ.

అన్నయ్య ఎంతో ప్రేమతో కొన్న చీరలు... స్రవంతికి దిగులుగా అన్పించింది.

బయటికి వచ్చి చూస్తే హాల్లోనే కూర్చుని అంత ఉదయాన్నే టి.వి. ఆన్ చేసి చూస్తున్నది రజని. ఛానల్స్ రిమోట్‌తో మారుస్తూ... సోఫా నుంచి టీపాయ్ వరకు కాళ్లు చాపుకుని... పెద్ద ఘనకార్యం చేసిన దానిలా మొహం వెలిగిపోతుంటే నిర్లక్ష్యంగా స్రవంతి వైపు చూసింది.

స్రవంతి ఏమైనా మాట్లాడితే పెద్దపెట్టున గొడవ చేద్దాం అనుకున్న రజనికి ఆమె నిశ్శబ్దంగా ఉండిపోవటం నిరాశను మిగిల్చింది.

ఆ సాయంకాలం బట్టలన్నీ మరకలు పోయాయా లేదా అని చూస్కుంటున్న స్రవంతి రూమ్‌లోకి వచ్చింది రజని. నెయిల్ పాలిష్ బాటిల్స్ చేతుల నిండా పట్టుకొని వచ్చింది.

"స్రవంతీ... బయటికెళ్లాలి. నా డ్రెస్‌కి తగ్గట్లు ఏ కలర్ పాలిష్ వేసుకుంటే సూటవుతుందో చెప్పు..." అడుగుతూ లోపలికొచ్చింది.

"నాకు పెద్దగా తెలీదు. నేను వాడను" ముక్తసరిగా సమాధానమిచ్చింది స్రవంతి.

"ఫరవాలేదు. నీకు తెలిసినంతలో చెప్పు" మళ్లీ అడిగింది.

"ఇది బావుండచ్చు" లైట్ పింక్ కలర్ చూపిస్తూ అంది.

"వెరీగుడ్... గుడ్ సెలక్షన్. ఇక ఇవన్నీ అవసరం లేదుగా..." అంటూ బాటిల్స్ అన్నీ ఓపెన్‌చేసి స్రవంతి చీరలమీద ధారగా పోసింది.

**"వెరీగుడ్... గుడ్ సెలక్షన్. ఇక ఇవన్నీ అవసరం లేదుగా..." అంటూ బాటిల్స్ అన్నీ ఓపెన్ చేసి స్రవంతి చీరల మీద ధారగా పోసింది. ఆమె చర్యలకు మనసు చివుక్కుమన్నా, "ఏంటి రజనీ... ఒట్టి అల్లరి పిల్లవి" ముద్దుగా విసుక్కుంటూ బట్టలు తీసుకుని వాషింగ్‌వైపు తీసుకెళ్లింది స్రవంతి. నిర్ఘాంతపోవటం రజని వంతైంది.**

"ఇప్పుడిక పోట్లాట తప్పదు" మనసులో అనుకుంది రజని.

ఆమె చర్యలకు మనసు చివుక్కుమన్నా, "ఏంటి రజనీ... ఒట్టి అల్లరి పిల్లవి" ముద్దుగా విసుక్కుంటూ బట్టలు తీసుకుని వాషింగ్‌వైపు తీసుకెళ్లింది స్రవంతి.

నిర్ఘాంతపోవటం రజని వంతైంది.

ఎప్పుడైనా ఆదివారాలు ఆశ్రమానికి వెళ్లేది స్రవంతి తరుణ్ కోసం. అలా వెళ్లటానికి నందిని పర్మిషన్ ముందే తీసుకుంది. చైతన్యకి ఆమె ఇంట్లో ఉన్నా, లేక పోయినా ఒకటే కాబట్టి నందిని దగ్గరే ఏమైనా మాట్లాడేది స్రవంతి. ఒక్కోసారి ఆషా, నిషాలను కూడా వెంటపెట్టుకెళ్లేది. ఈ మధ్య క్రమంగా రావటం తగ్గటంతో స్రవంతిని చూడగానే వాడు అలిగినట్లు బుంగమూతి పెట్టేవాడు. పిల్లలిద్దర్నీ తీసుకుని అట్నుంచటే... అన్న దగ్గర కొద్దిసేపు గడిపి వచ్చేది.

"ఎలా ఉన్నావురా...?" అతను ఆప్యాయంగా ప్రశ్నిస్తుంటే మొహం దించుకునేది, తన కళ్లు తడికావటం అతను చూడకూడదని. వసుంధర, రజని అనేవాళ్లు ఇంట్లో ఉన్నారని కూడా అతనికి తెలీనిచ్చేది కాదు స్రవంతి.

"ఇంకెప్పుడన్నయ్యా... పెళ్లి చేసుకుంటావూ...?" సంభాషణ మార్చేది.

"నాకు తెలుసురా... నా పెళ్లి కోసమే... నువ్వు ఆ ఇంటికి వెళ్లావని" బాధగా అనేవాడు.

"ఎంత సంతోషంగా ఉన్నాను? అయినా నీకు తృప్తి లేకపోతే ఎలా?" మందలించేది.

★ ★ ★

ఓ సాయంకాలం ఆషా, నిషాలను గార్డెన్‌లో ఆడిస్తోంది స్రవంతి. సూర్యుడు మబ్బుల్లోకి జారిపోతుంటే సగం అరుణిమ, సగం బూడిదరంగు కలిసిన ఆకాశం వింతగా వుంది. వాచ్‌మెన్ లాన్ అంతా నీళ్లతో తడుపుతున్నాడు. గాలివాటుకి పైపులోంచి జారిపడే నీళ్లజల్లు తుంపర్లుగా మారి వీళ్లు కూర్చున్నవైపు పడుతున్నాయి. "మమ్మీ... నేను నీళ్లు పె

# ఒక్క శ్వాస చాలు



శ్వాసక్రియ ప్రక్రియలు నేడు మనం టి.వి. ఛానల్స్‌తో యోగా క్లాసుల్లో చూస్తూ, చేస్తుంటాం. ప్రాణాయామం, కపాల భాతి వంటివి ముఖ్యమైనవి. ముఖ్యంగా ఆస్థమాతో బాధపడే వాళ్ళకు శ్వాస పీల్చుకోవటానికి చాలా అవస్థ పడుతుంటారు. ఇంజక్షన్లు, ఇన్‌హేలర్లు వాళ్లకి అత్యవసరాలు.

ఇటీవల సిడ్నీ యూనివర్సిటీ శాస్త్రజ్ఞులు జరిపిన పరిశోధనల వలన ఆస్థమా రోగులు ఇన్‌హేలర్ల వాడకం తగ్గించవచ్చని తేలింది.

57 మంది ఆస్థమా రోగుల్ని రెండు బృందాలుగా విభజించారు. మొదటి బృందానికి శరీర భాగాలు, తల కదలకుండా కేవలం గాలిని దీర్ఘంగా శ్వాసించి, నెమ్మదిగా వదిలే ప్రక్రియ నేర్పారు.

రెండో బృందానికి పైశరీర భాగాలు కదిలేలా శ్వాసపీల్చే ప్రక్రియ నేర్పారు.

రెండు బృందాలూ రోజుకి రెండుసార్లు ఈ వ్యాయామాలు చేసేలా నిర్ణయించారు. ఈ శ్వాసక్రియ వలన ప్రయోజనం లేకపోతే ఇన్‌హేలర్ వాడుకోవచ్చు.

ఓ వారం రోజుల తర్వాత రెండు గ్రూపుల వాళ్ళూ ఇన్‌హేలర్ వాడకం తగ్గించినట్టు కనుగొన్నారు. మూడు నెలల తర్వాత మొదటి గ్రూపు వాళ్ళు 86% ఇన్‌హేలర్ వాడకం తగ్గించినట్టు గణనీయంగా తేలింది.

ఆస్థమాతో అవస్థపడే కంటే, ఈ ప్రక్రియలు మీరూ పాటించి చూడండి.



డతా" చెప్తూ వాచ్‌మెన్ చేతిలోని పైపు తీసుకుంది ఆషా.

నీళ్ల పైపుకి తన చిన్నివేళ్లు అడ్డుగా పెట్టి షవర్‌జల్లులా స్ప్రే చేయసాగింది.

ఆ టైమ్‌లోనే పదిమంది ఫ్రెండ్స్‌తో లోపలికొస్తూ వీళ్లందర్నీ చూసింది రజని.

"చూడండి... చిన్న తమాషా..." ఫ్రెండ్స్ చెవిలో గుసగుసగా చెప్పి ముందుకి నడిచింది. ఆషా చేతిలోని పైపు గబుక్కున లాక్కుంది.

"ఫ్రెండ్స్... మీరు జలకన్య, మత్స్యకన్యలాంటి అందమైన సుందరాంగులను ఎప్పుడైనా చూశారా? "

"నోవే..." ఒక్కసారిగా తల అడ్డంగా ఊపుతూ పెద్దగా అరిచారు వాళ్లు.

"అయితే ఇప్పుడు చూడండి" అంటూ సడెన్‌గా వాటర్‌పైపు స్రవంతివైపు తిప్పింది.

ధారగా కురుస్తున్న నీళ్లతో స్రవంతిని నిలువెల్లా తడిపేసింది. "వావ్... బ్యూటీఫుల్" కేరింతలు కొట్టారు. చుట్టూ ఉన్న పనివాళ్లు నిశ్చేష్టులై నిలబడిపోయి చూడసాగారు. అంతమంది ముందు జరిగిన పనికి చిన్నతనంగా అనిపించిన స్రవంతి చిన్నబోయిన మొహంతో లోపలికి నడిచింది.

"హుఁ! ఏంచేసినా రియాక్షను వుండదు ఈ మట్టిబొమ్మకి" విసుక్కుంటూ చేతిలోని పైపు విసురుగా పక్కకి పడేసింది రజని.

లోపలికి వచ్చిన స్రవంతికి చెప్పలేని బాధ హృదయాన్ని దహించసాగింది. తలనుంచి కాళ్లవరకు నీళ్లు చుక్కలుగా

# బ్రౌన్‌సూట్

టిప్‌టాప్‌గా సూటేసుకుని సాక్ష్యం ఇవ్వడానికి బోనులోకి వచ్చిన సాక్షిని చూసి న్యాయమూర్తి 'ఏమయ్యా! నిన్నెక్కడో చూసినట్లుందే' అన్నారు.
'అవును సార్! ఇదివరకు ఒక దావాలో ఇక్కడే సాక్ష్యం ఇచ్చాను'
'ఏ సూట్(దావా)లో? ' జడ్జిగారి ప్రశ్న.
'బ్రవున్ సూటు' సాక్షి జవాబు.



కారుతూ ఉన్నాయి. "నందిని రావటానికి ఇంకా టైముంది. ఈ ఇంట్లో తను ఏదైనా, ఎవర్నికైనా చెప్పాల్సి వస్తే అది నందినికే. అంతవరకు వీళ్లని భరించక తప్పదు" మనసు గట్టిచేసుకొని బట్టలు మార్చుకోసాగింది. ఆమె గమనించేలోపు కిటికీ అవుట్ సైడ్ నుండి గబగబా ఐదారు కెమెరా ప్లాష్‌లు వెలిగాయి.

ఎవరో తను డ్రెస్ ఛేంజ్ చేసుకోవటాన్ని ఫొటోలు తీశారు అని అర్థం కాగానే స్రవంతి గుండె జారిపోయింది. ఒళ్లంతా చల్లబడ్డట్లై... చమటతో నిలువెల్లా తడిచిసిపోయింది.

"ఎవరూ... ఎవరది? " అరిచానను కుంది కానీ గొంతు పెగల్లేదు. గబగబా డోర్ తీయబోయింది. రూమ్ బయట గడిపెట్టారు. ఎవరో ఉద్దేశపూర్వకంగానే చేశారు.

"ఆయమ్మా... సావిత్రమ్మా..." చాలాసేపు పిలిచింది స్రవంతి.

ఎవరూ అటు పక్కకి రాలేదు. అయిపోయింది. చిన్న విషయాలే అంటూ వదిలేసినందుకు తను బురదలో ఇరుక్కుపోయింది. స్రవంతికి ఏడుపొస్తుంటే అలాగే గోడకి చేరగిలబడిపోయింది. ·

ఇంతవరకు ఈ ఇంట్లో వాళ్ల గురించి తనకి పూర్తిగా తెలీదు. తన గురించి మాత్రం వాళ్లకేం తెలుసు? ఇప్పుడిలాంటి ఫొటోలు అడ్డుపెట్టుకుని తనని ఏం సాధించబోతున్నారు?

ఓ అరగంటకి పిల్లలిద్దరూ స్రవంతిని వెతుక్కుంటూ వచ్చి గడియ తీశారు. అంతకన్నా తనకెవరూ లేనట్లు, వాళ్లని పొదివిపట్టుకుని ఏడ్చేసింది స్రవంతి.

కంగారుగా షెల్ఫ్‌లన్నీ వెతికి నందిని ఇచ్చిన విజిటింగ్ కార్డ్సు మీద నెంబర్లు తీసుకుని ఫోన్ దగ్గరికి వచ్చింది. ఇంటికి చేసింది. ఎవరూ లిఫ్ట్ చేయటంలేదు. సెల్ నెంబర్ స్విచ్ఛాఫ్‌లో వుంది. ఫ్యాక్టరీకి డయల్ చేసింది. "మేడమ్ మీటింగ్‌లో ఉన్నారు. ఈవెనింగ్ వరకు ఎటువంటి ఫోన్‌కాల్స్ వచ్చినా ఎవాయిడ్ చేయమన్నారు" స్రవంతి చెప్పేది వినిపించుకోకుండా అట్నుంచి ఫోన్ పెట్టేశారు.

తన పరిస్థితికి తనమీద తనకే కోపం వచ్చింది స్రవంతికి.

"ఎవరికిరా ఫోను...? నా కోసమేనా...? " అడుగుతూ లోపలికొచ్చాడు శివరాం. అతని వెనకే నవ్వుతూ లోపలికొస్తున్నారు రాఘవయ్య, జానకమ్మ. అందరూ కొత్తబట్టల్లో మెరుస్తున్నట్లుగా వున్నారు. ఆ సమయంలో అన్నను చూడటంతో ఉవ్వెత్తున రాబోయిన దుఃఖాన్ని తమాయించుకుంది స్రవంతి.

"అందరూ ఒకేసారి వచ్చారే...? " కూర్చోమని చెప్తూ అడిగింది.

"ఇన్నాళ్లకి మీ అన్నకి మనసు కుదిరిందమ్మా!" జానకమ్మ బొట్టుపెడుతూ, శుభలేఖ స్రవంతి చేతికిచ్చింది. అన్న పెళ్ళి అనగానే అంతవరకు అనుభవించిన



టెన్షన్ అంతా ఎగిరిపోయినట్టై సంతోషపడింది. ఉత్సాహంగా వాళ్లకి మర్యాదలు చేసింది. ఆనందరావుగారిక్కూడా పెళ్ళి కార్డు ఇచ్చి తప్పకుండా రమ్మని చెప్పారు.

చైతన్య ఏ టైమ్‌లో ఇంట్లో వుంటాడో ఎవరికీ తెలీదు. పైగా అతనితో ముఖపరిచయమే తప్పితే... ఒక్కసారి కూడా వాళ్లల్లో ఎవరూ అతనితో మాట్లాడలేదు.

శివరాం అతని కోసం ఎదురుచూద్దామంటే "మామయ్యగారికి చెప్పారు కదా... ఫరవాలేదు. వచ్చేది లేట్ కావొచ్చు. ఆయనకి నేను చెబుతానులే..." అంటూ సర్దిచెప్పింది.

ఒకవేళ శివరాం వెళ్లి పెళ్ళికార్డు ఇచ్చినా, చైతన్య 'మీరెవరు' అని అడిగితే...? స్రవంతికి భయం అదొక్కటే కాదు, 'నేను స్రవంతి అన్నయ్యని' అని చెప్పినా, 'స్రవంతి ఎవరు' అని అతను అడిగే ప్రమాదముంది. అప్పుడు అన్నయ్య కళ్ళల్లో మెదిలే బాధ తను చూడలేదు.

తను ఒకర్తి ఇంట్లో వుంది అంటూ తన

ఉనికికి అతను ఏనాడు గమనించలేదనిపిస్తుంది స్రవంతికి. అలాగని సాహసించి అతన్ని ఎప్పుడైనా పలకరించాలని కూడా స్రవంతి అనుకోలేదు. అతనికి టిఫిను, భోజనం అన్నీ సావిత్రమ్మే వడ్డిస్తుంది. యాంత్రికంగా ఏదో తిన్నట్లుగా వుంటాడు. అతని హోదాకి సరిగ్గా భోజనం చేయమని దగ్గరుండి చెప్పే చనువు సావిత్రమ్మకు కూడా లేదు.

ఏదైతే ఏం? తను ఏదో ఆశించి ఈ ఇంటికి రాలేదు. పిల్లలిద్దరూ చక్కగా మాలిమి అయ్యారు. ఒకసారి మమ్మీ అంటారు. మరోసారి ఆంటీ అంటారు. ఇంకోసారి స్రవంతి మమ్మీ అని పిలుస్తారు. స్కూల్ నుంచి రాగానే ఐదు నిమిషాలు స్రవంతి కనిపించకపోయినా వాళ్ళ కళ్ళల్లో భయం కనిపిస్తుంది. తల్లి దూరమవటం, తండ్రీ బిజీపర్సన్ కావటంతో వచ్చిన అభద్రతా భావంవల్ల కలిగిన భయం అది.

"ఎవరో చుట్టాలొచ్చినట్లున్నారు..." వసుంధర మాటలతో ఆలోచనల నుంచి బయటికొచ్చింది స్రవంతి. వసుంధర, రజని అక్కడే వుండటంతో వాళ్లను పరిచయం చెయ్యక తప్పింది కాదు. శివరాం వాళ్లకు కూడా శుభలేఖలిచ్చాడు.

"బాగానే సెటిల్ చేశావయ్యా చెల్లెలి జీవితం... మంచి ఛాన్స్ కొట్టారులే..." అంది వసుంధర. దాన్లోని వ్యంగ్యం స్రవంతికొక్కదానికే అర్థమైంది.

"బయలుదేరతామమ్మా..." పెళ్ళి పిలుపుకు వచ్చిన అన్నకి ఇక్కడ జరుగుతున్న విషయాలు చెప్పలేక మౌనంగా తల ఊపింది.

రాత్రి పదకొండు గంటలవుతున్నా రజని ఫ్రెండ్స్ టెర్రస్ మీది నుంచి కిందికి రాలేదు. నిద్రపట్టక గదిలోనే అటూ, ఇటూ తిరగసాగింది స్రవంతి. కాసేపటికి ఒక నిశ్చయానికొచ్చినదానిలా టెర్రస్ మీదికి నడిచింది.

ఆయాలు తెచ్చి సప్లై చేస్తుంటే తినిపడేసిన ఎంగిలి ప్లేట్లు, ఫ్రూట్ జ్యూస్ గ్లాసులు అందరి మధ్యలో పడివున్నాయి. ఈ లోకంలో లేనట్లు నవ్వుతూ... జోక్స్ వేస్కుంటూ తుళ్ళింతలు పడుతున్నారు.

"ఒ. కె యార్. సీయూ టుమారో... వి విల్ మూవ్" వాళ్లల్లో ఒకళ్ళిద్దరు పైకి లేచారు.

అందరూ లేచారు తామూ బయల్దేరతామంటూ.

పైమెట్టు మీద వున్న స్రవంతిని చూసి రజని మొహం చిట్లించింది.

"నీ కెమెరా ఏది? " అడిగింది.

"ఎందుకు? " విసుగ్గా అంది.

"నా ఫోటోస్ తీశారు కదా... ఆ రోల్ ఇచ్చెయ్యండి"

"నీ ఫొటోసా...? కమ్ ఎగైన్? " కొత్త విషయం వింటున్నదానిలా మొహం పెట్టింది.

"అవును. నేను డ్రెస్ ఛేంజ్ చేస్కుంటుంటే తీసిన ఫొటోస్..."

"ఫ్రెండ్స్... హియర్... హియర్" రజని గాల్లోకి చప్పట్లు చరుస్తూ అందర్నీ ఎలర్ట్ చేసింది.

"మనందరం ఇంత అందంగా వుండి టైట్ జీన్స్, పర్ఫెక్ట్ ఫిటింగ్ టాప్స్ వేస్కుని రోడ్లమీద తిరుగుతుంటేనే మన వైపు ఎవరూ సరిగ్గా చూడటంలేదని బాధపడిపోతున్నాం. ఇక... నారీలోకానికి పతివ్రతా శిరోమణిలా ఒళ్ళంతా కప్పుకుపోయేట్లు చీరలు కట్టే ఈవిడగారిని ఫొటోలు తీశారట. అంత బ్యాడ్‌టేస్ట్ ఫెలోస్ ఎవరున్నారబ్బా... మనలో..." దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లు మొహం పెట్టేటప్పటికి అందరూ

పగలబడి నవ్వారు.

"తన పిచ్చిగానీ... ఇంత సింపుల్‌గా అడిగితే వీళ్లు ఇస్తారా? " అనుకుంటూ కిందికి వచ్చింది స్రవంతి.

ఆ రాత్రంతా ఆమె నిద్ర పోలేదు. మర్నాడు ఉదయం పదకొండు గంటలకు కొరియర్‌లో ఫొటోలు వచ్చాయి. భుజం మీది నుండి చీర తప్పిస్తూ, లంగా, పెటీ కోట్ మీద రకరకాల భంగిమల్లో వున్నాయి.

ఈలోపు ఫోన్ మోగింది. స్రవంతే లిఫ్ట్ చేసింది.

"ఏంటి... ఫొటోస్ బాగున్నాయా? " అంటూ ఎవరిదో మగగొంతు.

"మీరు... ఎవరు? " గొంతు తడారిపో తుంటే అడిగింది.

అటుపక్క నుంచి హస్కీగా నవ్వు.

"నీ ఆరాధకుణ్ణి... నీ ప్రేమలో మునిగి తేలుతున్నవాణ్ణి" అతను మాట్లాడుతుంటే చుట్టూ చాలామంది అమ్మాయిల గలగల నవ్వు... ఘొల్లుమంటూ వినిపించింది.

"మీకేం కావాలి? ఎందుకు నన్నిలా విసిగిస్తున్నారు? " స్రవంతి కంఠంలో దుఃఖం అవతలివారికి తమాషాగా వుంది.

"భయపడకు. మేం చెప్పినట్లు వింటే... నిన్నొదిలేస్తాం. లేకపోతే నీ ఫొటోల్లోని ఫోజులన్నీ గోడలమీద వాల్‌పోస్టర్‌లుగా మారతాయి. సెల్‌ఫోన్స్‌లో రన్నింగ్ వీడియో అవుతుంది..."

"వద్దు..." కంగారుగా అంది స్రవంతి.

"ఓ.కె... నువ్వు ఆ ఇల్లు వదిలిపెట్టి వెళ్ళాలి. రేపు సాయంత్రం వరకూ నీకు టైమ్.. ఆలోచించుకో..." ఫోన్ కట్టయ్యింది.

★ ★ ★

రెండ్రోజులుగా స్రవంతి దేనికో డీలాపడటం... లోలోపల బాధపడటం చూసింది సావిత్రమ్మ. "మీరు దేనికో దిగులుపడుతున్నారు. చెప్పతగినది అయితే చెప్పండి. మనసులో బాధ పంచుకుంటేనే ఓదార్పు" స్రవంతి ఏకాంతంగా వున్నప్పుడు వచ్చి అడిగింది.

సముద్రంలో కొట్టుకుపోతున్నవాడికి గడ్డిపోచ ఆధారం దొరికినట్లై జరిగినవన్నీ చెప్పేసింది. రజనీ వాళ్లొచ్చిన దగ్గర్నుంచీ ఆవిడ చూస్తూనే వుంది. "ఎంతకి తెగించింది ఆ రజని? మొదట్నుంచీ వాళ్లవి ఇలాంటి బుద్ధులే. పెద్దయ్యగారితో చెప్పినా, ఆయన మీదేపడి కేకలేస్తారు తల్లీ కూతుళ్ళిద్దరూ. నందిని గారితో చెప్పండి. ఆవిడే చూసుకుంటారు" ఓదార్చింది స్రవంతిని.

"నిన్నట్నుంచీ ఫోన్ చేస్తూనే వున్నాను. ఒకసారి బిజీ అంటారు. మరోసారి సిగ్నల్స్ దొరకవు"

"ఇప్పుడెలా...? " ఇద్దరూ ఆలోచనలో పడ్డారు.

సాయంత్రం ఏడవుతుండగా ఫోన్ మళ్ళీ రింగైంది. "ఏం నిర్ణయించుకున్నావ్? " అంటూ.

"నెగిటివ్స్, ఫొటోస్ ఇస్తే ఇక్కడ్నుంచి వెళ్లిపోతాను" ఏదో నిర్ణయానికొచ్చినట్లు చెప్పింది.

"ఈరోజు రాత్రి పన్నెండు గంటలకు మీ గార్డెన్స్‌లో వున్న స్విమ్మింగ్ పూల్ దగ్గరికి రా..." ఫోన్ పెట్టేశారు.

అర్ధరాత్రి పన్నెండవుతుండగా స్విమ్మింగ్ పూల్ దగ్గరున్న ఫైబర్ బెంచీలో కూర్చుని వుంది రజని.

"నీ కోసమే చూస్తున్నాను. రా... రా... ఈ ఫారమ్సు మీద సైన్ చెయ్యి" దిలాసాగా, తను గెలిచిన ఫీలింగ్‌తో చెప్పింది రజని.

"ఏమిటవి? " అడిగింది స్రవంతి.

"మా బావకూ, నీకు ఇక ముందు ఏ సంబంధంలేనట్లు... డైవోర్స్ పేపర్లు"

చేతులు వెనక్కి విరుచుకుంటూ చెప్పింది.

ఛళ్లుమంటూ మోగింది రజని చెంప. కొట్టింది మూర్తిగారు, రజని తండ్రి. ఎప్పు డొచ్చారో కానీ, ఆయన పక్కనే నిలబడి వున్నారు నందిని, సావిత్రమ్మ.

"ఆడపిల్లవైవుండి మరో అమ్మాయిని ఈ రకంగా వేధించటానికి నీకు సిగ్గు లేదూ..." ఉగ్రంగా అన్నారు ఆయన.

"అంతా కలసి ఈ రకంగా ప్లాన్ చేస్కుని వచ్చారన్నమాట" రోషంగా అంది రజని.

"నోర్ముయ్..." మళ్ళీ చెయ్యెత్తిన ఆయన్ని ఆపింది నందిని.

"సావిత్రమ్మా..." నందిని చెప్తుంటేనే సావిత్రమ్మ రజని హ్యాండ్‌బ్యాగ్ తీసి... వాటిల్లో వున్న ఫొటోస్, నెగిటివ్స్ కాల్చివే సింది.

నందిని ఫోన్లో చిక్కటం... విషయం విని హడావిడిగా ఫ్లైట్‌లో బయల్దేరి రావటం, మూర్తిగారితో విషయం అంతా చెప్పటంతో స్రవంతి రజని చేతుల్లోంచి బయటపడింది.

ఒకరి తర్వాత ఒకరుగా గార్డెన్‌లోకి వెళ్ళటంతో... వసుంధర కూడా వాళ్ల వెన కాలే వచ్చి విషయమంతా విన్నది. "పిచ్చి మొహమా... తెలివితక్కువ ప్లాన్‌లు వేసి దొరికిపోయావ్ కదే.... అసలుకే మోసం వచ్చింది" కూతుర్ని సణుగుతూ లోపలికి తీస్కెళ్లింది వసుంధర.

మర్నాడు ఫ్లైట్ టిక్కెట్స్ వసుంధర చేతిలో పెట్టింది నందిని. బయల్దేరక తప్పింది కాదు వాళ్లకి.

"నీకు తెలుసుగా... మేము బయల్దేరు తున్నాం. అలాగని నిన్ను శాశ్వతంగా ఇక్కడే వుండనిస్తామని అనుకోవద్దు" స్రవంతితో చెప్పారు తల్లీకూతుళ్లు.

"బావ ఎప్పటికీ నా సొంతమే" హెచ్చ రించింది రజని.

"మొన్న చూశారుగా... మా అన్న య్యని... నా కోసం ప్రాణాలైనా ఇస్తాడు" ప్రశాంతంగా... తనూ బెదిరింపుగానే చెప్పింది స్రవంతి.

"అసలు ఏం చూసుకునే నీ పొగరు? చైతన్య ఇంతవరకు నీ మొహం కూడా చూడలేదు? " విస్తుబోతూ అడిగింది వసుంధర.

"మీ బెదిరింపులకు భయపడటానికి... నేనేదో సుఖపడదామని ఇక్కడికి రాలేదు. ఆల్రెడీ జీవితంలో అన్ని ట్రాజెడీలు చూసి వచ్చినదాన్ని నేను. నాకు ఏ ఆశలు, కోరి కలూ లేవు మీ లాగ. కేవలం ఆ పసివా ళ్లకోసమే నేనిక్కడుంటున్నాను. నన్ను మీరేం చెయ్యలేరు" మరింత ప్రశాంతంగా చెప్పింది. వాళ్ల మొహాలు మాడిపోయిన బల్బుల్లాగా అయ్యాయి. రజని కళ్లల్లో బుసకొట్టే విషసర్పాన్ని స్రవంతి చూడ లేదు. పగబట్టిన పాములా... రజని తనని వదలదని ఆమె గ్రహింపుకు రాలేదు. అన్నీ గమనిస్తున్న సావిత్రమ్మ "ఇన్నాళ్లకి బాగా సమాధానం చెప్పారమ్మా" అంటూ స్రవంతిపై అభిమానం కురిపిం చింది.

"తనేనా మాట్లాడింది? అన్నయ్యను తలవగానే తనకెంత బలం వచ్చింది? " ఆశ్చర్యపోయింది స్రవంతి.

5



**శి**వరాం పెళ్లి చాలా బాగా జరిగింది. కోరుకున్న మగడు... బావ... తనవాడు

కావటంతో సునంద కళ్లల్లో ఆనందం దాగ ట్లేదు. రాఘవయ్య, జానకమ్మ చాలా సంతోషంగా వచ్చినవాళ్లకు మర్యాదలు చేశారు.

ఆనందరావు, నందిని స్రవంతి పెళ్లికి హాజరయ్యారు.

"బావగారు..." అని అడుగుతున్న శివ రాంని "ఏదో కాన్ఫరెన్స్ అని వెళ్లారు... అర్జంట్ అట..." సమాధానంతో దాటవే సింది స్రవంతి.

నిజానికి అతనికి ఈ పెళ్లి విషయం తెలుసో, లేదో కూడా ఆమెకి తెలీదు. వసంత పోయాక అతను కూడా ఎక్కువ మాట్లాడినట్లు చూడలేదు. తనకు తానుగా అర్ధరాత్రి వరకూ వ్యాపారంలోనే నిండా మునిగిపోతున్నాడు.

ఆమె జ్ఞాపకాలలో పడి అతను మామూ లుగా మాత్రం బతకటంలేదు. అప్పుడ ప్పుడూ నందిని మాత్రమే అతణ్ణి పరామ ర్శిస్తోంది.

ఏదైతేనేం? అన్నయ్య ఒక ఇంటివాడ య్యాడు. తను కోరుకుంది జరిగింది అను కుంది స్రవంతి.

పిల్లలిద్దర్నీ చెరోపక్క పెట్టుకుని, పట్టు చీర కట్టుకుని కళకళలాడుతున్న స్రవం తిని చూసి బంధువులంతా ఆరా తీశారు "వీళ్ల నాన్న ఏడంటూ..."

వాళ్లని తప్పించుకోవటానికి స్రవంతి పడే ఇబ్బంది చూసింది నందిని. ఆమెకి అన్నీ తెలుసు. కాలమే వాళ్ళిద్దరి మధ్య దూరాన్ని తగ్గించాలి అనుకుని నిట్టూ ర్చింది.

ఆషా, నిషాలకు మాత్రం ఇలా ఇల్లు వదిలి... పెళ్లిలో అమ్మ కొంగు పట్టుకుని చకచకా తిరగటం బోల్డంత నచ్చేసింది. వాళ్ల మొహాలు సంతోషంతో మెరిసిపోతు

న్నాయి.

ఎటు పక్కకి తిరిగినా స్రవంతి చీర చెరుగు మాత్రం వదలట్లేదు ఇద్దరూ. పెళ్లి కొచ్చిన కమలమ్మగారు అందర్నీ ఒక్కసారిగా చూసి సంతోషపడ్డారు. అందర్నీ పేరుపేరునా పలకరించారు.

స్రవంతిని అంటిపెట్టుకుని తిరుగుతున్న మనవరాళ్లని చూపిస్తూ, "అంతా మీ దయ" అంటూ చేతులు జోడించారు ఆనందరావుగారు.

"పెద్దవారు. మీరు ఆ మాట అనకూడదు" చెప్పింది ఆవిడ.

ఆయనకూ స్రవంతి వచ్చిందగ్గర్నుంచి వసంత లేని లోటు తీరుతుందనిపిస్తోంది. పిల్లలిద్దరి పట్ల ఆమె కనపరిచే శ్రద్ధ, ప్రేమ... తన పట్ల, తన ఆరోగ్యం పట్ల ఆమె చూపించే ఆదరణ, గౌరవం నెమ్మదిగా చైతన్య జీవితంలో కూడా మార్పులొస్తాయి అనుకోసాగాడు.

పెళ్లిసందడి తీరే వరకు... నాల్రోజుల దాకా పిల్లలిద్దర్నీ కూడా పెట్టుకుని ఇంటికి తిరిగొచ్చింది స్రవంతి. పచ్చటి పంట పొలాల మధ్య, రవితో కలిసి ఆడి, పాడి, కావలసిన చెట్లకాయలు కోసుకుని తింటూ... పిల్ల కాలువల్లో స్వేచ్ఛగా ఆడుకుంటూ గడిపారు ఆషా, నిషాలు.

ఈ నాలుగురోజుల్లో శివరాంకి, సునందకి కూడా దగ్గరయ్యారు వాళ్లు.

"బై మామయ్యా! బై ఆంటీ..." చేతులూపుతూ, కార్లో కూర్చుంటుంటే... హృదయమేదో లాగేసినట్లు బాధపడ్డాడు శివరాం.

ఇంటికి తిరిగొచ్చేటప్పటికి రజని కుటుంబం లేకపోవడంతో హాయిగా అనిపించింది స్రవంతికి.

"పిల్లల గురించి బాబుగారు రెండుసార్లు అడిగారమ్మా... కనిపించట్లేదని" సావిత్రమ్మ చెప్పింది.

"ఏం చెప్పావ్?" గుండె దడదడలాడుతుంటే అడిగింది స్రవంతి.

"చిన్నమ్మగారితో పెళ్లికి వెళ్లారు. అక్కయ్యగారు పంపారని చెప్పానులే..." అంది.

"మరి స్కూలు..?" అన్నారు. 'మూడ్రోజుల సెలవులట' అని చెప్పాను అంది.

"హమ్మయ్య!" నిట్టూర్చింది స్రవంతి.

ఊరెళ్లి వచ్చాక స్రవంతికి మరింత దగ్గరయ్యారు ఆషా, నిషాలు.

ఆరోజు అర్ధరాత్రి దాటాక భోంచేస్తున్న చైతన్యకి చెప్పింది సావిత్రమ్మ "పిల్లలొచ్చారు బాబూ!" అని.

"ఎక్కడున్నారు?" అంత పెద్ద ఇంట్లో వాళ్లు ఎక్కడ నిద్రపోతున్నారో కూడా తెలీని తనని చూసి వసంత ఆత్మ ఎంత క్షోభిస్తుందో అనిపించింది అతనికి.

స్రవంతి గది చూపించింది సావిత్రమ్మ వాకిట్లో నిలబడి లోపలికి చూశాడు.

స్రవంతి మధ్యలో ఉంటే.. ఆమె మోచేతి వంపులో చెరోపక్క ఆమెని కరుచుకుని రగ్గులో దూరి ఆమెమీద చేతులు పెనవేస్కుని పడుకున్నారు వాళ్లు. డిమ్ లైట్ వెలుగులో ఆమె మొహం సరిగ్గా కనిపించట్లేదు. చూడాలనీ... అతను కోరుకోలేదు.

"వసంతా! మాకు ఏ ఇబ్బంది వుండకూడదని... నీ స్థానంలో మరో మనిషిని తెచ్చి... నువ్వు ఎంత మానసికంగా నలిగిపోయావో... మాకు మాత్రం ప్రశాంతత నిచ్చావు. ఏమిచ్చి నీ రుణం తీర్చుకోను?" అతని కళ్లు మరోసారి చెమర్చాయి.

కాలం ఎవరికోసమూ ఆగదు. గాయాలు చేసే శక్తి, కన్నీళ్లు మిగిల్చే శక్తి, వాటిని మరుపు అనే గొప్ప వరంతో జోకొట్టే శక్తి ఒక్క కాలానికే ఉంది. మన

సునిండా మధురానుభూతులైనా... మని షిని కుంగదీసే విషాదఛాయలైనా ప్రసాదించేది కాలమే.

అది అలా సాగిపోతూ ఉంది.

ఇంతకుముందులా తను ఆశ్రమానికి ఆదివారాలు వెళ్లిరావటం కాకుండా... ఎప్పుడైనా తనకి కుదరనప్పుడు తరుణ్‌ను ఇంటికే తీస్కొస్తోంది స్రవంతి. వాడికి ఆషా, నిషాలతో మంచి దోస్తీ కుదిరింది.

ఎంతో సంతోషంగా ఇంటా, బయటా ముగ్గురూ కలిసి సందడి చేస్తూ ఆడుతూ వుంటారు. వాళ్లతో చిన్నపిల్లలా కలిసిపోయే స్రవంతిని చూస్తే పనివాళ్లకి ఆశ్చర్యమేస్తుంటుంది.

పిల్లలు ఆడేటప్పుడు ఆనందరావుగార్ని కూడా గదిలోంచి పిలుచుకొచ్చి... లాన్‌లో కుర్చీ వేయిస్తుంది.

"ఈ అమ్మాయి చేతుల్లో ఏదో మహిమ వుంది. అందర్నీ ఇట్టే ఆకట్టుకోగలదు" పనివాళ్లతో సహా అందరూ స్రవంతిని కలవరించటం చూసి అనుకునేవాడు ఆయన.

★ ★ ★

ఆ సంవత్సరం పిల్లలకు సమ్మర్ హాలిడేస్ రెండునెలలు వచ్చాయి. "అంతా మా ఊరు రండి" ఆహ్వానించింది నందిని.

స్రవంతికీ మార్పు కోసం వెళ్లాలనే ఉంది. అన్నయ్య దగ్గరికి వెళ్దామంటే వాళ్లిద్దరూ కొత్త దంపతులు. వారి మధ్య తామెందుకు? అన్పించింది "నాకు ఇష్టమే... కానీ..." ఫోన్లోనే నసిగింది.

ఆమె ప్రాబ్లెం ఏమిటో అర్థం అయింది నందినికి.

"చైతన్యతో నేను మాట్లాడతానులే. నాన్నగార్ని కూడా తీసుకురండి" అంది.

స్రవంతి, పిల్లలు... అందరూ సంతోషంగా బయల్దేరారు. ఆనందరావుగారు

ఒకేసారి లాంగ్‌జర్నీ చేయలేరని... మధ్య మధ్యలో బ్రేక్ తీసుకుంటూ సాగింది వాళ్ళ ప్రయాణం.

ఊరు బయట కొండ గుట్టలూ... పొలాలూ వచ్చినపుడు కారు ఆపించేది స్రవంతి. స్నాక్స్‌తో పాటు ఫ్లాస్క్‌లో వున్న వేడి టీ సర్వ్ చేసేది. కారు దిగి రాళ్లమీద కాసేపు కూర్చునేవారు.

చల్లని గాలికి... వేడి టీ... మంచి కాంబినేషన్ అయ్యింది అందరికీ. పిల్లలకు అటువంటి జర్నీ ఇంతవరకు తెలీదు. ఎగిరి గంతులేయసాగారు... అలా... నిదానంగా నందిని ఇల్లు చేరేటప్పటికి చీకటి పడిపోయింది.

"ఏమ్మా! బాగున్నారా?" నందిని భర్త పలకరించాడు.

చైతన్య ఇంటికి ఏం తీసిపోదు నందిని ఇల్లు. కాకపోతే అక్కడ ఉన్నట్లు ఆరుబయట మరీ ఎక్కువ గార్డెన్ లేదు. ఇక్కడ కూడా పదిమంది వరకు ఇంట్లో పని వాళ్లున్నారు.

వీళ్లని పోషించటానికైనా డబ్బు సంపాదించాలి అనుకుంటుంటే నవ్వొచ్చింది స్రవంతికి.

రెండ్రోజులు పూర్తిగా వీళ్లతోనే గడిపింది నందిని. "అత్తయ్యా! అత్తయ్యా!" అంటూ పిల్లలు అన్నింటికీ ఉత్సాహంగా మసలుకోవటం... దానికి కారణం స్రవంతి వాళ్లకి పంచే ప్రేమ కావటంతో నందిని మనసంతా సంతోషంగా నిండిపోయింది.

మూడోరోజు ఆఫీసుకి బయల్దేరింది నందిని.

ఇప్పటివరకు ఆమెను శారీలోనో, చుడిదార్‌లోనో మాత్రమే చూసింది స్రవంతి.

మొట్టమొదటిసారి ప్యాంటూ, షర్టు... దానిపై ఓవర్‌కోటు వేస్కుని నందిని చకచకా నడుస్తుంటే స్రవంతి కళ్లు ఆశ్చర్యంగా చూశాయి. వైజాగ్‌లో చూసిన నందినికి, ఇక్కడ చూస్తున్న నందినికి ఎంతో తేడా...! అనిపించింది స్రవంతికి.

ఇక్కడ ఓ బాస్‌లా... సబార్డినేట్స్‌కు ఫోన్‌కాల్స్‌లో ఆదేశాలిస్తూ... చాలానే బిజీగా ఉంది.

హైదరాబాద్‌లో అన్ని ప్రదేశాలు చూశారు. చార్మినార్, గోల్కొండ దగ్గర్నుంచి... టాంక్‌బండ్ వరకు ఏదీ వదల్లేదు. ఇంకోరోజు నందిని తన పికిల్స్ మేకింగ్ ఫ్యాక్టరీకి తీసుకెళ్ళింది అందర్నీ.

**చేతులనిండా గ్లౌజెస్ వేస్కుని ఎంతోమంది ఎంతో నీట్‌గా తయారు చేస్తున్నారు పచ్చళ్లను. వాళ్లందరి పైనా ఓ సూపర్‌వైజర్ ఉన్నాడు. అన్నీ కొలతల ప్రకారం చేస్తున్నారు. చివరాఖరికి టేస్ట్ చేయటానికి... ఆ సంస్థ మేనేజర్ ఒకరు వైట్ డ్రెస్‌లో ఉన్నారు.**

చేతులనిండా గ్లౌజెస్ వేస్కుని ఎంతోమంది ఎంతో నీట్‌గా తయారు చేస్తున్నారు పచ్చళ్లను. వాళ్లందరి పైనా ఓ సూపర్‌వైజర్ ఉన్నాడు. అన్నీ కొలతల ప్రకారం చేస్తున్నారు. చివరాఖరికి టేస్ట్ చేయటానికి... ఆ సంస్థ మేనేజర్ ఒకరు వైట్ డ్రెస్‌లో ఉన్నారు. టేస్ట్ చేసి... రుచిలో తేడా అనిపిస్తే అతను అంత పెద్దమొత్తాన్ని చెత్తకుండీలో వేయించి మళ్ళీ చేయించటానికి రెడీ.

చూస్తున్న స్రవంతికి ప్రొడక్ట్ గురించి అంత శ్రద్ధ తీసుకుంటారా? అని ముచ్చటేసింది.

పికిల్స్ బాటిల్స్ అన్నీ ఒకదాని తర్వాత ఒకటి నీట్‌గా ప్యాక్ అయ్యి వస్తుంటే... చూడ్డానికి పిల్లలు కూడా ముచ్చటపడ్డారు.

మరోరోజు అందర్నీ గార్మెంట్స్ ఫ్యాక్టరీకి తీస్కెళ్లింది నందిని.

అక్కడా... వందలకొద్దీ మిషన్లు... వేల

కొద్దీ పనివాళ్లు. ఒక్కొక్కళ్లు ఒక్కోరకమైన పని చేస్తున్నారు. బట్టలకు సంబంధించి... జీన్స్‌ప్యాంటో... ఓవర్ జాకెట్సో అయితే... లెఫ్ట్ పార్ట్ ఒకళ్లు కుట్టి... దాన్ని వెనకవాళ్లకి ఇస్తున్నారు. వాళ్లు రైట్‌పార్ట్ స్టిచ్ చేసి... మిగతా పనికి ఇంకొకళ్లకి అప్పచెబుతున్నారు.

బోల్డన్ని మిషన్లు. ఒకళ్ళ తరువాత ఒకళ్లు వరుసగా కూర్చుని టకటకలాడిస్తుంటే- చూడ్డానికి కూడా చాలా చక్కగా ఉంది.

చాలామటుకు లేటెస్ట్ డిజైన్స్ తయారవుతున్నాయి.

"ఇవన్నీ కొంత ఇండియాలో... ఎక్కువ పర్సెంట్ ఫారిన్‌కి ఎక్స్‌పోర్ట్ అవుతాయి" వివరించింది నందిని.

ఆమె అంత పెద్ద ఫ్యాక్టరీల్ని రన్ చేస్తూ కూడా... మిగతావాళ్లతో చక్కగా, నెమ్మదిగా మాట్లాడటం చూసింది స్రవంతి. ఆమెలో ఆత్మవిశ్వాసం కూడా కొట్టొచ్చినట్లుగా కనిపించేది. అదంతా... ఆర్థిక స్వాతంత్ర్యం, విజయం ఇచ్చిన ఆత్మవిశ్వాసం అనిపించింది.

చైతన్య మధ్యలో పిల్లలతో ఫోన్‌లో మాట్లాడసాగాడు. వాళ్ల గొంతులు ఎంతో ఉత్సాహంగా పలకటంతో అతనికీ కొంత మనశ్శాంతిగా అనిపించింది.

అన్నాళ్లు హైదరాబాద్‌లో గడిపి తిరిగొస్తుంటే... తనకి ఒక్కసారి కూడా ఇంతకుముందు ఇక్కడ గడిపిన రెండేళ్ల కాలం గుర్తుకు రాకపోవటం... వింతగా అనిపించింది స్రవంతికి. అప్పట్లో తను బయటకి ఎక్కడికీ రాలేదు కాబట్టి ఏ ప్రాంతమూ తెలీదు. అది వేరే విషయం.

అంటే... నేనూ... అన్నీ మర్చిపోయి... సంతోషంగా ఉన్నానన్నమాట. ఇన్నాళ్లకి మొదటిసారిగా సంతృప్తిగా అనిపించింది స్రవంతికి.

తండ్రిని మరికొన్నాళ్లు తన దగ్గరే ఉంచుకుంటానని నందిని అనటంతో రిటర్న్‌లో వీళ్లు ముగ్గురే బయల్దేరారు. వీళ్లు వెళ్ళేటప్పటికి చైతన్య ఇంట్లోనే ఉన్నాడు. "హాయ్ డాడీ!" పిల్లలిద్దరూ రివ్వున అరుస్తూ... అతన్ని చుట్టుకుపోయారు.

స్రవంతి మౌనంగా లోపలికి వెళ్ళిపోయింది.

తండ్రికి టూర్ విశేషాలు చెబుతూ- అతనికి ఊపిరాడనివ్వలేదు.

మేము అది చూశాం... ఇది చూశాం అంటూ ఒకళ్ళని మించి మరొకళ్లు చెప్పసాగారు. వాళ్ల మాటల్లో ఎక్కువసార్లు "మమ్మీ... మమ్మీ..." అనే పదం రావటం, చెప్పేటప్పుడు వాళ్ల కళ్లు మెరవటం చూశాడు చైతన్య.

మరో రెండ్రోజులకి స్కూల్స్ ప్రారంభం కావడంతో లేజీగా, ఇష్టం లేనట్లుగా... తప్పదన్నట్లుగా రెడీ అవుతున్న పిల్లల్ని చూసి "స్కూల్‌కి వెళితే మళ్ళీ హాలిడేస్ వస్తాయి. అప్పుడు మళ్ళీ ఇంకోసారి వేరే ఊరు వెళ్ళి ఎంజాయ్ చేసి రావచ్చు. మొన్న టూర్ ఎంతో బాగుంది కదా...!" వాళ్లని ఊరించింది స్రవంతి.

"నిజ్జంగా...!" ఆషా అడిగింది.

"ప్రామిస్...!" నిషా చెయ్యి చాపింది.

తనేం ప్రామిస్ చెయ్యగలదు వాళ్లకి? ఎక్కడికి తీస్కెళ్ళగలదు? మహా అయితే... అన్నయ్య దగ్గరికి. అన్నయ్య అనుకుంటుంటే... తరుణ్ గుర్తొచ్చాడు.

మైగాడ్! వాణ్ణి ఇన్నాళ్లుగా మర్చిపోయింది తను. "సరే, బయల్దేరండి... నెక్స్ట్ వీక్ తరుణ్‌ని చూసొద్దాం" చెప్పింది పిల్లలిద్దరికీ!

"కాదు... వాడినే ఇక్కడికి తీస్కొద్దాం" ఒకేసారి చెప్పారు ఇద్దరూ. ఇక్కడైతే వాడితో ఫ్రీగా ఆరుబయట ఆడుకోవచ్చు అనే ఆశ ఇద్దరిదీ.

## కేసు భగ్నం

ఒక విల్లు దావాలో ప్రతివాది వకీలు వాది సాక్షికి బాగా కోపం వచ్చేలా చేసి తుది ఘట్టంలో ఇలా అడిగాడు.

'మీకూ, ఆ విల్లు రాసిన ఆసామికీ పరిచయం లేదటగా? '

'లేకపోవడమేంటి? మేం మంచి స్నేహితులం. రోజూ చదరంగం ఆడుకునేవాళ్ళం' అన్నాడు ముఖం కందగడ్డలా పెట్టుకుని.

'ఇది చాలా ఏళ్ళ క్రితంనాటి మాటనుకుంటా'

'కాదు.. అతను చనిపోవటానికి రెండురోజుల క్రితం కూడా ఆడాం'

ఆ విల్లు ఆ ఆసామీ మరణానికి పదిహేనురోజుల ముందు రాసింది. అది రాసేనాటికి అతనికి మతిస్థిమితం లేదన్నమాట నిజం కాదని తేలిపోయింది.

న్యాయాధిపతి వాది ప్లీడరుకేసి చూస్తూ 'ఏమంటారు మీరు? ' అన్నాడు. అతను కూడా స్పోర్టివ్‌గా 'ఏమంటాను. మా సాక్షి కోపాగ్నిలో మా కేసుమాడిమసైందంటాను' అన్నాడు.




వాళ్ళలా వెళ్ళగానే... "నేను అన్నయ్య దగ్గరికి వెళ్లొస్తాను. సాయంకాలం పిల్లలొచ్చేటప్పటికి ఇల్లు చేరాలి కదా? " అంటూ సావిత్రమ్మతో చెప్పి బయల్దేరింది.

ఎలాగూ వంటపని... ఇంటి నిర్వహణ ఆవిడదే కాబట్టి... ఆనందరావు కూడా లేకపోవటంతో తనకీ పనేం ఉండదు కాబట్టి... మొదటిసారిగా ఎవరి అనుమతీ లేకుండా... అన్న దగ్గరకు బయల్దేరింది.

ముందుగా తరుణ్ దగ్గరకు వెళ్ళింది. "నేను నీతో మాట్లాడను పో" కళ్ళనీళ్ళతో ఆమె చేతిని విసిరికొట్టిన తరుణ్‌ని చూస్తే స్రవంతి మనసు కలిచివేసినట్లైంది.

"ఏం చేస్తాంరా కన్నా... నేనొక చట్రంలో ఇరుక్కుపోయాను" మనసులోనే బాధపడింది. కాసేపటికి వాడిని మాటల్లో పెట్టి వాడికి తెచ్చిన బట్టలు, బొమ్మలు అన్నీ ఇచ్చి మురిపించి వాడి అలక తీర్చింది.

"నెక్స్ట్ వీక్ వస్తావా? " ఆమె బయల్దేరుతుంటే... చెంప మీద ముద్దుపెట్టి టాటా చెబుతూ ఆశగా అడిగాడు.

"వస్తా నాన్నా! నిన్ను అక్కడికే తీస్కెళతా. ఆషా, నిషాలతో ఆడుకుందూగానీ" వాడి కళ్ళు ఆ మాటలతో మెరిశాయి. ఆ టైంలో కమలమ్మగారు లేరు.

వీణ్ణి అటుపూర్తిగా అనాథగా కాకుండా, ఇటు తనతో పూర్తిగా ఉంచుకున్నట్లుగా కాకుండా మధ్యస్తంగా వదిలేసి వాడి చిన్న మనస్సుతో ఆడుకుంటోందా తను? పై లోకాల్లో ఉన్న లక్ష్మి తన కొడుకునిలా... అటూ, ఇటూ వూగిసలాడే మనస్సుతో బాధపెడుతున్నందుకు తనని చూసి ఎంత బాధపడుతుందో?

తరుణ్ పరిస్థితి తల్చుకున్న స్రవంతికి బాధగా అన్పించసాగింది.

శివరాం ఇంటికి వెళ్ళగానే... "అక్కా బాగున్నావా? " రవి ఆమెను చుట్టుకుపోయాడు. వాడు శివరాం దగ్గిరే ఉండి చదువుకుంటున్నాడు.

చాలా రోజులకి వచ్చిన స్రవంతిని చూసి ఆనందపడ్డారు శివరాం, సునంద. జానకమ్మ

కూఢా అక్కడే ఉంది. సునంద నెమ్మదిగా కదలడం చూసిన స్రవంతి "నాకు అల్లుడా..? కోడలా..?" అంటూ అడిగింది.

సునంద అందంగా సిగ్గుపడింది.

"అందుకేనమ్మా! నేనూ వచ్చాను. ఐదో నెలలో మంచిరోజు చూసి ఇంటికి తీస్కెళదామని" అంది జానకమ్మ.

"ఏమ్మా? బాగున్నావా... సంతోషంగా వుంటున్నావా..?" పక్కకి తీస్కెళ్ళి స్రవంతిని అడిగింది ఆవిడ.

నవ్వుతూ తల వూపింది స్రవంతి.

హైదరాబాద్ నుంచి తెచ్చిన శారీ సునంద చేతికిచ్చింది. "మీ అన్నయ్యకేమీ లేవా?" అప్పుడే లోపలికి అడుగు పెడుతున్న రాఘవయ్య అడిగాడు.

"అన్నయ్యకు నేనొచ్చాగా..." అన్న వైపు నవ్వుతూ చూస్తూ చెప్పింది.

"అదే గొప్ప బహుమతి నాకు" శివరాం కళ్లు మౌనంగా పలికాయి.

భోజనాలయ్యాక ఇంటికి బయల్దేరింది... పిల్లలొచ్చే వేళవుతుంది అంటూ.




**శి**వరాంకి పండంటి మగబిడ్డ పుట్టాడు. తల్లయ్యి, నిండుదనంతో మెరిసిపోతున్న సునందని చూస్తుంటే... మాతృత్వం ఇంత గొప్ప తృప్తినిస్తుందా అనిపించింది స్రవంతికి.

బయటికి మామూలుగా... కాస్తో కూస్తో సంతోషంగా, నెమ్మదిగా కనిపిస్తున్నా...లోలోన నీ జీవితం పగిలిన గాజుముక్క అని అంతరాత్మ వెక్కిరిస్తున్నట్లుగా తోచింది స్రవంతికి.

జీవితం ఏ దిగులూ లేకుండా... అలాగని సంతోషమూ లేకుండా మామూలుగా గడిచిపోతోంది స్రవంతికి. ఆషా, నిషాలను చూస్కుంటున్న ఆత్మతృప్తితోనైనా... ఇలాగే గడిస్తే చాలు అనుకుంటుంది.

ఈమధ్యలో ఆనందరావుగారు కాలం చేశారు. నందిని దగ్గర్నుంచి వచ్చిన కొన్నాళ్ళకే ఆయన వార్ధక్య భారంతో మంచాన పడ్డారు. స్రవంతి దగ్గరుండి అన్నీ తనే అయి చేసింది.

కోడలి జబ్బు, కొడుకు జీవితం వీటి గురించి బెంగ పెట్టుకున్న ఆయన స్రవంతి రాకతో... ఆమె పంచే ప్రేమ, ఆదరణలతో తృప్తిగానే కన్నుమూశారు.

పోయేముందు చైతన్యతో ఎలా మెలగాలో... అతని మనస్తత్వమేమిటో అన్నీ స్రవంతికి చెప్పేవాడాయన.

వసంత పోయాక అతను ఎంత స్తబ్దుగా మారిపోయాడో, ఏం తింటున్నాడో... ఎలా జీవిస్తున్నాడో... ఇలాగే విరాగిలా ఎన్నాళ్లు బాధపడతాడో... కొడుకుని గమనిస్తున్న ఆయనకి అన్నీ తెలుసు.

అతని మనసుని మెల్లగా ఆకట్టుకోవాలనే విషయాన్ని మొదటిసారిగా స్రవంతికి చెప్పింది ఆయనే.

ఇంతవరకు అతనివైపు తను సరిగ్గా చూసి కూడా లేదు. అలాగే అతనూ... ఇవన్నీ సాధ్యమయ్యే పనులేనా? ఒక్కసారి కూడా అతనితో మాట్లాడి ఎరగదు. అతని నిలువెత్తు రూపం, గాంభీర్యత... తనకి అంత సాహసాన్నివ్వవు అనిపించింది స్రవంతికి.

తరుణ్ అప్పుడప్పుడూ ఇంటికి వస్తూ

పోతూ వుండడంతో వాడికి చైతన్యతో కూడా చేరిక అయ్యింది. అతణ్ణి 'అంకుల్... అంకుల్' అంటూ పిలవసాగాడు.

తరుణ్ ఎవరంటూ కూతుళ్లిద్దరినీ కనుక్కున్న చైతన్య వాడికి కూడా కూతుళ్ళతోపాటు చాక్లెట్స్ తెచ్చివ్వటం, ఐస్‌క్రీమ్ పార్లర్‌కి తీసుకెళ్లడం చేసేవాడు.

తరుణ్ మాత్రం ఎంచక్కా ఆషా, నిషాలతో పాటు చైతన్య ఒళ్ళో పడుకుని ఆశ్రమం కబుర్లు చెప్పేవాడు వచ్చీ, రాని మాటలతో. అతని భుజాలపై ఎక్కి ముందుకీ, వెనక్కీ ఊగుతూ ఆడుతుండేవాడు.

అటువంటి పరిస్థితుల్లో స్రవంతి చాటుగా వాళ్ళని గమనించేది. చైతన్యతో అంతగా అల్లుకుపోయిన తరుణ్ ధైర్యానికి ముచ్చటపడేది.

వాడు అనాథ అని తెలిసీ, అంత పెద్ద హోదాలో వున్నా కూడా- వాడితో చైతన్య మెలిగే తీరు ఆమెకి సంతోషంగా అన్పించేది.

వాడు నిమిషానికోసారి 'చవంతి అక్కా! చవంతి అక్కా' అంటూనే కబుర్లు చెప్పేవాడు.

"ఈ చవంతి ఎవరు? " ఓసారి కూతుళ్ళని అడిగాడు చైతన్య.

"అయ్యో! మమ్మీ కదా.. డాడీ" వాళ్లిద్దరూ ఒకేసారి అరిందాల్లా... తలను చేతుల్తో పట్టుకుని ఇది కూడా తెలీదా అన్నట్లు చెప్పేవాళ్ళు.

"వాడికి మమ్మీ పేరు పలకటం రాదు... స్రవంతి అని" చెప్పేవాళ్ళు.

"ఆఁ... ఆఁ..." ముక్తసరిగా, ముభావంగా తల ఊపేవాడు.

మమ్మీ అంటే వాళ్ళ దృష్టిలో స్రవంతిగా చోటుచేసుకుంది అనే విషయాన్ని చాలాసార్లు గమనించాడు చైతన్య. అలాగే... మొదటిసారి ఆమె పేరు స్రవంతి అనే విషయం అతని దృష్టిలోకి వచ్చింది. పని వాళ్ళు ఎప్పుడైనా చెప్పినా... 'చిన్నమ్మగారు' అనే అంటారు కాబట్టి ఆమె పేరు ఇంతవరకూ తెలీదు అతనికి.

ఆనందరావుగారు చనిపోయాక రజని కుటుంబం ఫారిన్ నుంచి దిగకపోవడంతో నిశ్చింతగా అనిపించింది స్రవంతికి. మూర్తిగారొక్కరే వచ్చి వెళ్ళారు. కానీ వసుంధర, రజని వీళ్ళ గురించి మర్చిపోలేదనే విషయం ఆమెకి తెలీదు.

అన్నీ మనమనుకున్నట్లు జరిగితే అది జీవితమెందుకవుతుంది?

ఓ ఆదివారం ఇంటికి తీస్కొచ్చిన తరుణ్‌ని రాత్రవుతుండగా ఆశ్రమంలో డ్రాప్ చేయడానికని ఆషా, నిషాలతో తనూ వెళ్ళింది స్రవంతి.

తరుణ్‌ని డ్రాప్ చేసి వచ్చేటప్పటికి చీకటి పడిపోయింది. ఆషా, నిషాలిద్దరూ కారులోనే నిద్రపోయారు.

డ్రైవరు ఆషాని ఎత్తుకుని లోపలికి తెస్తుంటే... నిషాను తను భుజంమీద వేసుకుంది.

"నే తెస్తా కదమ్మా!" డ్రైవరు నొచ్చుకుంటుంటే... "ఫరవాలేదు" అంటూ లోపలికి నడిచింది.

పిల్లలిద్దర్నీ బెడ్‌రూంలో పడుకోబెట్టి మంచినీళ్లు తాగుదామని కిచెన్‌లోకి వెళ్లింది. అప్పటికే చైతన్య బిజినెస్ కాన్ఫరెన్స్ అంటూ ఆస్ట్రేలియా వెళ్లి పదిరోజులైంది.

"బాబుగారు లేరుకదమ్మా! ఓ నాలుగు రోజుల్లో వస్తాను. చాలా రోజులైంది" అంటూ బతిమలాడి బంధువులింటికి వెళ్లింది సావిత్రమ్మ.

పోనీలే వాళ్లకి ఇలాంటప్పుడే కదా

సమయం దొరికేది అనుకుంటూ తల వూపింది. దాంతో మిగతా నలుగురైదు గురు పనివాళ్లు ఒక్కొక్కళ్లే అదీ.. ఇదీ అంటూ రెండ్రోజుల్లో వస్తాం అంటూ జారుకున్నారు. చివరికి ఇద్దరు ఆయాలు మాత్రం మిగిలారు.

ఎవరూ లేకుండా... ఇంత పెద్ద బంగ్లాలో... ఈ చిన్నపిల్లలిద్దర్నీ పెట్టుకుని తనవల్ల కాదు... "మీరు మాత్రం మిగతా వాళ్లు వచ్చాకే" అంటూ గట్టిగా చెప్పింది ఆయాలకు.

పనివాళ్లంతా అదే కాంపౌండ్‌లో ఓ పక్కగా ఉన్న క్వార్టర్స్‌లో ఉంటున్నారు. పగలంతా పనులుచేసి చీకటిపడేటప్పటికి వాళ్ల ఇళ్లకు వెళతారు, సావిత్రమ్మ తప్ప.

ప్రస్తుతం ఇంట్లో ఎక్కువమంది లేకపోవటంతో ఇల్లంతా బోసిగా, ఖాళీగా కనిపిస్తోంది.

కిచెన్‌లో వాటర్ కోసం వెళ్లిన స్రవంతికి, తలుపులు తెరవగానే...

"హేయ్...!" ఓ ఆకారం టైగర్ మాస్క్ తగిలించుకుని బిగ్గరగా అరుస్తూ ముందుకు ఎగిరి దూకింది. భయంతో కెవ్వుమని అరిచింది స్రవంతి.

గుండెలోని రక్తమంతా ఒక్కసారిగా గడ్డకట్టుకున్నట్లు... ఒళ్లంతా చల్లబడిపోయింది ఆమెకు. శరీరమంతా చెమటతో తడిసిపోయింది.

ఆమె కేక విని పైన రూమ్ క్లీన్‌చేస్తున్న ఆయాలు పరిగెత్తుకొచ్చారు. "ఏమైందమ్మా" అంటూ అప్పటికే ఆ మాస్క్ తాలూకు స్వరం పలకరిస్తోంది "హేయ్... హు ఆర్ యూ? ఐయామ్ ఎక్స్‌పెక్టింగ్ ది లవ్లీ ట్విన్స్..."

ఆ డిమ్‌లైట్స్‌లో మనిషో, జంతువో తెలీక అనుకోని అతని చేష్టలకి భయపడ్డ స్రవంతి గుండెలమీద చెయ్యేసుకుంటూ... 'హమ్మయ్య మనిషే...' అని రిలీఫ్ ఫీల్ కాసాగింది.

"హౌ... సో... బ్యూటీఫుల్..." అక్షరాలు సాగదీస్తూ, ఆమెని ఆపాదమస్తకం గమనిస్తూ... మాస్క్ తొలగించుకుంటూ అన్నాడు అతను.

"శేఖర్ బాబమ్మా! రజని అన్నగారు. వసుంధరమ్మగారి కొడుకు... మీరలా వెళ్లగానే వచ్చారు... అందుకే పైన రూమ్‌లో బెడ్‌షీట్స్ మారుస్తున్నాం" చెప్పారు ఆయాలిద్దరూ.

"చిన్నమ్మగారు" అంటూ అతనికీ పరిచయం చేశారు.

ఇంకా భయం తగ్గలేదు స్రవంతికి. పైనుంచి కిందివరకు తనని చూపుల్తోనే తడుముతున్న అతణ్ణి చూసి చిరాగ్గా మొహం చిట్లించింది.

"బావగారు...లే...రా? " ఒక్కో అక్షరం సాగదీసి పలుకుతూ అడిగాడు.

"లేరు" ముక్తసరిగా పలికింది.

"ఆషా... నిషా...? "

"పడుకున్నారు" చెప్పి, "ఆయమ్మా... ఈయనకి భోజనం వడ్డించు" అని చెప్తూ ఇంకా కిచెన్ వాకిట్లోనే అడ్డుగా నిలబడ్డ అతణ్ణి, 'తప్పుకుంటారా? ' అని అడుగుతూ లోపలికి వెళ్లింది.

"లవ్‌లీ... ఇంట్రెస్టింగ్" వెళుతున్న ఆమెని చూస్తూ నోట్లో ఉన్న బబుల్‌గమ్ గట్టిగా నమిలాడు శేఖర్.

అలా దిగిపోయిన శేఖర్ స్రవంతి ఎటు తిరిగినా తినేసే చూపులతో ఆమెని తడిమేస్తున్నాడు. అతని బిహేవియర్ కంపరంగా వుంది స్రవంతికి.

మర్నాడు పిల్లలిద్దరితో షటిల్ ఆడుతోంది స్రవంతి. నెట్‌కి వాళ్లిద్దరూ ఒక పైపు, స్రవంతి మరోవైపు వుండి ఆడుతున్నారు. అక్కడికి వచ్చి కొద్దిదూరంలో ఉన్న సిమెంట్ బెంచి మీద కూర్చున్నాడు శేఖర్. స్రవంతినే గమనించసా

గాడు. మాటిమాటికీ నడుముదగ్గర చీర చెంగు దోపుకోవటం, నుదుటిమీద పడుతున్న ముంగురులు సవరించుకోవటం... చీర కుచ్చెళ్లు ఎత్తిపట్టుకుని కాక్ ఎత్తి కొడుతుంటే రెండు కళ్లతో ఆమె రూపలావణ్యాలు తాగేస్తున్నాడతను. అతని చూపులు చురుక్కున తగిలినట్లనిపించి-

"ఆషా... ఇక చాలు... రేపు మళ్లీ ఆడదాం... ఇంట్లోకి పదండి" పిల్లలిద్దర్నీ పిలిచింది.

"మమ్మీ... ప్లీజ్... ఇంకొంచం సేపు"

ఆట ఆపేస్తే అపురూపమైన దృశ్యం కరిగిపోతుందన్నంత కంగారుగా దగ్గరికొచ్చాడు శేఖర్. 'ఓ. కె., ఓ. కె... గొడవ చెయ్యొద్దు... ఆడదాం' అని పిల్లల్ని ఊరుకోబెడుతూ స్రవంతివైపు చేరాడు రాకెట్ పట్టుకుని.

"బ్యూటీక్వీన్స్... మీరిద్దరూ ఒకవైపు, నేనూ మమ్మీ ఒకవైపు సరేనా?" స్రవంతి చూపుల్లో కోపాన్ని చూసి తల తిప్పుకుంటూ చెప్పాడు.

**నెట్‌కి వాళ్లిద్దరూ ఒకవైపు, స్రవంతి మరోవైపు వుండి ఆడుతున్నారు. అక్కడికి వచ్చి కొద్దిదూరంలో ఉన్న సిమెంట్ బెంచి మీద కూర్చున్నాడు శేఖర్. స్రవంతినే గమనించసాగాడు. చీర కుచ్చెళ్లు ఎత్తిపట్టుకుని కాక్ ఎత్తి కొడుతుంటే రెండు కళ్లతో ఆమె రూపలావణ్యాలు తాగేస్తున్నాడతను.**

"థాంక్స్ అంకుల్" పిల్లలు ఆటలో మునిగిపోయారు.

మాటిమాటికీ అవసరమున్నా, లేకున్నా కాక్ కోసమన్నట్లు గాల్లో ఎగురుతూ వచ్చి స్రవంతి భుజాలకు తగలసాగాడు.

"మిస్టర్... తగలకండి. నాకు చిరాకు" చెప్పేసి వెనుదిరిగింది.

"పిట్ట కూతపెడ్తుందే... ఊం.. ఫరవా లేదు" స్రవంతివైపే చూస్తూ కామెంట్ చేశాడు. అతని మాటలు విననట్లు "ఆషా... ఎండొచ్చేస్తుంది. పదండి లోపలికి వెళదాం" వాళ్లని కన్విన్స్‌చేస్తూ ఆట ముగించింది.

శేఖర్ మొహంలో ఛాన్స్ పోయిందే అన్న బాధ కనిపించింది.

ఓ ఆదివారం స్విమ్ సూట్స్‌లో ఉన్న ఆషా, నిషా ఈతకొడుతుంటే అక్కడే గట్టున కూర్చుని చూడసాగింది స్రవంతి.

"మమ్మీ... చూడు ఎలా డైవ్ చేస్తానో" ఆషా గట్టుమీదికొచ్చి చెప్తుంటే చూస్తోంది. ఎప్పుడు వచ్చాడో శేఖర్ స్రవంతి పక్కనే కూలబడ్డాడు.

చిరాగ్గా నొసలు చిట్లించి దూరంగా జరిగింది తను.

"వెరీగుడ్... వెరీగుడ్..." ఆషా డైవ్ చూసి చప్పట్లు చరుస్తూ అరిచాడు.

"అంకుల్... మీకు స్విమ్మింగ్ వచ్చా?" నీళ్లల్లోంచే అడిగింది నిషా.

"ఓ యస్. మా కంట్రీస్‌లో ఇంతకన్నా పెద్దవి వుంటాయి" ఒంగి నీళ్లందుకుని నిషా మోముపై చిలకరిస్తూ అన్నాడు.

"మరయితే రండంకుల్... మా డాడీ కూడా ఇంతకుముందు మాతో కలిసి స్విమ్ చేసేవారు. ఇప్పుడేమో ఎప్పుడు చూసినా బిజీయేనట" బుంగమూతితో చెప్పింది ఆషా.

"ఓ. కె" తన ఈత నైపుణ్యం స్రవంతి చూడాలన్నట్లు నీళ్లలోకి దిగాడు.

స్రవంతి మనసులో దిగులు కమ్ముకోసాగింది. ఊర్కే ఏదో ఓ వంకతో తగులుతున్నాడు. ఏమిటితని ధోరణి? తనెక్కడుంటే అక్కడికి వచ్చేస్తున్నాడు.

ఆలోచిస్తుంటే... "మమ్మీ... దగ్గరికి

రా..." నీళ్లల్లోంచే ఆషా పిలుస్తుంటే లేచి దగ్గరికి వెళ్లి నిలబడింది స్రవంతి.

"చూడు... ఇది క్రోకడయిల్ స్విమ్మింగ్" చూపిస్తూ నీళ్లలో మునిగింది.

"మమ్మీ... ఇది చూడు.. బటర్‌ఫ్లై స్విమ్మింగ్" మరోవైపు వున్న నిషా పిలవటంతో అటు నడిచింది. ఈ లోపు నీళ్లలో ఈదుతూ గట్టువైపు వచ్చాడు శేఖర్.

ఉన్నట్టుండి స్రవంతి కాళ్లు పట్టుకుని నీళ్లలోకి లాగేశాడు. ధబ్‌మంటూ అదాటున నీళ్లల్లోకి పడి ఉక్కిరిబిక్కిరి కాసాగింది. ఇదే అదనుగా ఆమెను చుట్టెయ్యసాగాడు.

అతన్ని తోసేసి లేచి బయటికి వచ్చేసింది. "రాస్కెల్..." స్రవంతి తిడుతుంటే అతనిలో పట్టుదల పెరిగింది. తడిబట్టలతో ఇంట్లోకి నడుస్తున్న స్రవంతికి దుఃఖం, నిస్సహాయత, కోపం అన్నీ ఒక్కసారిగా మనసుని కుదిపేశాయి.

"ఏంటి చిన్నమ్మా... ఇలా తడిశారు?" ఆయాలు అడుగుతుంటే "జారిపడ్డాను" చెప్పింది.

బట్టలు మార్చుకుని మంచంమీద వాలిపోయింది స్రవంతి.

"అన్నయ్యకు చెబితే శేఖర్ కాళ్లు విరిచేయటం ఖాయం. కానీ గొడవ పెద్దదవుతుంది" ఒక విధమైన నైరాశ్యం అల్లుకుంది ఆమెని. ఆమె ప్రమేయం లేకుండానే కనుకొనల్లోని నీరు చెంపలను తడపసాగింది.

మరో రెండ్రోజులకు చైతన్య వచ్చేశాడు. అతని రాకతో... కొండంత బలం దొరికినట్లైంది ఆమెకి. వస్తూనే పిల్లలకి రకరకాల గిఫ్ట్స్ పట్టుకొచ్చాడు. "ఇవి తరుణ్‌కివ్వండి" పిల్లలకిస్తూ చెప్పాడు.

తరుణ్‌ని గుర్తుపెట్టుకున్నాడన్నమాట. అతని మాటలు విన్న స్రవంతి అనుకుంది.

"థాంక్స్ డాడీ..." పిల్లలిద్దరూ చెరోపక్క అతని చెంపలపై కిస్ చేస్తూ అతని భుజాలపై వాలిపోయారు.

"ఏరా... జాబ్ ఎలా సాగుతోంది? అమ్మా వాళ్ళు బాగున్నారా?" ఆరోజు భోజనాల దగ్గర శేఖర్‌ని అడిగాడు చైతన్య.

"ఆс... ఈ మధ్య ప్రాజెక్ట్ వర్క్ ఒకటి ఆర్డర్స్ అయ్యాయి. దానికి సంబంధించి సాఫ్ట్‌వేర్ కోర్సొకటి చెయ్యాలి. అందుకోసమే ఇండియా వచ్చాను"

"ఎన్నాళ్లు పడుతుంది?"

"ఓ నెలరోజులు అనుకున్నాను. చూస్తుంటే ఎక్కువ రోజులే పట్టేట్లుంది" కిచెన్‌లో అటూ, ఇటూ తిరుగుతున్న స్రవంతిని ఓరగా చూస్తూ అన్నాడు.

సావిత్రమ్మ వెళ్లిన దగ్గర్నుంచీ స్రవంతే వంట చేస్తోంది. కానీ సర్వీసింగ్‌కి మాత్రం ఆయమ్మని టేబుల్ దగ్గరికి పంపిస్తోంది.

పిల్లలిద్దరూ బోర్ కొడుతోందని గొడవ చేస్తున్నారు. వాళ్ళిద్దరితో కేరమ్స్ ఆడించి, కథలు చెప్పి సగంరోజు నెట్టుకొచ్చింది స్రవంతి. "బయటికి వెళదాం" అంటూ మొదలుపెట్టారు.

"కూరగాయలు తీసుకురా..." ఆయా డ్రైవర్‌తో చెప్పటం వింది స్రవంతి.

"పదండి, మనమూ మార్కెట్‌కి వెళదాం" పిల్లలిద్దరితో బయటికి వచ్చింది.

"దార్లో నాకు ఐస్‌క్రీమ్ కావాలి" ఆషా అడిగింది.

"నాక్కూడా... స్ట్రాబెర్రీ" ఆర్డర్ చేసింది నిషా.

కార్లో ఆషా, నిషాలిద్దరూ ఫ్రంట్ సీటు కావాలని గొడవ మొదలుపెట్టారు. కార్లో బయలుదేరిన ప్రతిసారీ ఇద్దరినీ చెరోసారి డ్రైవర్ పక్క సీట్లో కూర్చోబెడుతుంది స్రవంతి. ఆ సీట్‌లో కూర్చుంటేనే రోడ్డు

అంతా బాగా కనిపిస్తుందని ఇద్దరూ పోటీలు పడతారు.

ఈసారి ఒక్కళ్లని కూడా ఒప్పించడం స్రవంతికి సాధ్యం కాలేదు.

ఇద్దరూ ఫ్రంట్ సీటు చెరో సగం పంచుకుని దాన్లోనే ఒదుక్కుని కూర్చున్నారు. కారు కాంపౌండ్ గేటు దాటుతుంటే ఆటో అతనికి పే చేస్తూ వున్నాడు శేఖర్. కారు, దాన్లో స్రవంతిని చూసేటప్పటికి చెయ్యి అడ్డుగా పెట్టి ఆపాడు. "సిటీకే కదా... నాకూ కొద్దిగా పనివుంది" బ్యాక్ డోర్ తీస్కుని స్రవంతి పక్కన కూర్చున్నాడు. స్రవంతి గుండె దడదడలాడసాగింది. ఉదయం నుంచీ అతను ఇంట్లో లేకపోవటంతో ప్రశాంతంగా వుంది ఆమెకి.

"డ్రైవర్... ఎ.సి. ఆన్ చెయ్, ఉక్కగా వుంది" చెబుతూ స్రవంతి వైపు వున్న విండో గ్లాస్ క్లోజ్ చేయటానికన్నట్లు ఆమె మీద ఒరిగిపోయాడు.

"నేను వేస్తాను... వదలండి" స్రవంతి చెప్పింది.

"మీకెందుకు శ్రమ..." వంకరగా నవ్వుతూ అన్నాడు.

కాయగూరలు కొంటుంటే "అబ్బా... ఇక్కడ ఎండగా వుంది. కనీసం సరిగ్గా షెడ్డు కూడా వేసుకోకుండా అమ్ముతున్నారు వీళ్లు..." విసుక్కుంటున్నట్లు, నీడ కోసమొచ్చినట్లు, స్రవంతి మీద పడిపోతున్నట్లుగా నిలబడి తనూ బ్యాగ్‌లో కూరగాయలు వెయ్యసాగాడు. అతన్ని విదిలించుకుంటూనే వుంది స్రవంతి. "డ్రైవర్... ఐస్‌క్రీమ్ పార్లర్ దగ్గర ఆపు' ' చెప్పి, కార్లో కూర్చోబోతున్న శేఖర్‌తో "మీకేదో పని వుందన్నారు కదా... ఆటోలో వచ్చెయ్యండి" డ్రైవర్ వినేట్లు చెప్పింది.

'దెబ్బ కొట్టావు కదే...' అని మనసులోనే అనుకుని, "నాదెంత? రెండునిమిషాల పని. మీ ఐస్‌క్రీమ్ పార్లర్ పక్కనే..." చెబుతూ కూర్చున్నాడు.

పిల్లలిద్దరికీ తనే ఐస్‌క్రీమ్స్ కొన్నాడు శేఖర్. తానొకటి చేతిలో పట్టుకుని, స్రవంతికొకటి తీసుకుని వచ్చి కూర్చున్నాడు.

"తీస్కోండి" కేండీ చేతికందిస్తూ చెప్పాడు.

"నాకు అలవాటు లేదు... ఐస్‌క్రీమ్స్ తినను" విసుగ్గా చెప్పింది అతని చేతిలోంచి తీస్కోవటం ఇష్టంలేక.

"ప్లీజ్...నా కోసం..." బతిమాలుతూ అన్నాడు.

"ప్చ్ మీరు తింటుంటే దానికెంత అదృష్టం పట్టిందో చూడాలని వచ్చాను" నిరాశగా మొహం పెట్టి గుసగుసగా, హస్కీగా అన్నాడు.

విండో వైపు మొహం తిప్పుకుని కూర్చుంది స్రవంతి.

"తరుణ్ దగ్గరికి వెళదామా?" పిల్లలిద్దరూ అడిగారు.

"డ్రైవర్... ఆశ్రమం వైపు పోనీ..." కొంచెం సేపు అక్కడ గడిపినా మనసుకి ఊరటగా వుంటుందేమో అని చెప్పింది. వీళ్లని చూస్తూనే తరుణ్ పరిగెత్తుకుంటూ వచ్చాడు. పిల్లలంతా ఆడుకుంటుంటే కమలమ్మగారితో ఆఫీసులో మాట్లాడుతూ కూర్చుంది స్రవంతి.

ఈ లోపు తరుణ్ ఎవరు... ఏంటి అని కూపీ లాగాడు శేఖర్ పిల్లల దగ్గర.

అంతా కారు దగ్గరికి వచ్చి 'బై' చెబుతుంటే తిరిగి బయల్దేరారు.

"ఎ లవ్‌స్టోరీ విత్ టూ హజ్బెండ్స్. ఇద్దరు కూతుళ్లు, ఒక కొడుకన్నమాట. ఒక రాధ ఇద్దరు కృష్ణుల స్టోరీనే నీది కూడా..." నోటికొచ్చినట్లు మాట్లాడాడు శేఖర్ సన్నని గొంతుతో.

ఇక ఓర్చుకోలేకపోయింది స్రవంతి.

"డ్రైవర్ కారాపు. శేఖర్‌గారికి ఇక్కడేదో పనివుందంట. దిగిపోతారట" చెప్పింది స్రవంతి. దిగక తప్పలేదు అతనికి.

ముందుకి సాగిపోతున్న కారుని చూస్తూ, 'నాకు దొరక్క ఎక్కడికి పోతా వులే...' అనుకుంటూ పిడికిళ్లు బిగించాడు.

ఇంటికి వచ్చేటప్పటికి చైతన్య వచ్చి హాల్లోనే కూర్చుని ఫోన్లో మాట్లాడుతూ కనిపించాడు. పిల్లలిద్దరూ తండ్రి దగ్గర చేరారు. లోపలికి వెళ్ళబోతూ ఒక్క నిమిషం ఆగింది స్రవంతి. ఇతనితో శేఖర్ సంగతి చెప్తే...? చెప్పేంత చనువు తనకుందా...? చెప్తే నమ్ము తాడా...? విసుగ్గా తల విదిలించు కుంటూ లోపలికి నడిచింది స్రవంతి. చైతన్య ఎప్పటిలాగే స్రవంతిని చూడ లేదు. ఆమె అక్కడ నిలబడటం గమనిం చలేదు. పిల్లలతో మాటల్లో వున్నాడు.

ఓ రోజు ఎవరూ లేని సమయం చూసి స్రవంతితో చెప్పాడు శేఖర్, "నేనెందుకొ చ్చానో తెలుసా? నీ కోసమే. నువ్వు చాలా అందంగా వుంటావని మా రజని మరీ మరీ చెప్పింది. నీకోసం ఆశపడి వస్తే నువ్వు దూరంగా వెళ్ళిపోతు న్నావ్...!"

స్రవంతి అతన్ని తప్పుకుని ముందుకి నడవబోయింది.

అడ్డు తగులుతూ.. "అయినా మా బావతో ఏం సుఖపడుతున్నావ్ చెప్పు... ఆయన చూస్తే పైగది. నీదేమో కింద పడక. నన్ను నమ్ముకుంటే నాతోపాటు తీస్కెళ్లి దేశదేశాలు చూపిస్తాను. జీవిత మంటే ఏమిటో... ఎంత ఎంజా య్‌మెంట్ వుందో నీకు తెలీదు. ఎన్నా ళ్లిలా చిన్నపిల్లల్ని పెంచుకుంటూ... నీ వయసంతా అడవికాచిన వెన్నెలలా వేస్ట్ చేసుకుంటావ్... ఇక్కడే వుంటే పనిమ నిషి జీవితమే నీది. ఆలోచించుకో..."

## చిత్తం

సాక్షి నిర్లక్ష్యపు జవాబులతో ఒళ్లుమం డిన న్యాయవాది 'నిజం చెప్పడం ఇష్టంలే దల్లే వుంది. నేను ఆ మాత్రం గ్రహించ లేని చవటననుకున్నావా?' అని గద్దిం చాడు.

'చిత్తం' అని ఊరుకున్నాడు సాక్షి.

అంతా గొల్లున నవ్వేశారు.




చెప్పాడు.

అతనికి సమాధానం చెప్పటానికి కూడా అసహ్యమేసి... మౌనంగా అతని మాటలు వినబడనట్లు తన పని తను చేసుకోసా గింది.

ఆడదానికి అసలైన గౌరవం కట్టుకున్న మొగుడినుంచే రావాలి. అతడు ఆమెను ఆత్మీయంగా చూసుకున్నప్పుడే ఇతరులు కూడా ఆమెని గౌరవిస్తారు.

"మౌనం అర్ధాంగీకారమన్న మాట" పొగ రుగా ఆమె చేతిని ఒడిసిపట్టుకున్నాడు.

చేయి వదిలించుకుని... అతన్ని దూరంగా విదిలించి కొట్టింది స్రవంతి.

"ఎంత పొగరు నీకు...?" అతని కళ్లు క్రోధంతో ఎరుపెక్కాయి. మళ్లీ చెయ్యి లేపాడు. ఈలోపు ఆయమ్మ పిలిచింది. "అమ్మా... మీకు ఫోన్" అంటూ.

## సహజమే

**న్యాయమూర్తి:** మీ వాదన పేలవంగా ఉంది. అందుకే ఈ చెవితో విని, ఆ చెవితో వదిలేస్తున్నా

**న్యాయవాది :**మధ్యలో ఏమీ అడ్డులేన ప్పుడు అలాంటిది సహజమేలెండి.

**న్యాయమూర్తి :** ? !?



ఆమె అంతా చూసిందనటానికి సాక్ష్యంగా ఆమె కళ్ళు భయంతో రెపరెప లాడ్తున్నాయి.

'ఎలాగైనా దాన్ని తరిమెయ్యరా...' అంటూ వసుంధర, రజని కోరటంతో ఇక్క డికి వచ్చాడు అతను. కానీ స్రవంతిని చూశాక అతని బుద్ధి పెడదారి పట్టింది. ఆమె ఒంటరిగా... ఇంత పెద్ద ఇంట్లో అండలేనట్లు గడపటం అతనికి అలుస య్యింది.

'నిన్ను ఊరికే వదిలిపెట్టను' వెళుతున్న స్రవంతి వైపు చూస్తూ, కసిగా దవడలు బిగించాడు మనసులోనే. మరో నాలుగు రోజులు స్రవంతిని తప్పుకుని తిరిగాడు శేఖర్.

అతని బిహేవియర్ అలాగే వుంటే... నందినికైనా ఫోన్‌చేసి చెప్పాలనుకుంది స్రవంతి. కానీ అతను తప్పుకు తిరగ టంతో పెద్దవాళ్ల వరకు ఎందుకనుకుంది.

మరో రెండ్రోజులకి... మధ్యాహ్నంవేళ డ్రైవర్ వచ్చి చైతన్యకి కేరియర్‌లో భోజనం తీసుకెళ్లాడు. సాధారణంగా లంచ్‌కి ఇంటికి రాడు అతను. ఎక్కువగా ఆఫీసు లోనే వుంటుందతని మీల్స్.

ఆషా, నిషాలిద్దరూ స్కూలుకు వెళ్లిపో యారు. ఆయాలిద్దరూ పనులన్నీ కావ టంతో ఇప్పుడే... ఇంటివరకు వెళ్ళొస్తాం అంటూ అడిగివెళ్లారు.

శేఖర్ వచ్చిందగ్గిర్నుంచీ ఎవరూ ఇంట్లో లేకుండా... ఒంటరిగా వుండటం లేదు స్రవంతి. అతనూ భోజనం చేసి బుక్స్ ఏవో తీసుకుని బయటికి వెళ్లిపోయాడు అంతక్రితమే. దాంతో ధైర్యంగా ఆయాల్ని పంపించింది.

తన గదిలో వెళ్లి... ఏదో మేగజైన్ చేతి లోకి తీస్కుని మేను వాల్చింది.

ఫర్లాంగు దూరంలో వున్న కాంపౌండ్ గేటు దగ్గర కూర్చున్నాడు వాచ్‌మెన్. లోపల ఏం జరిగినా వాడికి తెలియదు. ఈ సమయం కోసమే పొంచిచూస్తున్న శేఖర్ మళ్లీ లోపలికి ఎంటరయ్యాడు.

మరో పది నిమిషాలకి లంచ్ తిన కుండా... ఏదో రిజిస్ట్రేషన్ వ్యవహారం కోసం... డాక్యుమెంట్స్ తీసుకుని ఫ్రెషప్ అయి వెళ్లాలని... ఇంటికి వచ్చాడు చైతన్య.

గబగబా మేడమెట్లెక్కుతుంటే విన్పిం చాయి అతనికి "ఆయమ్మో... ఆయమ్మో" అంటూ కేకలు. అతని భృకుటి ముడిప డింది. అనుమానంగా వెనక్కి మెట్లు దిగాడు.

అరుపులు వినిపించిన వైపు చూపు సారించాడు చైతన్య. ఈలోపు "ఆయమ్మో!" అంటూ బెడ్‌రూంలోంచి బయటికి పరిగె త్తుకుంటూ వచ్చింది స్రవంతి.

అప్పటికే.. చీర సగంగా జారిపోయి... అస్తవ్యస్తంగా వుంది ఆమె పరిస్థితి.

ఆమె వెనకే... వెంటపడుతూ వస్తు

న్నాడు శేఖర్.

స్రవంతి వస్తూనే... ఎదురుగా నిలబడ్డ చైతన్యని ఢీకొని అతని మొఖంలోకి చూసి... భయంగా వెనక్కి తిరిగి చూస్తూ... అతన్ని కరుచుకుపోయింది.

చిగురుటాకులా కంపిస్తోంది ఆమె శరీరం. భయంతో ఆమె ఒళ్లు ఎగిరెగిరి పడుతోంది.

భయం లేదన్నట్లుగా ఆమె వెన్నుమీద చేయివేసి నిమిరాడు చైతన్య.

స్రవంతి మీదే చూపంతా ఉన్న శేఖర్ చైతన్యను గమనించలేదు. చూసేటప్పటికి అతనూ... స్రవంతి వెనుకగా.. చైతన్యకు ఎదురుగా వున్నాడు. క్షణాల్లో పరిస్థితి అర్థ మైపోయింది చైతన్యకు.

అతని కళ్లల్లో కోపం.. మొహంలో గాంభీర్యం చూసేటప్పటికి శేఖర్ గుండె జారిపోయింది. కాళ్లకింద భూమి కంపించి నట్లైంది.

అతని చేతికి దొరికితే... తన శరీరం, తన బతుకు ఏమవుతుందో తెలుసు శేఖ ర్‌కి. ఒక్క ఊపులో పరుగందుకుని బయ టికి వెళ్లిపోయాడు.

"రాస్కెల్..." గొణుక్కున్నాడు చైతన్య.

చేతులు రెండు తన మెడ చుట్టూ వేసి పూలహారంలా... తనను హత్తుకుపోయిన స్రవంతిని విడదీయాలని చూశాడు. గట్టిగా పట్టుకుని వుంది ఆమె. ఒళ్లంతా చల్లగా తగిలిందతనికి.

"వాడు వెళ్లిపోయాడు" అంటూ పట్టు విడిపించాడు.

చూస్తే... స్పృహలో లేదామె. మల్లెచెం డులా కిందికి జారిపోసాగింది.

"మైగాడ్" ఆమెనలాగే రెండు చేతుల మీదుగా ఎత్తుకుని గదిలోకి తీస్కెళ్లి బెడ్‌పై పడుకోబెట్టాడు.

ఫ్యాన్ ఆన్ చేద్దామని, తిరుగుతుంటే... లాగినట్లనిపించింది.

చూస్తే.. భయంతో బిగుసుకుపోయిన స్రవంతి చేతిలో నలుగుతోంది అతని షర్ట్ అంచు. అన్‌కాన్షియస్‌నెస్‌లో కూడా ఆమె మనసు రక్షణ కోరుతోంది. చేసేదేమీలేక అక్కడే పక్కనే కూర్చుని పేపర్‌వుంటే తీసుకుని నెమ్మదిగా విసరసాగాడు.

చిరుచెమటలు కమ్ముకున్న ఆమె మోము నెమ్మదిగా సేదతీరసాగింది. చెది రిపోయిన చీరను సరిచేశాడు. ప్రతిసారీ ఛాయామాత్రంగా... ఓ నీడలా మాత్రమే అతని దృష్టి పథంలోకి వచ్చింది ఆమె. మొట్టమొదటిసారిగా... ఏడాదిన్నరకు అప్పుడు చూశాడు ఆమెని.

"స్రవంతి" అతని పెదవులు ఉచ్చరిం చాయి. ఎప్పుడో విన్న పేరు. ఎక్కడో అతని స్మృతిపొరల్లో ఓ కదలిక. అవును, విశాలంగా కనురెప్పలు, వణుకుతున్న పెదాలు... అదురుతున్న చెంపలు... ఎక్కడో... ఎప్పుడో ఆమెని చూసిన మధు రవీచిక మెల్లగా అతని మనసుని తాకి వెళ్లి పోయింది.

ఆమె చేతిలో పెనవేసుకున్న తన చేతిని చూశాడు చైతన్య.

"ఏమయింది తనకి?" చాన్నాళ్లకి శరీరా నికి తగిలిన స్త్రీ స్పర్శ పరిమళం.. మన సుని ఎటో లాగేస్తుంది. విసుగ్గా తల విది లించాడు.

ఆయాల మాటలు విన్పించటంతో మెల్లగా ఆమెనుంచి తన చేతిని విడిపించు కుని బయటికి వచ్చాడు. "ఎక్కడికి వెళ్లారు? ఆ అమ్మాయిని ఒక్కదాన్ని వది లేసి..?" సింహగర్జనలా వినిపిస్తున్న అతని పలుకులకు గజగజ వణికారు వాళ్లు.

"లోపలికి వెళ్లండి.. రూమ్‌లో వుంది. ఆ శేఖర్ వస్తే లోపలికి రానివ్వద్దు. వెంటనే నాకు ఫోన్ చేయండి" చెప్పి తన గదిలోకి వెళ్లిపోయాడు.

"ఏం జరిగిందో..." అనుకుంటూ లోపలికి పరిగెత్తారు వాళ్లు.

మెల్లిగా కళ్లు విప్పి చూస్తుంటే... తన మొహంలోకే ఆత్రుతగా చూస్తున్న ఆయాలు కనిపించారు స్రవంతికి.

'వాటర్' సైగ చేస్తూ అడిగింది.

ఇద్దరూ కిచెన్‌లోకి పరిగెత్తారు.

"ఏమయిందంటావ్? " వాళ్లల్లో ఒకావిడ అడిగింది.

"ఏముందీ.. వాడేదో వెధవపని చేయబోయినట్లున్నాడు. అసలు వాడు వచ్చిన దగ్గర్నుంచీ.. పాపం ఆవిణ్ణి ఏదో ఓ రకంగా హింసిస్తూనే వున్నాడు. మొన్నటికి మొన్న తట్టుకోలేక దూరంగా విదిలించికొట్టింది. నేను చూశాను. ఆ కోపం మనసులో పెట్టుకున్నాడనుకుంటా... ఏంటో పాపం..." బాధపడుతూ అంది.

"నిజమే... ఆ బిడ్డ పరిస్థితి చూస్తే గుండె తరుక్కుపోతుంది ఎవరికైనా. బాబుగారు చూస్తే ఓ ఉలుకూ, పలుకూ వుండదయ్యె. ఆ చిన్న పిల్లల్ని చూస్కుంటూ గడుపుతోంది. ఈ ఇంట్లో ఆమెని పలకరించే దిక్కు కూడా లేదు. మనందరం పనివాళ్లమైపోతిమి. వాడికి ఆమె పరిస్థితి అలుసైపోయింది" వాపోయింది మరో ఆయమ్మ.

"అప్పుడూ అంతేగా... ఆ వసుంధరమ్మ, రజని ఎన్ని రకాలుగా పీక్కుతిన్నారని? అన్నింటికీ పెదవి కదపకుండా సహనం చూపించింది బిడ్డ" అంది మొదటావిడ.

"బాబుగారు కనీసం భార్యలా చూడకపోతే మానే.. ఓ మనిషిలా అయినా చూడొచ్చుకదా...! ఇట్లాంటి ఆగడాలైనా తగ్గుతాయి కదా...!"

"డబ్బున్నోళ్లంతే... మనకెందుకు? పెద్దోళ్ల ఇళ్లల్లో ఇట్లాంటియ్యన్నీ మాట్లాడకూడదు. పద...." అంటూ ఇద్దరూ ఇటు తిరిగారు.

అక్కడ నిలబడి వున్నాడు చైతన్య. వాళ్ళిద్దరికీ పై ప్రాణాలు పైనే పోయాయి.

"కాసిని వేడిపాలు తీస్కెళ్లండి" చెప్పి కదిలాడు. అది చెప్పటానికే వచ్చిన అతను తనకి తెలియని ఎన్నో విషయాలు విన్నాడు.

మేడమెట్లెక్కుతుంటే... "కనీసం భార్యలా చూడకపోతే మానే... ఓ మనిషిలా అయినా చూడొచ్చుకదా!" పనిమనిషి మాటలు చెవుల్లో మార్మోగ సాగాయి అతనికి. అతను ఆలోచనలో పడ్డాడు.

ఇన్నాళ్లుగా వసంత వుండగానే... మరో స్త్రీని తన జీవితంలోకి ఆహ్వానించాననే పశ్చాత్తాపం నిలువెల్లా దహించివేస్తుంటే... మరో ఆలోచన రాలేదు అతనికి.

నిజమే... అక్కడో మనిషి తన గురించి, తన కుటుంబం గురించి అహర్నిశలు శ్రమిస్తోంది అన్న గ్రహింపే ఇంతవరకూ తనకి రాలేదు.

ఆ పూట అతను బయటికి వెళ్లలేదు.

పిల్లలిద్దరూ ఇంటికి రాగానే- తనే దగ్గరుండి వాళ్ల స్నానం, టిఫిను చూస్కున్నాడు. కాసేపు వాళ్ల మాటలు, ఆటలు... హోంవర్క్ అన్నీ అతని ప్రెజెన్స్‌లోనే జరిగాయి.

"మమ్మీని డిస్టర్బ్ చేయకండి" రెండు మూడుసార్లు వాళ్లతో చెప్పాడు చైతన్య.

ఆయాలు చేరవేసిన ఆ మాటలు స్రవంతి మనసుపై తొలకరి జల్లు కురిపించాయి. ఇదేమిటి...? తనకింత సంతోషం కలుగుతోంది...?

తనకే తెలీకుండా... తన మనసు ఇన్నాళ్లూ అతని సాహచర్యాన్ని కోరుతోందా?

ఇందాక అతన్ని హత్తుకుపోయినప్పటి అనుభూతి... ఇంకా స్రవంతిని వీడలేదు.

# శ్రీ వరాహలక్ష్మీ నృసింహస్వామి వారి దేవస్థానం



సింహాచలం, విశాఖపట్నం-530 028, ఆంధ్రప్రదేశ్

భక్తులకు, మహాదాతలకు శ్రీ సింహగిరి వాసుడు శ్రీ సింహాద్రినాథుడు మీకు, మీ కుటుంబ సభ్యులకు సకల సౌభాగ్యములు కలిగించుగాక! దానములన్నిటిలోను అన్నదానము గొప్పది. శ్రీ స్వామి వారిని దర్శించుటకు సుదూర ప్రాంతముల నుండి విచ్చేయు భక్తులకు ప్రతి నిత్యమూ మధ్యాహ్న సమయమున ఉచితముగా భోజన ప్రసాదము పెట్టుటకు శ్రీ సింహాద్రినాథ నిత్య అన్నదాన నిధి సమకూర్చుటకు శ్రీ సింహాచలం దేవస్థానం సంకల్పించియున్నది.

**కేటగిరి-I మహారాజ పోషకులు:** లక్ష రూపాయలు ఆపైన ఇచ్చు దాతలు సంవత్సరములో ఒకరోజు దాతలకు వారి కుటుంబ సభ్యులకు అన్నదానము జరిపించుకొను రోజున ఉచిత మధ్యాహ్న భోజన సౌకర్యం శ్రీ స్వామి వారి పూజ దర్శనం ఏర్పాటు చేయబడును. దాత కోరిన రోజునగాని, తిథినగాని దాత పేరున 600 మంది భక్తులకు అన్నదాన ప్రసాదం ఏర్పాటు చేయబడును.

**కేటగిరి-II రాజ పోషకులు :** యాభైవేల రూపాయలు ఆపైన విరాళములు ఇచ్చు దాతలందరూ ఒక సంవత్సరములో ఒక రోజు (అన్నదానం రోజున) దాతలకు ఉచిత భోజన సదుపాయం. పూజా దర్శనం ఏర్పాటు చేయబడును. దాత కోరిన రోజున గాని, తిథిన గాని దాత పేరున 300 మందికి అన్నదానం జరుపబడును.

**కేటగిరి-III పోషకులు :** పదివేల రూపాయలు ఆపైన విరాళములు ఇచ్చు దాతలందరూ ఒక సంవత్సరములో ఒకరోజు దాతలకు ఉచిత భోజనం. శ్రీ స్వామివారి దర్శనం ఏర్పాటు చేయబడును. దాత కోరిన రోజునగాని, తిథినగాని దాత పేరున 60 మందికి నిత్యాన్నదాన పథకంలో అన్నప్రసాదం ఏర్పాటు చేయబడును.

**దాతలు :** వెయ్యి నూటపదహార్లు (1,116) నుండి రెండువేల రూపాయలు ఆపైన విరాళములు ఇచ్చు సర్వదాతలకు వారు కోరిన రోజున 6 మంది నుండి 8 మందికి విరాళమునుబట్టి ఉచిత భోజన సౌకర్యము భక్తులకు ఏర్పాటు చేయబడును. పై విరాళములన్నియూ బ్యాంకులలో శాశ్వత డిపాజిట్లుగా ఉంచి వాటిపై వచ్చు వడ్డీతోనే శ్రీ సింహాద్రినాథ నిత్య అన్నదాన పథకం నిర్వహించబడును.శ్రీ సింహాద్రినాథ నిత్య అన్నదాన నిధికి స్వల్ప విరాళములు కూడా భక్తుల నుండి ప్రతిరోజూ దేవాలయ ప్రాంగణంలో స్వీకరించబడును.

దేశంలోగాని, విదేశముల నుండి గాని ఏ బ్యాంకు శాఖల ద్వారా డి.డి. గాని, చెక్కుగాని, ఎం.ఓ. ద్వారాగాని విరాళములు కార్యనిర్వహణాధికారి, సింహాద్రినాథ నిత్య అన్నదాన పథకము, సింహాచలం దేవస్థానం, సింహాచలం వార్కి చెందినట్లుగా వారి పేరున పంపవలెను.

**దాతలు చెల్లించిన అసలు ఖర్చు చేయబడదు**

మీ విరాళములు అందిన వెంటనే మీ యొక్క పూర్తి వివరములతో దరఖాస్తులు స్వీకరించి, శాశ్వత సభ్యత్వం గల నిత్యాన్నదాన పథకము యొక్క పట్టా మీకు పంపబడుతుంది.

**శ్రీ సింహాద్రినాథ నిత్యాన్నదాన పథకంలో భక్తులు యథాశక్తి పాల్గొని నిరంతరం స్వామిని సేవిస్తూ తరింతురుగాక!**

డా|| పి. ఆనందగజపతిరాజు
అనువంశిక ధర్మకర్త

వి. శంకరరెడ్డి కార్యనిర్వహణాధికారి
సింహాచలం దేవస్థానం, సింహాచలం

## ప్రమాదో..

ఒక్కొక్కప్పుడు ప్రయోగించిన పదానికి అనూహ్యంగా మరోఅర్థం స్ఫురిస్తే.. నవ్వులు పువ్వులై వెల్లివిరుస్తాయనడానికి సాక్ష్యంలాంటిదీ ఉదంతం.

ఒక ఊళ్లో బార్‌రూమ్ తనిఖీచేసిన తర్వాత బార్ అసోసియేషన్ అధ్యక్షునితో జడ్జీ ఇలా అన్నారు.

'ది బార్‌రూమ్ ఈజ్ ఫుల్ ఆఫ్ క్రేక్స్, ఐయామ్ సెండింగ్ ఏ రిపోర్ట్ టు ది హైకోర్ట్ ఫర్ శాంక్షనింగ్ రిపేర్స్'.

ఆ మాటతో అక్కడివారంతా గొల్లున నవ్వేశారు.



మనసులో పొగడపూలు దోసిటి నిండా పట్టిన పరిమళం. అతని కౌగిలిలో... ఆ టెన్షన్‌లో కూడా తనకి ఎంత హాయి... నిశ్చింత... నీకు నేనున్నాను అన్పిస్తూ తన వెన్ను నిమిరిన అతని చేతుల్లో ఎంత రక్షణ...

తనకే తెలియని ఎన్నో కొత్త కోణాలు... వింతలు... పులకింతలు బయల్దేరాయి స్రవంతిలో.

ఇరవైరోజులుగా ఉన్న శేఖర్‌ని ముళ్ళ మీద నిలబడ్డట్లుగా భరించింది స్రవంతి. ఓ పక్క అతను ఎప్పుడు వెళ్ళిపోతాడా అని ఎదురు చూస్తూ... కానీ, ఏణ్ణర్థంగా చైతన్య ఇంట్లో ఉన్నా... కన్నెత్తైనా తనని చూడని అతని నైజం... దీటైన అతని వ్యక్తిత్వం... అతని సంస్కారం గుర్తు రావటంతో అతనంటే కలిగిన నిశ్చింత... గౌరవం... ప్రేమగా మారి అతనితో బంధం కోరుకుంటోంది మనసు అన్పించింది స్రవంతికి.

మర్నాడు ఉదయాన్నే బ్రేక్‌ఫాస్ట్ రెడీ చేస్తున్న స్రవంతి దగ్గరికి కిచెన్‌లోకి వచ్చాడు చైతన్య.

"వంట మనిషి లేకపోతే... ఆఫీసుకు ఫోన్ చేస్తే... మరొకరెవర్నైనా చూసి పంపిస్తారు" నువ్వు కష్టపడవలసిన పని లేదు అన్నట్లుగా గబగబా ఆ నాలుగు మాటలు తుంచినట్లుగా చెప్పి వడివడిగా వెళ్ళిపోయాడు.

ఒక్క క్షణం చుట్టూ చూసింది స్రవంతి. ఎవరూ లేరు. అంటే అతను తనతోనే చెప్పాడా? ఆ మాత్రానికే సంతోషం కలిగింది ఆమెకి.

ఆ సాయంత్రమే మరొకావిడ వంటకని వచ్చేసింది.

చైత్ర మాసం... ఇంటి చుట్టూ లతలా అల్లుకుని... రంగు రంగుల పూలు పూస్తున్నట్లుగా ఉంది స్రవంతికి. అప్పుడప్పుడు చైతన్య ఆమెతో మాట్లాడుతున్నాడు. తనే దగ్గరుండి భోజనం వడ్డించే చనువు వచ్చేసింది స్రవంతికి.

ఆదివారాలు తరుణ్ ఇంటికి వస్తున్నాడు. చైతన్య పిల్లల మధ్య కూర్చుని... నవ్వుతూ వాళ్ళతో కబుర్లు చెపుతుంటే... ఇప్పుడు స్రవంతి కూడా వాళ్ళ అల్లరిలో పాలు పంచుకుంటుంది.

ఆనందంతో... ఇల్లంతా సందడిగా కళకళ్ళాడుతూ కొత్తగా అన్పించింది. ఎప్పుడూ ఇంటికి రాగానే ముభావంగా ఉండే చైతన్య నార్మల్‌గా అయిపోయాడు.

ఆషా, నిషాల చదువుల గురించి...

వాళ్ల ప్రైజుల గురించి వాళ్ళు సంతోషంగా చెప్తుంటే వింటున్నాడు.

ఎక్స్‌ట్రా కరిక్యులర్ ఏక్టివిటీస్‌లో ప్రైజెస్ ఇచ్చేవాళ్లు వాళ్ళ స్కూల్‌లో. స్రవంతి మంచి పాటలు నేర్పి పంపేది ఇద్దరికీ. "డాడీ...! ప్రైజ్ వచ్చింది" సంతోషంగా చెప్పేవాళ్లు తండ్రికి.

"ఐస్‌క్రీమ్ పార్లర్..." మేము ప్రైజు తెచ్చాం కాబట్టి నువ్వు ట్రీట్ ఇవ్వాలి అన్నట్లు డిమాండ్ చేసేవాళ్ళు తండ్రి మీద.

"ముందు సాంగ్స్ నేర్పించింది కాబట్టి మీ మమ్మీకి వెళ్ళి థాంక్స్ చెప్పండి" అనేవాడు.

"థాంక్యూ మమ్మీ..." పిల్లలిద్దరూ ఎంతో ఇష్టంగా స్రవంతి బుగ్గలపై ముద్దు పెట్టేవారు.

సిగ్గుగా... అతని ముందు ఎర్రబడిన ముఖంతో... ఆమె చెంపలు తుడుచుకుంటుంటే... అతను అదో రకమైన తన్మయత్వానికి గురయ్యేవాడు.

"ఏమవుతోంది తనకు? " ఈ ప్రశ్న తనని తాను ఎన్నోసార్లు వేసుకున్నాడు చైతన్య. ఎక్కడో గుండె పొరల్లో నిక్షిప్తమై అట్టడుగున ఉన్న జ్ఞాపకాల మధుర భావనలు గుండె గదుల్ని చీల్చుకుంటూ బయటికి వచ్చేవి.

"ఎన్నో సంవత్సరాలుగా... జన్మజన్మల బంధంగా... ఆమెతో ఎన్నాళ్ళ సహవాసమో ఉన్నట్లు తనకెందుకనిపిస్తోంది? " అర్థమయ్యేది కాదు చైతన్యకి.

చాలా రోజుల తరువాత ఆ ఇంటికి వచ్చిన సావిత్రమ్మ... కళకళలాడుతున్న ఇంటిని... ఆ మనుషులను చూసి సంతోషపడింది. ఇన్నాళ్ళకు వసంతమ్మ కోరుకున్నట్లుగా ఉంది ఆమె ఇల్లు అనుకుంది.

"కాలు జారిపడి... ఇన్నాళ్లు పట్టిందమ్మా కోలుకోవటానికి..." స్రవంతికి సంజాయిషీ ఇచ్చుకుంది ఆమె.

ఇయర్ ఎండింగ్ కావటంతో చైతన్య ఎకౌంట్స్ చూస్కుంటూ నాలుగు రోజులుగా ఆఫీసులోనే బిజీగా ఉంటున్నాడు. ఇంటికి వచ్చినా... అతనితోపాటు కట్టలు, కట్టలుగా ఫైల్స్ లోపలికి తెస్తున్నాడు డ్రైవర్.

ఎంతమంది ఆడిటర్స్ ఉన్నా... చివరలో తనే స్వయంగా ఎకౌంట్స్ ట్యాలీ చేసుకోవటం చైతన్య అలవాటు.

ఆ రోజు... అర్ధరాత్రి వరకు ఫైల్స్ చెక్ చేసుకున్న అతను తలనొప్పిగా అన్పించటంతో కాఫీ కోసం కింద కిచెన్‌లోకి వచ్చాడు. అంతా నిద్ర పోతున్నారు.

అక్కడ... స్రవంతి బెడ్‌రూంలో లైట్ వెలుగుతూ కనిపించింది అతనికి. ఈ టైమ్‌లో ఎవరు లేచారు? పిల్లలిద్దరూ ఆమె దగ్గర పడుకుంటారని తెలుసు కాబట్టి... అటు నడిచాడు.

ఆషా, నిషా బెడ్‌పై పడుకుని నిద్ర పోతున్నారు ప్రశాంతంగా.

మరోపక్క... గదిలో ఓ మూలన ఉన్న కంప్యూటర్ టేబుల్ దగ్గర వర్క్ చేస్కుంటోంది స్రవంతి అటు తిరిగి. చెవులకి ఇయర్ ఫోన్స్... చేతులు కీ బోర్డు మీద టకటకలాడిస్తూ... మధ్యలో పెన్‌తో నోట్ చేస్కుంటూ ఉంది.

అలాగే నిలబడ్డ కొద్దిసేపటికి అర్థమైంది అతనికి, 'మెడికల్ ట్రాన్స్‌క్రిప్షన్' అని. ఇతర దేశాల్నుంచి డాక్టర్స్ చెప్పే పేషెంట్స్ వివరాలు ఇంటర్నెట్ ద్వారా రికార్డు చెయ్యటం.

ఇంట్లో కూర్చుని చేయగల ఎర్నింగ్స్. స్వయం సంపాదన.

ఇప్పుడీ మనీతో ఆమెకేం పని? అతను ఆలోచనలో పడ్డాడు.

వర్క్ కంప్లీట్ చేసుకుని ఇటు తిరిగిన స్రవంతికి గుమ్మం పొడవునా నిలబడి,

ఏదో ఆలోచనల్లో ఉన్న చైతన్యను చూడగానే గుండె ఝల్లుమంది. ఇంత రాత్రివేళ ఇక్కడికెందుకొచ్చినట్లు?

"మీరు..." సందిగ్ధంగా ఆగిపోయింది.

"ఆc... ఆc కొంచం కాఫీ కావాలి. లైట్ వేసుంటే..."

"తెస్తాను"

అతను బయటికి నడిచాడు.

కాఫీ తీస్కెళ్లి అతనికిచ్చి వస్తుంటే "థాంక్స్" అన్నాడు.

ఇంట్లో కూర్చుని వర్క్ ఎందుకు చేస్తున్నట్లు...? అడగాలనిపించింది అతనికి. కానీ ఇవి ఆమె పర్సనల్ విషయాలు. అడగటం ఎంతవరకు సమంజసం...? ఇంత ఆస్తి... ఐశ్వర్యాలున్న ఇంట్లో ఉంటూ కూడా... ఇక్కడ ఆశించకుండా...

స్వంత సంపాదనకై చూసుకుంటున్న ఆమె వ్యక్తిత్వానికి ముచ్చటేసింది అతనికి.

ఇంతకీ... ఆమెకి ఏదో అవసరం ఉండే ఉంటుంది... అనే ఐడియాకొచ్చాడు అతను.

మరోపక్క "నీ కష్టం... నాతో పంచుకోకూడదా...? " మనసులోనే అనుకున్నాడు.

శివరాం జీవితం సునందతో ముడిపడిపోయింది. రేపు అనేది ఎలా ఉంటుందో ఎవరూ చెప్పలేరు.

లక్ష్మి భర్త కిచ్చిన మాటకోసం... లక్ష్మి కోసం... తరుణ్ భవిష్యత్తుకోసం తన శ్రమను ధారపోస్తోంది స్రవంతి. వాణ్ణి తెచ్చి తన దగ్గర ఉంచుకోవటం కుదరలేదు. కనీసం రేపు వాడి భవిష్యత్తుకైనా అవసరమయ్యే స్టడీస్ కైనా... తను కొంత భద్రపరిస్తే బావుంటుందనే ఆలోచనే... ఈ ఎర్నింగ్స్.

చైతన్య చిన్న చిన్న విషయాలు స్రవంతికి చెప్పటం గమనించింది ఊర్నించి వచ్చిన నందిని.

'భోజనానికి లేటవుతుంది...',



‘పిల్లలు పడుకున్నారా?’ ‘భోంచేశారా?’ అంటూ ఆఫీసునుండే ఫోన్ చేస్తాడు. ఇంతకు ముందు పనివాళ్ళు చెప్పే సమాధానాలు ఇప్పుడు స్రవంతి చెప్తోంది.

ఇంట్లో అందరి మధ్యా కూర్చున్నప్పుడు తమ్ముడి పెదవులపై వెలిగే దర



హాసం..

‘వాడి మొహంలో నవ్వు చూసి ఎన్నాళ్ళయ్యింది? ఎప్పటికీ ఇలాగే వాడి నవ్వును మాత్రం ఉండనీయ్ స్వామీ’ మనసులోనే భగవంతుణ్ణి వేడుకొనేది నందిని.

పిల్లల్ని బయటికి రెస్టారెంట్స్‌కి, బీచ్‌లకి తీస్కెళ్లేటప్పుడు ‘మమ్మీని కూడా రమ్మనండి’ అని చెప్తున్నాడు చైతన్య. ‘హేయ్!’ అని స్రవంతి వస్తుందంటే ఎగిరి గంతులేసేవాళ్లు.

అప్పుడప్పుడూ చెల్లెల్ని చూసి వెళ్ళే శివరాంతో మాట్లాడుతున్నాడు చైతన్య. అతను ఇంట్లో ఉన్న పది నిమిషాలు శివరాంతో సాదరంగా మాట్లాడి వెళ్లేవాడు.

చెల్లెలి జీవితం ఓ గాడిన పడుతోంది అని తృప్తిగా ఉన్నాడు శివరాం.

ఆ సంవత్సరం ఫ్యాక్టరీలో పనిచేసే వర్కర్స్ చాలామంది ఇంటికొచ్చారు. వాళ్ల కుటుంబాల్లో ఒకేసారి నలుగురి పెళ్లిళ్లు కుదిరాయి.

యజమానిని, ఆయన భార్యను ఆహ్వానించడానికి వచ్చారు వాళ్లు. ఈ మధ్య కాలంలో చైతన్య ఎవరి ఫంక్షన్స్‌కూ వెళ్లింది లేదు. ఇంతకు ముందైనా... పని వాళ్లనే భేదం లేకుండా అతను హాజరయ్యేవాడు.

ఈ సంవత్సరం ఒకే మండపంలో నాలుగు పెళ్లిళ్లు ఒకేసారి పెట్టుకున్నారు కాబట్టి ఎలాగైనా చైతన్యను, స్రవంతిని ఆహ్వానించి తీస్కెళ్లాలని పట్టుదలగా వచ్చారు వాళ్లు.

"సరే, తప్పకుండా వస్తాం" శుభలేఖలు అందుకుంటూ చెప్పాడు చైతన్య.

"అమ్మగారు..." నసిగారు వాళ్లు.

"తను కూడా వస్తుంది" హామీ ఇచ్చేశాడు చైతన్య.

పెళ్ళిలో అతని పక్కన కుర్చీలో కూర్చొని మొదటిసారి చైతన్య భార్య హోదాను పొందింది స్రవంతి. ఆమె మనసు పొందే ఆనందం ఆమెకి స్పష్టంగా తెలిసిపోతోంది. శరీరం తేలికై గాల్లో తేలుతున్న అనుభూతి. ఊహల రెక్కలు కట్టుకుని విహంగంలా మారి... అమృత భాండాన్ని వెతుక్కుంటూ వెళుతున్న సంతోషం ఆమెలో.

"ఈ అనుభూతులన్నీ తనకేనా...? ఇతనికేమీ లేవా?" పక్కనే కుర్చీలో గంభీరంగా... మౌనంగా కూర్చున్న చైతన్య వంక చూస్తూ అనుకుంది స్రవంతి.

ఆ సంవత్సరం వర్కర్స్ కోసమని కొత్తగా కట్టిస్తున్న ఇళ్ల నిర్మాణానికి స్రవంతి చేతులు మీదుగానే పూజ, శంకుస్థాపన జరిగాయి.

'మళ్లీ నీళ్లు పడ్డాయి... గంగా పూజ' అంటూ మరోసారి ఆమెని తీస్కెళ్లాడు చైతన్య.

అతని పక్కనే కూర్చుని... పట్టుచీర కట్టుకుని... బ్రాహ్మడు చెప్పినట్లుగా పూజచేస్తుంటే... ఆమెకెంతగానో తృప్తిగా అనిపించింది.

నెమ్మదిగా సాగిపోతున్న వాళ్ల జీవితాల్లో అనుకోని అవాంతరం మరో రూపంలో ఉపద్రవంలా వచ్చి పడింది.




ఓ రోజు రాత్రి పదకొండున్నర కావస్తోంది. చైతన్య ఇంకా భోజనానికి రాలేదు. ఇంట్లో అందరూ నిద్రపోతున్నారు... "బిజినెస్ డీల్ ఉంది... దానితో పాటు చిన్న పార్టీ. లేట్ కావొచ్చు" అని ఫోన్ చేసి ముందే చెప్పాడు.

అయినా అతని కోసం ఎదురు చూడటంలో ఓ తియ్యని అనుభూతిని పొందుతుంది స్రవంతి మనస్సు. ఇన్నాళ్ళుగా... ఏ ప్రేమ భావనలూ లేని హృదయంలో తొలిసారి అతని గురించిన తలపులు ఇచ్చే సరికొత్త ఉత్సాహం... ఆమె మనసు కావాలనుకుంటోంది.

అలాగే హాల్లో కూర్చొని సోఫాలో తల వెనక్కి వాల్చుకుని పడుకుండి పోయింది స్రవంతి.

మరో అరగంటకి ఇంటికి చేరాడు చైతన్య.

వస్తూనే... హాల్లో నిద్రపోతున్న స్రవంతిపై పడింది అతని చూపు. గాలికి రెపరెపలాడుతోంది ఆమె ఒంటిపైనున్న చీర... ముంగురులు నుదుటిపై పడి నాట్యమాడుతున్నాయి. ఏ స్వప్న లోకాల్లోనో విహరిస్తున్నట్లు కళ్ళు మూసుకుని... నయనానందకరంగా... ప్రశాంతంగా ఉంది ఆమె మోము. ఇంపైన మేని సొగసుతో మెరుస్తోంది ఆమె.

ఆనాడు... రెండు చేతుల మీదుగా ఆమె నెత్తుకుని... గదిలో పడుకోబెట్టిన వైనం... తన మనసు చెదిరిన విషయం గుర్తొచ్చింది అతనికి.

అలికిడికి మెలకువ వచ్చింది ఆమెకి.

"భోంచేస్తారా...?" అడిగింది.

"వద్దు... ఒక గ్లాసు బటర్ మిల్క్..." చెప్పి మనిషి తూలుతూ...ఏదో మత్తులో వున్న వాడిలా మెట్లెక్కుతున్నాడు.

ఇలా వున్నారేం! అనుకుంటూ మజ్జిగ తీస్కెళ్లింది ఆమె.

చేతికి గ్లాసందించిన ఆమె చేతిని కూడా లాక్కున్నాడు.

ఆమె ఇష్టాఇష్టాలతో ప్రమేయం లేకుండా...ఏదో అధికారం అతనిలో "అయ్యో! అతను కోరుకుంటే తన ప్రాణాన్నయినా పువ్వుల్లో పెట్టి ఇవ్వడానికి తను సిద్ధంగా ఉందే...!" ఆమె మనసు మూగగా కన్నీరు కార్చింది.

ఏదో మత్తులో వున్నవాడిలా కర్కశంగా వున్నాయి అతని చేష్టలు. నువ్వు నాకు లోబడి తీరాల్సిందే అన్నట్లు పొగరుగా ఉంది అతని వాలకం. అతని చర్యలేవీ ప్రేమతో కూడి లేవు, కేవలం కాంక్షతో తప్ప.

ఇన్నాళ్లుగా దాచిపెట్టిన ఆమె స్త్రీత్వపు పరిమళాలు... అతని దౌర్జన్యం కింద పడి నలిగిపోయాయి.

ఆమె హృదయంలో ఎంతో ఉన్నతంగా ఊహించి నిలబెట్టిన అతని స్థానం జారి కిందకు పోసాగింది.

వారమైనా... శరీరానికైన బాధకన్నా... మనసుకు తగిలిన గాయం తేరుకోనివ్వ లేదు స్రవంతిని. అతని ఇంట్లో ఉంటూ... వాళ్ల తిండి తింటోంది కాబట్టి తను ఒక పనిమనిషిలా... మనసు లేని బొమ్మలా...అతని దౌర్జన్యానికి తలొగ్గాలా?

ఆరోజు తనమీద అతని కాంక్ష, అధికారం అలాగే తోచాయి ఆమెకి.

కనీసం జరిగినదానికి దగ్గరికి వచ్చి పశ్చాత్తాప పడినా ఆమె మనసు సాంత్వన పడేది.

ఇంతకు ముందులాగా చైతన్య స్రవంతితో మాట్లాడటం లేదు. జరిగినదానికి సిగ్గుతో తనకే దిక్కుతోచని స్థితిలో వున్నాడు అతను. స్రవంతికి మాత్రం రోజురోజుకీ జీవితం మీద విరక్తి పెరిగిపోసాగింది.

ఎవరికోసం బతకాలి? తనకెవరున్నారని...? ఇంత కిటకిటలాడే ప్రపంచంలో... చీమలబారుల్లా మనుషులు సంచరించే ఈ లోకంలో తను మాత్రమే ఒంటరిది అన్పించసాగింది ఆమెకి.

ఈ లోకంలో వున్న మగవాళ్లంతా ఇంతేనా? మొదట రాజేష్... జీవితం మీదే విరక్తి పుట్టేలా గడిచింది అతనితో వున్నన్నాళ్లు. నిన్న మొన్నటి శేఖర్... మగవాళ్ల మీదే అసహ్యం పుట్టేలా చేశాడు.

ఎంతో ఉన్నతుడు అనుకుని చైతన్యకు గుండెలో గుడి కట్టి ప్రేమతో బంధించుకుంది. ఇన్నాళ్లుగా... అతనితో జీవితం ఓ ప్రేమ బంధంగా మారబోతుందని సంతోషపడేలోపు... విషాదం చిలకరించింది.

చిన్నగా ఓ నిశ్చయానికి రాసాగింది ఆమె మనస్సు. తనకొక గమ్యం, లక్ష్యం నిర్దేశించుకోసాగింది.

ఆ రోజు ఉదయం ఆషా, నిషాలకి

బోల్డన్ని అప్పగింతలు పెట్టింది స్రవంతి.

"జాగ్రత్తగా వుండండి. బాగా చదువుకోండి... నేను లేనని ఏడవద్దు..." ఇలాంటివన్నీ.

"నువ్వెక్కడికి వెళుతున్నావ్ మమ్మీ...?" ఇద్దరూ అడిగారు.

"ఒకవేళ శివరాం మామయ్య వాళ్ళింటికి వెళితే... నేను కనిపించక ఏడుస్తారని చెప్తున్నాలే..." సరిచేసుకుంది తన మాటలను.

ఆ మధ్యాహ్నం వేళ వైజాగ్‌నుండి చెన్నై వెళ్ళే ఎక్స్‌ప్రెస్‌లో కూర్చుంది స్రవంతి ఒంటరిగా. మనసంతా విషాదంగా, ఏదో కోల్పోతున్నట్లుగా వుంది ఆమెకి.

తన ఆశ... అన్నయ్య పెళ్ళి చేసుకుని సంతోషంగా వుండాలని. ఆ కోరిక నెరవేరింది. అప్పట్లో ఏ ఆశలు, కోరికలు లేకుండానే చైతన్య ఇంట్లో అడుగుపెట్టింది.

మరి ఇప్పుడెందుకీ ఆరాటం, బాధ? తనని తనే ప్రశ్నించుకుంటోంది. అయినా ఎక్కడో గుండె లోతుల్లో ఏదో మూల సన్నగా బాధ. నిజమే. ఏ కోరికలూ లేకుండా అలాగే అతని మధురోహలతోనే కాలం గడుపుతుంది. కానీ... తన మనశ్శరీరాలపై అతను చూపించిన అధికారం... దౌర్జన్యం... ఇలా ఈ రోజు జాబ్ చూస్కుని చెన్నై వెళ్ళిపోవటం తప్పేం కాదు అంటూ అంతరాత్మ జోకొడుతుంది.

ఇక ఈ బంధాలు, సంబంధాలు ఇక్కడితో వదిలెయ్యాలి. పదేపదే తనను తాను తర్కించుకోకూడదు. వెళ్ళగానే... అక్కడ తనకో ఎకామిడేషన్ దొరికితే తరుణ్‌ని వెంటనే తెచ్చేసుకోవాలి. వాడిని ఇక ఎవరేం చెప్పినా తను వదలదు. గట్టిగా నిర్ణయించుకుంది ఆమె.

అన్నయ్యకు తెలిసినా అడ్డు చెప్పేస్తాడు. తన ప్రయాణం ఆగిపోతుందని ఎవరికీ తెలీకుండానే ట్రైన్ ఎక్కేసింది ఆమె.

చిన్నారి ఆషా, నిషాలు తను కనిపించక పోతే ఎంత కలవరపడతారు? ఈ రెండేళ్లల్లో వాళ్లతో ఏర్పడ్డ అనుబంధం... దానికో పేరు పెట్టటానిక్కూడా పదాలు దొరకని అపురూప బంధం.

సెకనుకొకసారి మమ్మీ అంటూ తనని చుట్టుకుపోయే వాళ్లని వదలి తనుండగలదా? తను లేకుండా వాళ్లెలా గడుపుతారో?

ఆమె కళ్ళల్లోంచి అశ్రువులు జారసాగాయి.

ఇంతలో హోరున "హేయ్! హేయ్!" పెద్దపెట్టున క్లాప్స్... అరుపులు వినిపించాయి స్రవంతికి.

ట్రైన్ బయల్దేరటానికి ఇంకా అరగంట టైముంది. ఇంకా ఎవరూ పెద్దగా లోపలికి రాలేదు.

అరుపులు వినిపించిన వైపు చూసింది స్రవంతి. ఆమె విండో పక్కనే వున్నాయి ప్లాట్ ఫామ్స్ మారటానికి ఉపయోగించే మెట్లు.

అక్కడ- ఆ స్టెయిర్‌కేస్‌ను ఆనుకుని నిలబడ్డారు పదిమంది వరకు ఆడపిల్లలు. ఒక్కొక్కళ్లుగా రైల్వేస్టేషన్‌కి చేరటంతో చేతులు పైకెత్తి తాటించుకుంటూ హాయ్ అంటూ విష్ చేసుకుంటున్నారు.

స్లీవ్‌లెస్ టాప్స్. టైట్ జీన్స్. శరీరానికి అతుక్కుపోయిన బట్టల్లో... ఆధునికతకు అద్దం పట్టేలా లేటెస్ట్‌గా, ఫ్యాన్సీగా వున్నారు వాళ్లు.

ఒక్కొక్కళ్లు రెండంగుళాల పైన వున్న హైహీల్స్ వేసుకుని, మాట్లాడుతూ నవ్వుతూ వుంటే... మెడ వెనుక పోనీటెయిల్స్ అటూ ఇటూ ఊగుతున్నాయి. నోట్లో వున్న బబుల్‌గమ్స్ నముల్తున్నా...

స్టైల్‌గానే వున్నారు వాళ్లు.

ఒక్కొక్కళ్లు డేర్ అండ్ డేషింగ్ డెవిల్స్‌లా... అంతా హై సొసైటీ పీపుల్ లాగా కనిపిస్తున్నారు. బోల్డంత సంపాదించి పెట్టిన పేరెంట్స్ వెనక వుండటంతో కష్టం అంటే ఏంటో తెలీదన్నట్లు.... ఎంజాయ్ ఎవ్రీ మూమెంట్ అనేదే వాళ్ల సూత్రమైనట్లు గలగల మాట్లాడుకుంటున్నారు వాళ్లు.

వెళ్లేవాళ్లందరూ... పెద్దకానీ, చిన్నకానీ వాళ్ల గ్రూప్‌వైపు ఓ సారి దృష్టి సారించి వెళుతున్నారు.

"వీళ్ళందరినీ ఎక్కడో చూసినట్లుంది" మననం చేసుకోసాగింది స్రవంతి.

చైతన్య ఆలోచనతో బ్లాంక్ అయిన మనసుకి ఐదు నిమిషాల తర్వాత కానీ, వాళ్ళెవరో గుర్తుకు రాలేదు.

వాళ్లు... వాళ్లు రజని ఫ్రెండ్స్.

వసంత పోయిన కొత్తల్లో... వచ్చినప్పుడు...రజని వీళ్లందరినీ ఇంటికి ఇన్వైట్ చేసేది.

"అందమైన దిష్టిచుక్కా" అంటూ ఆమె తనని కామెంట్ చేస్తుంటే వీళ్లంతా పడి పడి నవ్వేవాళ్లు.

సంస్కారం లేనివాళ్ల నవ్వులకు... తనకు మనసంతా చిరాగ్గా... అసహ్యంగా వుండేది వాళ్లను చూస్తే.

చైతన్య పెళ్ళయ్యాకే మూర్తిగారి ఫ్యామిలీ లాస్‌వెగాస్‌కి షిఫ్ట్ అయ్యారు కాబట్టి, వీళ్లంతా రజని చిన్నప్పటి లోకల్ ఫ్రెండ్స్ అని వాళ్ల మాటల ద్వారా తెలిసేది.

వాళ్ల మాటల్ని అనుకోకుండా ఆలకించసాగింది స్రవంతి.

"సుమా ఇంతకీ ఆరోజు ఏం జరిగిందో చెప్పు యార్...! టెన్షన్‌తో ఇక్కడ మేము వర్రీ అయిపోతున్నాం" ఒకమ్మాయి అడుగుతోంది.

"ఏముంది...! ఆ చైతన్యకు ఆ రోజు పార్టీలో సెడెటివ్స్ కలిపించిన జ్యూస్ ఇప్పించానా... అది ఆ డ్రైవర్ వెధవ కని పెట్టేసినట్లున్నాడు. తిన్నగా అతన్ని తనతో తీస్కెళ్లి సేఫ్‌గా ఇంటి దగ్గర దింపేశాడు" సుమా అనే అమ్మాయి చెప్పింది.

'హో...! ఇంతేనా' అన్నట్లు అందరూ నిట్టూర్చారు.

"అయితే అతని పరిస్థితేంటి...! అవి కలిపితే పిచ్చెక్కినట్లు బిహేవ్ చేస్తారని విన్నాను" ఇంకో అమ్మాయి అడిగింది.

"ఏముందీ... వుందిగా ఆ దిష్టిబొమ్మ" అందరూ పకపకా నవ్వారు.

"సైలెన్స్ ప్లీజ్... రజనితో ఓసారి మాట్లాడుదాం" మొబైల్ ప్రెస్ చేసింది సుమా అనే అమ్మాయి.

"గోవా వెళుతున్నాం యార్... నువ్వు వుంటే ఎంతో బాగుండేది" ఇట్నుంచి సుమ మాట్లాడుతోంది. అటుపక్కనుంచి ఆమె ఏం మాట్లాడిందో కానీ, ఫోన్ పెట్టేసింది సుమ.

"పాపం - షి వాజ్ సో డిప్రెస్డ్. అవర్ ప్లాన్... టోటల్లీ ఫెయిల్డ్. రెండేళ్ల నుంచి కష్టపడుతున్నా వాళ్ల బావ మాత్రం దాని చేతికి దొరకటం లేదు. ఈసారి అతన్ని డెఫినెట్‌గా ఫొటోగ్రాఫ్స్‌తో రోడ్డున పడేయొచ్చు అనుకుంది. బ్యాడ్‌లక్..." అని చెప్పింది సుమ ఫ్రెండ్స్‌కి.

ఇంతలో "హాయ్ గాల్స్..." పది మంది కుర్రాళ్లు ఎంటరయ్యారు.

"హాయ్ గైస్...మీ కోసమే వెయిటింగ్" అన్నారు ఆడపిల్లలు.

"ఓకే, లెటజ్ మూవ్. ట్రైన్ కదుల్తోంది" ఎక్కసాగారు అందరూ.

మేటర్ మొత్తం విన్న స్రవంతికి ఒక్కసారిగా ఒళ్లు జలదరించింది. "చైతన్య

కోసం ఈ రకంగా ప్లాన్ చేశారా? సొంత అత్తకూతురై వుండి కూడా... చైతన్య తనని చేసుకోలేదనే కోపం... ఈ రకంగా ద్వేషంగా మార్చుకుందా రజని?" విండోపక్కగా వున్న స్రవంతిని సుమ వాళ్ల గ్రూప్ గమనించలేదు.

నిజమే. ఎప్పుడూ డిగ్నిఫైడ్‌గా వుండే చైతన్య ఎందుకలా బిహేవ్ చేశాడని ఒక్కసారి కూడా ఆలోచించలేదు తను. తొందరపడి ఇల్లు కూడా వదిలిపెట్టి వచ్చేసింది.

వసంత... ఆమెని తల్చుకోగానే ఛెళ్ళున కొరడాతో కొట్టినట్లయ్యింది స్రవంతికి.

ఎన్ని రకాలుగా జాగ్రత్తలు చెప్పింది తనకు. ఇవన్నీ ముందుగానే ఊహించిందా? పిల్లలిద్దరినీ తన చేతిలో సేఫ్‌గా పెట్టాననే నిశ్చింతతో కళ్లు మూసింది ఆమె.

కానీ... తను... తనేం చేసింది? వాళ్లని గాలికొదిలేసి ఇలా వెళ్ళిపోతోంది. ఆలోచనల్లో పడి ట్రైన్ స్టార్టవ్వటం గమనించలేదు స్రవంతి.

అప్పుడొచ్చి నిలబడ్డాడు చైతన్య ఆమె ముందు.

"దిగు" ఒకే మాట చెప్పాడు.

అతని మొహం సీరియస్‌గా వుందో, మామూలుగా వుందో తెలియటం కష్టం. అతని చెంపల రెండువైపులా దవడ ఎముకలు బిగిసి వున్నాయి.

ఆమె మౌనంగా అతని వెనక నడిచింది.

లగేజ్ తీస్కుని అతను ముందు నడుస్తుంటే... అతన్ని అనుసరించింది.

కారు బేక్‌డోర్ తీయబోతుంటే... "ఫ్రంటే కూర్చో" సీరియస్‌గా చెప్పి, స్టీరింగ్ చేతిలోకి తీసుకున్నాడు. నిశ్శబ్దం రాజ్యమేలుతోంది ఇద్దరి మధ్య.

ఏం మాట్లాడటానికీ ఆమెకి ధైర్యం చాలలేదు.

నల్లని తార్రోడ్డుపై మెత్తగా పోతోంది కారు. ఇద్దరూ ఆలోచనలో పడిపోయారు.

★ ★ ★

స్రవంతి చెన్నై బయల్దేరటానికి ముందు రోజు-

తన ప్రయాణం తెలుసు కాబట్టి ఆరోజు తరుణ్‌ని ఇంటికి పిలిపించింది స్రవంతి. వాడొక పక్క ఆషా, నిషాలతో బయట ఆడుతుంటే తను లగేజ్ అంతా తీసి బ్యాగుల్లో సర్దసాగింది.

పిల్లలంతా ఒక్కసారిగా పరిగెత్తుకుంటూ మళ్ళీ రూమ్‌లోకి వచ్చారు. సూట్‌కేసులు పక్కనపెట్టి వున్నాయి. ఫొటో ఆల్బమ్స్ కొన్ని చిన్నప్పట్నించీ స్రవంతి తీయించుకున్న ఫొటోస్ వున్నాయి. వాటిల్లో మరోపక్క ఆమె రాసుకునే డైరీ వుంది.

"హేయ్... ఫొటోస్" అంటూ ఆల్బమ్స్ మీద పడ్డారు ముగ్గురు పిల్లలు.

"నేనూ... నేనూ..." అంటూ లాక్కోసాగారు.

"జాగ్రత్త" తనే ఓపెన్ చేసి వాళ్ల చేతుల్లో పెట్టింది స్రవంతి.

తన బాధలో తనున్న ఆమె ఆ తర్వాత వాళ్లను గమనించలేదు.

"ష్...! మమ్మీ ఈజ్ సీరియస్. డాడీ దగ్గరికి వెళ్దాం" ముగ్గురూ మేడపైకి దారి తీశారు.

మొత్తం మూడు వున్నాయి వాళ్ల చేతుల్లో. "రండి డాడీ... చూద్దాం" పేపర్ చదువుతున్న అతన్ని బలవంతంగా లాగి మధ్యలో కూర్చోబెట్టుకున్నారు.

ఓపెన్ చేసి ఒక్కొక్కటే చూడసాగారు.

ఎక్కువగా స్రవంతి ఫొటోలు... ఆమె పోజులే వున్నాయి వాటిలో. తల్లితో కొన్ని, అన్నతో కొన్ని, స్కూలుకు వెళుతూ రెండు

జడలు వేస్కొని స్కూల్ డ్రెస్‌లో కొన్ని.

పావురాల్ని భుజాలకెత్తుకుని, లేగదూడలతో... వాటి చుట్టు చేతులు పెనవేసి వంగి నవ్వుతూ... పూలు కోస్తూ... పచ్చని పంటచేల మధ్య పరిగెత్తుతూ రకరకాలుగా వున్నాయి చిన్నప్పటి స్రవంతి ఫోటోలు.

చైతన్య కూడా కాసేపటికి ఇంట్రెస్ట్‌గా చూడసాగాడు.

స్కూల్ డ్రెస్‌లలో ఫ్రెండ్స్‌తో... టీచర్స్ దగ్గర్నుంచి ప్రైజులందుకుంటూ చాలా వున్నాయి.

**అక్కడ వుంది స్రవంతి ఓణీ చెరుగు చేతుల్తో ఎత్తిపట్టుకుని... ఆకాశంవైపు తలెత్తి చూస్తూ... నవ్వుతూ పొగడపూల చెట్టు కింద నిలబడి... తెల్లని పూలను ఏరి పట్టుకుంటూ... ముగ్ధమనోహరంగా, స్వచ్ఛమైన పారిజాత పుష్పంలా... ఆ పువ్వుల్లో తానూ ఒక పువ్వై...**

"అమ్మో! మమ్మీకి సైకిలొచ్చు" సైకిల్ తొక్కుతున్న ఫోటో చూసి ఆషా ఆశ్చర్యపడింది.

"డాడీ... నాకూ సైకిల్ కొనివ్వండీ..." నిషా గారాలుపోతూ అడిగింది.

"నాక్కూడా" గబుక్కున అందుకున్నాడు తరుణ్.

చైతన్యకి వాళ్ల మాటలేమీ వినిపించటం లేదు.

ఆ ఫోటోలలోని చిన్ననాటి స్రవంతిని చూస్తుంటే గుండెల్లో ఉద్విగ్నత అతనికి. ఏవో చిక్కుబడ్డ ప్రశ్నలకు, సమాధానం దొరికీ దొరకనట్లుగా ఎగ్జయిటింగ్‌గా వుందతనికి.

పేజీలు తిప్పుతూ వున్నారు పిల్లలు.

"ఆగండి" నెక్స్ట్ ఫోటోకి పేజీ టర్న్ చేయబోతున్న పిల్లల్ని ఆపాడు అతను.

అక్కడ వుంది స్రవంతి- ఓణీ చెరుగు చేతుల్తో ఎత్తిపట్టుకుని... ఆకాశంవైపు తలెత్తి చూస్తూ... నవ్వుతూ పొగడపూల చెట్టుకింద నిలబడి... తెల్లని పూలను ఏరి పట్టుకుంటూ... ముగ్ధమనోహరంగా, స్వచ్ఛమైన పారిజాతపుష్పంలా... ఆ పువ్వుల్లో తానూ ఒక పువ్వై...

"ఇదే ఫోటో... ఇదే ఫోటో" అతని మనసు పదేపదే గత స్మృతులను వెలికితీస్తోంది. ఉద్వేగం నరనరాల్ని పట్టి ఊపుతోంది.

"కృష్ణా... టచ్ యువర్ హార్ట్" ఎవరివో పలుకులు చెవుల్లో ప్రతిధ్వనించసాగాయి అతనికి.

ఓసారి పెళ్లైన కొత్తల్లో స్టోర్‌రూమ్‌లో పాత సామాన్లన్నీ సర్దిస్తున్న వసంత "ఎవరిదండీ ఈ ఫోటో? మీ బుక్స్ మధ్యలో వుంది?" తీస్కొచ్చి అడిగింది.

"ఇలా కూర్చో..." పక్కన కూర్చోబెట్టుకొని ఫ్లాష్‌బ్యాక్ అంతా చెప్పాడు.

"పాపం! ఆ అమ్మాయి ఎప్పుడైనా కనిపిస్తే తీస్కొచ్చి మీ కప్పగిస్తాలే" చిరునవ్వుతో చెప్పింది.

వసంతలో అతనికి నచ్చే గుణం అదే. చాలా మంది ఆడవాళ్లు ఇలాంటి విషయాలకు ఎంత గొడవైనా చేస్తారు. భార్యాభర్తల మధ్య ఎంతో మ్యూచువల్ అండర్‌స్టాండింగ్స్ వుంటే కానీ వసంతలా మాట్లాడటం సాధ్యం కాదు అన్పించేది.

ఎప్పుడైనా వెన్నెల రాత్రిళ్లు... బాల్కనీలోంచి నిలబడి ఆకాశంలోని పున్నమి చంద్రుడిని చూస్తుంటే వెనగ్గా వచ్చి గుసగుసగా అడిగేది వసంత "డ్రీమ్ గాళ్ గుర్తొచ్చిందా?" అంటూ అల్లరిగా నవ్వేది.

"ఏయ్! నేనెప్పుడో మర్చిపోయాను. నువ్వే మర్చిపోలేదు. ఆ ఫోటో బయటపడేశావా లేదా?" కోపం ప్రదర్శించేవాడు.

ఆఖరికి రోజులు లెక్కబెడుతున్న ఘడియల్లో కూడా చైతన్యతో జోక్ చేసేది. "ఇప్పుడు గనుక మీ డ్రీమ్‌గాళ్ నాకు దొరికితే బతిమాలైనా తీసుకొస్తాను" అని బలహీనంగా నవ్వేది.

"ఏంటా పిచ్చిమాటలు? పెళ్లైన వాళ్ల గురించి అలా మాట్లాడొచ్చా?" విసుక్కునేవాడు.

భర్త ఏనాడో చిన్న వయసులో కొన్ని క్షణాలు ఇష్టపడ్డాడని.. ఆ అమ్మాయిని తెచ్చి అయినా తను లేని లోటు తీర్చాలనుకునే... మనస్తత్వం... తనమీద ఆమెకున్న పిచ్చి ప్రేమ అతన్ని అబ్బురపరిచేది.

"ఆ అమ్మాయిని ఎక్కడో చూసినట్లుగా... ఎన్నాళ్ల పరిచయమో వున్నట్లుగా అన్పిస్తోందండీ" చివరి రోజుల్లో స్రవంతి గురించి ఎత్తబోయింది ఓసారి.

"ప్లీజ్! నా దగ్గర ఎత్తకు" చెప్పేశాడు.

తన జీవితంలోకి మరో మనిషి ఇల్లాలుగా ప్రవేశించిందనే విషయం అతడిని అతలాకుతలం చేస్తున్న సమయమది. ఇప్పుడు ఆ డ్రీమ్‌గాళ్ తనింటికొచ్చింది. ఇదెలా సాధ్యం?

"వేర్ దేరీజ్ ఎ విల్... దేర్ ఈజ్ ఎ వే" కోరిక బలంగా వుంటే మార్గం దొరుకుతుందంటారు.

"వసంతా... నువ్వు నా భార్యవా? తల్లివా?" అతని మనస్సు మరోసారి వసంతను తలచుకుంది.

"అయ్యో! ఇందులో ఫొటోస్ లేవు" పిల్లల మాటలతో గత కాలపు జ్ఞాపకాల నుంచి బయటికి వచ్చాడు కృష్ణ చైతన్య.

అది స్రవంతి డైరీ. పేజీలన్నీ బరబరా తిప్పేస్తున్న పిల్లలతో "ఆషా! జాగ్రత్త" అన్నాడు.

"ఓకే డాడీ! నేను దాచిపెట్టేస్తాలే" పక్కనే వున్న బ్రీఫ్‌కేసులో పెట్టి క్లోజ్ చేసేసింది.

"రండి... ఆడుకుందాం" ముగ్గురూ బయటికి వెళ్ళిపోయారు.

అతను... మిగతా ఫొటోలు చూడటంలో మునిగిపోయాడు.

స్రవంతి తనింటికి వచ్చింది అనే ఆశ్చర్యంతో ఆ రాత్రంతా అతనికి నిద్ర పట్టలేదు.

మర్నాడు ఉదయం ఆఫీసులో బ్రీఫ్‌కేసు ఓపెన్ చేస్తే వుంది ఆ డైరీ. చదవటం తప్పని తెలిసినా అతని చేతులు ఆటోమేటిగ్గా ఆ బుక్‌ని స్పృశించాయి.

నిజానికి స్రవంతి గురించి ఏ చిన్న విషయాలు తెలీవు ఇంతవరకు అతనికి.

ఎప్పుడైనా నందిని నోట్లోంచి ఆ అమ్మాయి గురించి ఏదైనా మాట వచ్చినా... తను చెప్పేలోపు... అక్కడ్నుంచి లేచి వెళ్ళిపోయేవాడు.

డైరీ రోజూ రాసే అలవాటు లేదు స్రవంతికి. మనసు స్పందించినప్పుడు మాత్రమే... కష్టంకానీ సుఖంకానీ సంతోషం కానీ ఏదైనా ఆమెను స్పృశించినప్పుడు మాత్రమే రాసుకుంది.

చిన్నప్పటి ఆమె ఆటపాటల జీవితం... లక్ష్మితో స్నేహం... ఒక్కగానొక్క నేస్తం అంటూ లక్ష్మి గురించి చాలానే రాసుకుంది. ఆమె చెప్పకుండా సుధీర్‌తో వెళ్ళిపోవటం తనని ఎంత బాధించిందో డైరీకి చెప్పుకొంది. అక్కడక్కడ చిన్నప్పటి తండ్రి మరణం... అన్నతో గడిపిన ఒంటరి జీవితం... తండ్రి లేకపోవటం ఎంత లోటో... అంటూ రాసింది.

రాజేష్‌తో వివాహం... అతను తనతో గడిపిన తీరు... మరోచోట "ఏ రిలేషనూ లేకుండా కేవలం ఫ్రెండ్స్‌లా గడపలేమా?" అంటూ వున్నాయి కొన్నిలైన్లు.

మరికొన్నిచోట్ల "ఎందుకితను అర్థం

చేసుకోడు? ఎన్నో లోపాలతో ఎంతో మంది భార్యాభర్తలు కేవలం ఒకరికొకరు అండగా జీవించటం లేదా? కనీసం నైబర్స్‌లాగా అయినా వుండొచ్చు కదా! ద్వేషించాల్సిన పనేముంది? "

ఆ అక్షరాలు చదువుతున్న చైతన్యకు ఆమె ఎటువంటి నరకప్రాయమైన జీవితం నుంచి బయటడింది అర్థం అవ్వసాగింది.

మధ్య మధ్యలో కమలమ్మగారి గురించి... ఆవిడ మంచితనం తనని స్పందింపచేసిన తీరు గురించి నోట్ చేసుకుంది.

మళ్ళీ తన లైఫ్‌లో వివాహం... కేవలం అన్నయ్య జీవితం బాగుండాలనే ఆమె తపన... అంతా ఆ డైరీలో స్పష్టమవుతుంది. డైరీలో ఎక్కువగా తరుణ్ గురించిన రాతలే వున్నాయి. ఒకచోట చైతన్య కళ్లు ఆగిపోయాయి.

లక్ష్మీ!

వెరీ వెరీ సారీ! తరుణ్‌ని నా దగ్గర పెట్టుకోకుండా వాడిని ఎవరూ లేని వాడుగా వదిలేశాను. నువ్వు ఏ లోకాల్లో వున్నా నన్ను క్షమించవేమో! కానీ నీకు తెలుసా లక్ష్మీ... వాడు కేవలం అనాథలా ఆశ్రమంలో మాత్రమే వుంటున్నాడు. వాడి కోసం, వాడి భవిష్యత్తు కోసం నీ స్రవంతి వాడి వెనుకే వుంటుంది...

మరో పేజీని తిప్పాయి అతని చేతులు.

వసంతక్కా!

ఆ వసుంధర, రజనిలను తట్టుకునే ధైర్యాన్ని నాకు నువ్వే ఇవ్వాలి.

ఆషా, నిషాలపై ఎవరి నీడా పడనివ్వను. నీకిచ్చిన మాట తప్పను అని రాసి వుంది.

ఇంకో పేజీలో-

ఆషా, నిషా ఎంత ముద్దొస్తున్నారు? చిన్న పిల్లలైన వీళ్లమీద ఆ దేవుడికెంత నిర్దయ? తల్లిని దాదాపుగా మరిచిపోయి-నన్ను పూర్తిగా వాళ్ళ మమ్మీగా... వాళ్ల ప్రేమనంతా నాకు పంచుతున్న ఈ చిన్నారుల రుణం నేనెలా తీర్చుకోగలను?

ఇంకోచోట... ఇంట్రస్టింగ్‌గా ఆగిపోయాయి అతని చూపులు.

ఈ ఇంట్లోకి వచ్చి అప్పుడే పదినెలలు గడిచిపోయాయి వసంతక్కా! నిజంగా మీ ఆయన శ్రీరామచంద్రుడే. ఈ రోజే చూశాను కరెక్ట్‌గా. చాలా అందంగా

## సత్యసంధులు

అబద్ధాలు చెప్పడం, తప్పుడు సాక్ష్యాలివ్వడం తన వృత్తికాదన్న సాక్షిని లాయర్ ఇలా అడిగాడు.

'అయితే నువ్వు సత్యసంధుడివన్న మాట, మరి ఇంతకుముందు సాక్ష్యం ఇచ్చిన రామయ్య, భీమయ్యల మాటేంటి? '

'వాళ్లూ నాలాంటివాళ్లే'.

'అయితే మీ ఊళ్లో అంతా సత్యహరిశ్చంద్రులే అన్నమాట' అన్నాడు లాయర్ గొంతులో వ్యంగ్యం.

'అందరూ ఎలా అవుతారు సార్? లాయర్లలో తెలివైనవాళ్లు, చవటలూ ఎలా ఉంటారో అలాగే మా ఊళ్లోనూ కొందరు నిజం చెప్పేవాళ్లూ, కొందరు అబద్ధాలు చెప్పేవాళ్లూ ఉంటారు' అని సాక్షి దెబ్బకొట్టాడు.



వున్నారు. ఇక్కడొక అమ్మాయి తన ఇంట్లో తిరుగుతోందని కూడా ఆయనకి గమనింపులేదు. అక్కా! రియల్లీ యు ఆర్ లక్కీ. పాపం ఆయనదే బేడ్ లక్.

మరోచోట-

ఈ రోజు చైతన్య ఊర్నించి వచ్చారు. ఎందుకో కొండంత ధైర్యంగా వుంది. ఈ శేఖర్ వెర్రివేషాలు కొద్దిగా అయినా కంట్రోల్ కొస్తాయేమో...

ఇంకో పేజీలో-

జీవితంలో తొలిసారి నా మనసు పాడిన రాగం ఆలకిస్తున్నాను. ఆయన నన్ను పొదివి పట్టుకున్నారు. తల్చుకుంటుంటేనే ఓ వింత అనుభూతి ఆవరించుకుంటోంది. ఆ చేతుల్లో ఎంత రక్షణ? నా మనసుకి ఎందుకంత నిశ్చింత? శరీరం గాల్లో తేలుతున్నట్లుగా వుండటం అంటే ఇదేనా?

**ఆయన నన్ను పొదివి పట్టుకున్నారు. తల్చుకుంటుంటేనే ఓ వింత అనుభూతి ఆవరించుకుంటోంది. ఆ చేతుల్లో ఎంత రక్షణ? నా మనసుకి ఎందుకంత నిశ్చింత? శరీరం గాల్లో తేలుతున్నట్లుగా వుండటం అంటే ఇదేనా?**

మనసు నా అధీనంలో వుండకుండా చైతన్య తలపులకై పదేపదే పరుగులు తీస్తుందెందుకు? అతని సాన్నిహిత్యాన్ని ఆశపడే ఈ పిచ్చి మనసును ఆపటం నా తరమా?

- "ఈరోజు చైతన్య పిల్లలతోపాటు నన్నూ రెస్టారెంట్ కి తీసుకెళ్లారు. 'నీకే మిష్టం?' మెనూ కార్డ్ తిప్పుతూ... ఆర్డర్ చేసేటప్పుడు ఆయన అడగ్గానే ఎందుకంత ఉద్వేగం నాకు? తన ఇష్టానికీ ఆయన ఓ ఇంపార్టెన్స్ ఇస్తున్నారనా? ఇదే... ఇన్నాళ్లకి నాలో తొలివలపా? భగవంతుడా! ఇలా ఈ మాత్రం స్నేహంగా అయినా వుంచు మమ్మల్ని. బయటికొస్తుంటే... ఎండాకాలంలో కూడ చుట్టూ తొలకరిజల్లులు కురిసిన భావన ఈ రోజు నాలో"

- "ఎందుకిలా చేశారు? ఆయన ఇంట్లో వుంటున్నానన్న చులకన భావమా? మేము డబ్బున్నవాళ్లం అనే దర్పమా? నాకంటూ ఓ మనసుందని... దానికి కొన్ని అనుభూతులుంటాయని ఆయనకి తెలీదా? మనసులేని మరబొమ్మలా... నేను మిగిలిపోయానా ఆయన దృష్టిలో? లేక వాళ్లలా చెబితే అలా ఆడేట్లుగా... చులకనగా కన్పిస్తున్నానా? పిచ్చి హృదయమా! సంతోషంతో గంతులు వేస్తున్న నీకు అలా ఆనందించే అర్హత లేదని... ఆ భగవంతుడు బుద్ధి చెప్పాడా? బహుశా నాలాంటి వాళ్ల జీవితాలు ఇంతేనేమో..."

చివరి పేజీలో-

"ఇక మనసులోని అనుభూతులన్నీ చంపుకుని నేనిక్కడ వుండలేను. ఈ రోజే జాబ్ కి అప్లై చేశాను. జాబ్ వస్తే వెంటనే బయల్దేరాలి. నాకెవరూ వద్దు. తరుణ్... వాణ్ణి, ఎకామిడేషన్ కుదరగానే వెంటనే వచ్చి తీసుకెళ్ళాలి. ఇక నుంచీ నా గమ్యం, లక్ష్యం ఒక్కటే... వాణ్ణి పెంచి పెద్దచేసి, మంచి చదువు చెప్పించాలి. ఆషా... నిషా...? ఒక్క నిమిషం కూడా నేను కనిపించకపోతే భయపడుతూ ఇల్లంతా వెతుకుతారే...? వాళ్ల పరిస్థితి...?

డైరీ అంతా చదివేటప్పటికి చైతన్యకు గంటన్నర పైనే పట్టింది. రాజేష్ తో జీవితంలో ఎన్నో కష్టాలను ఎదుర్కొని ఆమె తనింటికొస్తే... తనేం చేశాడు? ఊపిరి పోసుకుంటున్న ఆమె ఆశలను... పెరుగుతున్న ప్రేమ మొక్కను ఆదిలోనే తుంచే

శాడు. పాపం ఎంత బాధపడివుంటుందో...?

చిన్న వయసులోనే ఎన్ని చేదు అనుభవాలు చవిచూసింది స్రవంతి?

ఆ రోజు తనెందుకు అలా బిహేవ్ చేశాడో... అతనికి ఇప్పటికీ అర్థంకాని విషయమైంది. ఆ సంఘటనతో ఆమె మనసులో తాను కూడా ఓ చెడుముద్ర వేయించుకున్నాడు. వెంటనే బయల్దేరాలి. వెళ్లి, జరిగిన దానికి ఆమెకి క్షమాపణలు చెప్పైనా, బాధపడుతున్న ఆమెను సాంత్వన పరిచి అక్కున చేర్చుకోవాలి.

ఆలోచిస్తున్న అతనికి "సర్, దె ఆర్ వెయిటింగ్" సెక్రటరీ లోపలికి వచ్చి చెప్పింది.

వన్ అవర్ వరకూ ఎవరొచ్చినా డిస్టర్బ్ చెయ్యొద్దని ఇంతకుముందే చెప్పాడు ఆమెకి.

"ఓ. కె. సెండ్‌దెమ్" చెప్తూ చెయిర్లో రిలాక్సయ్యాడు.

మెదడంతా స్రవంతి రాతలతో వేడెక్కిపోయింది. ఇన్ని రోజులుగా ఆమె మనసు తెలుసుకోకుండా తాను పిచ్చిగా బిహేవ్ చేశాడనే బాధలోనే... సిగ్గుగా ఫీలవుతూ వున్నాడు. ఇప్పుడు ఆమె మనసంతా తనే ఆక్రమించుకున్నానని తెలిశాక... ఏదో ధైర్యం, నిశ్చింత. ఎప్పుడెప్పుడు వెళ్ళి ఆమెని క్షమాపణలు అడుగుదామా అని ఆత్రంగా వుంది అతనికి.

లోపలికి వచ్చిన కంపెనీవాళ్లతో బిజినెస్ వ్యవహారాలు మాట్లాడి ఇంటికి బయల్దేరాడు.

"తనెంత అదృష్టవంతుడు? తనని స్రవంతిపరం చేయటానికి అంగీకరించిన వసంత, తనని వసంతతోపాటుగా అంగీకరించిన స్రవంతి. ఇద్దరు అమృతమయమైన స్త్రీ మూర్తులతో తన జీవితం ఎంత విచిత్రంగా ముడిపడింది? " అనుకుంటూ డ్రైవ్ చెయ్యసాగాడు.

ఎన్నో ఆలోచనలతో ఇంటికి చేరిన చైతన్య చేతికి కవరొకటి ఇచ్చింది సావిత్రమ్మ. ఓపెన్ చేసి చూశాడు. నాలుగే వాక్యాలున్నాయి అందులో.

"క్షమించండి. మనసు చంపుకుని... అనునిత్యం బాధపడుతూ... ఏదో కోల్పోయిన దానిలా నేనిక్కడ బతకలేను. నేనిక్కడ గడిపినన్నాళ్లూ నా బాధ్యతలు సక్రమంగా నెరవేర్చాననే అనుకుంటున్నాను. నా వల్ల ఏమైనా పొరపాట్లు జరిగుంటే మన్నించగలరు.

ఇట్లు
స్రవంతి

అని రాసింది. అంత బాధలో వుండి, ఇల్లు వదిలి వెళ్ళిపోతూ కూడా ఆమె తనని ఎత్తిపొడవకపోవటం... ఛ! తననించే... ఇదంతా అనుకున్నాడు.

"స్రవంతి ఎక్కడ? " ఆత్రంగా అడిగాడు పనివాళ్లని.

"ఏవో రెండు సూట్‌కేసులు తీస్కెళ్ళారయ్యా! మరి అన్నయ్యగారింటికేమో... చీటి మాత్రం ఇమ్మన్నారు"

"అక్కడికి వెళ్లుండదు" అని మనసు చెపుతోంది. మళ్ళీ అడిగాడు "ఎంతసేపైంది? "

"ఇప్పుడే పావుగంట" చెప్పింది సావిత్రమ్మ.

ఉరుకులు, పరుగుల మీద ఆమె రూమ్‌లోకి వెళ్ళాడు. వార్డ్‌రోబ్స్ ఓపెన్‌చేసి చూశాడు. కొన్ని పట్టుచీరలు మాత్రం వేలాడదీసి వున్నాయి. అవి... నందిని ఆమెకి ప్రెజెంట్ చేసిన శారీస్. తను తెచ్చుకున్నవి మాత్రం తీస్కెళ్ళింది.

శివరాంకి ఫోన్ చేద్దామా అనుకుంటూ ఫోన్ దగ్గరికి వచ్చాడు.

నేలమీదపడి గాలికి ఎగుర్తోంది కవరొకటి. చెన్నైలో వుండే సాఫ్ట్‌వేర్ కంపెనీ అడ్రస్ వుంది దానిపై. కాల్‌లెటర్ వచ్చినట్లుగా తెలుస్తోంది.

అతనికి దారి దొరికింది.

"సావిత్రమ్మా... భోజనానికి రెడీ చెయ్ - ఇప్పుడే వస్తాను"

తననే చూస్తున్న పనివాళ్ల కాన్సన్‌ట్రేషన్ మార్చటానికి, చెప్పి... బయటికి వెళ్లాడు.

అంతస్తులు, పెరిగిన హోదాలు... అవతలి వాళ్ల ఆరాటానికి మూలం. అలాగే వీళ్లూ... వాళ్లతో కలవలేరు.

రైల్వే ఎన్‌క్వైరీస్‌కి ఫోన్‌చేస్తూ అటు తిప్పాడు కారు.

"ఇంకా ఇరవై నిమిషాలు" సమాధానం చెప్పారు వాళ్లు.

అతని అంచనా తప్పు కాలేదు. చెన్నై వెళ్లే ఎక్స్‌ప్రెస్‌లో కూర్చునుంది స్రవంతి.

8



**హో**టల్ బ్లూమూన్, స్టార్ హోటల్. చాలా ప్రశాంతంగా వుందక్కడ. హోటల్ చుట్టూ వున్న సముద్రపు హోరు వినిపిస్తోంది.

తిన్నగా గ్రౌండ్ ఫ్లోర్‌లో వున్న రెస్టారెంట్‌లో కూర్చోపెట్టాడు స్రవంతిని.

"టూ మీల్స్" బట్లర్‌కి ఆర్డర్ చేస్తూ చెప్పాడు.

"నాకొద్దు... ఆకలిగా లేదు" చెప్పింది స్రవంతి.

"ప్లీజ్..." అడ్డు చెప్పొద్దన్నట్లుగా చెయ్యి చూపాడు.

"కూర్చో... ఇప్పుడే వస్తాను" ఆమెని ఓ పక్క చూసుకుంటూ, రిసెప్షన్ కౌంటర్ దగ్గరకి వెళ్లాడు.

ఆమెని ఓ పక్క క్రీగంట చూసుకుంటూ కౌంటర్ అతనితో ఏదో మాట్లాడాడు.

ఈ లోపు భోజనం వచ్చేసింది.

తింటూనే మధ్యలో ఇంటికి ఫోన్ చేశాడు. పిల్లలొస్తే ఏడవకుండా చూసుకోమని... మమ్మీ, డాడీ వచ్చేటప్పటికి సాయంత్రమౌతుందని చెప్పమన్నాడు.

"ఎక్కడికి తీసుకెళ్తున్నాడు తనని? " వింటున్న ఆమెకేమీ అర్థం కాలేదు.

"పద..." లిఫ్ట్‌లోకి దారిచూపిస్తూ ఫిఫ్త్ ఫ్లోర్ బటన్ ప్రెస్ చేశాడు.

ఐదో అంతస్తులో అతను ఓ రూమ్‌లోకి దారితీస్తుంటే అతన్నే అనుసరించిందామె.

"కూర్చో" బెడ్ చూపిస్తూ, తటపటాయిస్తున్న ఆమెకి చెప్పాడు.

విండోస్ దగ్గరికి వెళ్లి కర్టెన్స్ తొలగించి నిలబడ్డాడు. ఉవ్వెత్తున ఎగసిపడుతూ కనిపిస్తున్నాయి పాలనురగల్లాంటి సముద్రపు అలలు. భగవంతుడి సృష్టి ఎంత అద్భుతమో. సముద్రాలను, జలపాతాలను... వాటి ఎగసిపడే జలధారలను చూసినప్పుడే తెలిసేది.

గంభీరంగా ఎన్నో విషయాలను తనలో ఇముడ్చుకున్నట్లుగా ఒరవడిగా సాగుతూ అంతే వేగంగా వెనక్కి మళ్ళుతూ అలలు వస్తూ పోతూ వున్నాయి.

గంభీరంగా ధ్యానముద్రలో వున్నట్లుగా విండో దగ్గర నిలబడ్డ చైతన్యను చూస్తుంటే... సముద్రానికీ, ఇతనికీ తేడా లేదు అన్పించింది స్రవంతికి.

ఆమె అలా ఆలోచనలో వుండగానే దగ్గ

రకి వచ్చాడు అతను.

పక్కన కూర్చుని, ఆమె చేతులు తన చేతుల మధ్యకు తీసుకుని చెప్పాడు, "జరిగిన దానికి... వెరీ వెరీ సారీ!" అన్నాడు చిన్నగా మొహం చేసుకుని. "నాకిప్పటికీ అర్థం కావట్లేదు, నేనెందుకలా రఫ్‌గా బిహేవ్ చేశానని... నిన్ను ఎంత ఇబ్బంది పెట్టానో..." చెప్తున్నాడు.

అతని పెదవులపై చేతివేళ్లతో మూసింది ఆమె.

"జరిగినవన్నీ మన మంచికేనని చిన్నప్పుడు మా అమ్మ చెప్పేది. ఇదంతా ఆ రజనీవాళ్ల ప్లాన్..." అంటూ రైల్వే స్టేషన్‌లో రజని ఫ్రెండ్స్ సంభాషణ చెప్పింది.

అతనికి నమ్మశక్యం కాక ఆశ్చర్యంతో తలమునకలయ్యాడు.

"నాపైన పిల్లల బాధ్యత పెట్టుకుని కూడా... నేనే చైల్డిష్‌గా, ఫూలిష్‌గా బిహేవ్ చేశాను... నిజానికి నేనే సారీ చెప్పాలి" అపాలజిటిక్‌గా అంది ఆమె.

ఉన్నట్లుండి... ఆమె ఒడిలో తలపెట్టుకుని పడుకుండిపోయాడు అతను.

మొదట ఇబ్బందిగా ఫీలైన స్రవంతి... మరో ఐదు నిమిషాలకు చేతివేళ్లతో అతని జుట్టు నిమరసాగింది. ఆమెలో ఎక్కడో గడ్డకట్టుకుపోయిన అనుభూతుల పర్వం ప్రవహించటం మొదలైంది.

"నీ డైరీ చదివాను నేను..." చెప్పాడు ఆమెకి.

అన్నీ చదివేసివుంటాడు... ఆమె చెంపలు ఎర్రబడ్డాయి.

"నీకో సంగతి తెలుసా స్రవంతి..." అంటూ ఆమెకి తెలియని తన లవ్ ఫ్లాష్ బ్యాక్ చెప్పాడు. వినయ్ దగ్గర్నుంచి ఆమె ఫొటో చూడటం... మళ్ళీ మొన్నటికి మొన్న పిల్లలు తెచ్చిన ఆల్బమ్‌లో అదే ఫొటో అతని కళ్ళ బడటం అన్నీ చెప్పుకొచ్చాడు మంద్ర స్వరంతో.

స్వగతాలు కలబోసుకున్నాక ఇద్దరికీ మనసులు తెరిపిన పడ్డాయి.

అతని సన్నిధిలో ఎన్నో సంవత్సరాలు ఎదురుచూపుల్ని తీర్చుకున్నట్లు సేదతీరింది ఆమె. ఆమె ఒడిలో ఎన్నాళ్ల మానసిక అశాంతో తీరిపోయినట్లుగా అయింది అతనికి.

అతను సంపూర్తిగా ఆమె వాడయ్యాడు. ఆమె పరిపూర్ణంగా అతనిదయ్యింది.

★ ★ ★

ఇంటికి చేరాక... "లోపలికి పద... లగేజ్ నేను తెస్తాను" చెప్పాడు.

"స్రవంతి...!" కదలబోతున్న ఆమెని సన్నగా పిలిచాడు.

"ఇంకెప్పుడూ ఇల్లు వదిలిపెట్టి వెళ్ళవుగా... వసంత నన్ను క్షమించదు" అంటూ డిక్కీ ఓపెన్ చేశాడు.

★ ★ ★

చైతన్య ప్రేమను పూర్తిగా పొందుతున్న స్రవంతికి... రంగు రంగుల పూలన్నీ గుండెగదిలోనే విరబూస్తున్నాయి.

వాకిలి వాకిలికి మామిడాకు తోరణాలు కట్టినట్లుగా... ఎటు చూసినా మనసులోని పచ్చదనం బయటికొచ్చి నేలంతా తివాచీలా పరుచుకున్నట్లుగా... ఉత్సాహంగా వుంది ఆమెకి.

ఆ ఏడాది సునందకు శ్రీమంతం అంటూ పిలుపు రావటంతో స్రవంతి పిల్లలిద్దర్నీ తీస్కుని రెండ్రోజులపాటు ముందుగానే వెళ్లింది.

చైతన్య ఫంక్షన్ టైమ్‌కి వస్తానన్నాడు.

పిల్లలిద్దరికీ చిన్న పట్టు లంగాలు కుట్టించింది స్రవంతి. కాస్త పొడవు పెరగటంతో సన్నగా, నాజూగ్గా ముద్దుగా కనిపిస్తున్నారు ఆ బట్టల్లో. తల్లి పక్కనే ఆమె చీర చెరుగు పట్టుకుని తిరగటం మాత్రం

మానలేదు.

బుడి బుడి నడకల శివరాం కొడుకుని మాత్రం ఎత్తుకుని దించట్లేదు ఆషా, నిషాలు.

చైతన్య రాకతో అంతా హడావిడి పడ్డారు. అతనికి మర్యాదలు చేయటంలో అతలాకుతలం అయిపోయారు. రాఘవయ్య, జానకమ్మ, శివరాం ముగ్గురూ.

"అన్నయ్యా! ఎందుకంత కంగారు? " వాళ్లని చూసి మందలించిన స్రవంతితో,

"ఉండమ్మా! మొదటిసారి మనింటికొచ్చారు. సరిగ్గా చూస్కోపోతే ఎలా? " చిరుకోపం ప్రదర్శించాడు శివరాం.

చుట్టూ అలరారుతున్న పచ్చదనం... మధ్యలో విశాలంగా ఉన్న పెంకుటిల్లు... ఆవులు, లేగదూడలు... పావురాలు...

"వండ్రఫుల్ సీనరీ..." అనుకున్నాడు చైతన్య.

"ఏమే స్రవంతీ... మూడో ఏడు తగిలేటప్పటికే రెండోసారి మోస్తుంది మా సునంద. నువ్వు నీ అల్లుణ్ణి చంకలో మొయ్యటమేనా...? మా అబ్బాయికే మన్నా వారసుణ్ణి ఇచ్చేది వుందా, లేదా? " అటుపక్కగా చెయిర్‌లో కూర్చున్న చైతన్యను చూస్తూ అడిగింది దూరపు బంధువు ఒకావిడ.

మేనంతా ముద్దమందారంలా ఎర్రబడిపోయిన స్రవంతిని చూస్తూ... కళ్లెగరేశాడు చైతన్య.

ఆ దృశ్యం చూస్తున్న శివరాం మనస్సంతా తృప్తితో నిండిపోయింది.

ఇన్నాళ్లుగా అతనికి ఏ మూలో... చెల్లెలు వెలితిగానే జీవిస్తోంది అన్పించేది. ఈ రోజుతో ఆ అనుమానం తీరింది. ఈ సంతోషాన్నే తను చెల్లెలి మొహంలో చూడాలనుకుంది.

వెంట తెచ్చిన పట్టుచీర, నెక్లెస్ సెట్టూ సునంద ఒళ్లో పెట్టి అక్షింతలు వేశారు చైతన్య, స్రవంతి ఇద్దరూ.

"మమ్మీ... మేమూ" చేయిచాచి అక్షింతలు అడుగుతున్న ఆషా, నిషాలను చూసి నవ్వారు అందరూ.

★ ★ ★

ఈసారి సమ్మర్ హాలీడేస్‌కి 'డార్జిలింగ్' ఎనౌన్స్ చేశాడు చైతన్య.

"హేయ్..." పిల్లలిద్దరూ సంతోషంగా కేరింతలు కొట్టారు.

ఆరోజే నందిని, శ్రీకర్ వచ్చారు.

సంతోషంగా వెలిగిపోతున్న స్రవంతి, చైతన్యలను చూసి... వాళ్ల మధ్య బంధం మరింత గట్టిగా మారిందనుకున్న నందిని ఆనందపడింది.

"అక్కా! మీరు రండి ఈసారి, మాతో" అడిగాడు.

"లేదురా... బిజినెస్ వ్యవహారాలు కొన్ని పెండింగ్ ఉన్నాయి"

"ఒహ్హో..." డిజప్పాయింట్ ఫేసులతో అన్నారు ఆషా, నిషా.

"ఒ.కె... కానీ మీకో గుడ్‌న్యూస్... తరుణ్‌ని కూడా తీస్కెళదాం" చెప్పాడు చైతన్య.

"ప్రామిస్... రియల్లీ..." అడిగారు ఆషా, నిషా.

కానీ స్రవంతి మాత్రం ఆ ప్రపోజల్‌కి అబ్జెక్షన్ చెప్పింది.

"మనతోపాటు వాడూ ఎంజాయ్ చేసి... తిరిగి వచ్చేటప్పటికి వాడిని ఆశ్రమంలో వదిలేస్తుంటే... వాడి కళ్లలో మెదిలే బాధ చూడటం నావల్ల కాదు. ప్లీజ్... ఇప్పటికే వాడిని మాటిమాటికీ ఇక్కడికి తెస్తూ తప్పు చేస్తున్నాననిపిస్తుంది నాకు"

ఆమె మాటలతో అందరూ స్తబ్దుగా అయిపోయారు కొన్ని క్షణాలు.

'వాడంటే ఈ అమ్మాయికి ఎంతిష్టం ' అనుకుంది నందిని.

9



ప్రపంచంలో ఉత్తమమైన వేసవి విడిది డార్జిలింగ్. సిక్కిం రాజవంశస్థుల ఆన వాళ్లు, బ్రిటిష్ పాలకుల ఆమోదముద్రలు అడుగడుగునా కనిపిస్తున్నాయి. నూట యాభై సంవత్సరాల నాటి చరిత్ర, పచ్చని ప్రకృతి, ఆకాశాన్ని తాకే మంచుకొండలు, టీ తోటలు... కొండల మధ్యగా ప్రవ హించే సెలయేళ్లు... పక్కనే వున్న చైతన్య సాహచర్యం మళ్లీ కొత్త జన్మ ఎత్తినట్లుగా వుంది స్రవంతికి.

ఉషోదయవేళ... పిల్లలిద్దరూ నిద్రపో తుంటే స్రవంతిని లేపాడు చైతన్య. "నీకో అద్భుతం చూపిస్తాను" అంటూ కాంచన గంగ దగ్గరకు తీసుకువచ్చాడు.

సూర్యకాంతి పడుతుంటే బంగారు రంగులో మెరుస్తున్న కాంచనగంగను చూసి చిన్నపిల్లలాగా సంతోషపడింది స్రవంతి. ఆ మెరుపేదో ఆమె మోములో కనిపిస్తున్నట్లు చైతన్య తదేకంగా చూడ టంతో సిగ్గుపడింది. ఒక్క రోజులోనే తన రంగుని తెలుపు, లేతగులాబీ, నారింజ... నీలం, నలుపు రంగుల్లో మార్చే కాంచన గంగను చూస్తుంటే ఎవరికైనా తనివి తీరదు.

మర్నాడు కొండలమీద ఉన్న బౌద్ధారా మాలు చూశారు. బౌద్ధ బిక్షువులు వరు సగా వెళుతుంటే వంగి వాళ్ల పద్ధతిలో నమస్కారాలు చేశారు ఆషా, నిషా.

టాయ్ ట్రైన్‌లో వెళుతుంటే పిల్లల్లో పట్ట రాని సంబరం.

"డార్జిలింగ్ అంటే అర్థం ఏమిటో తెలుసా స్రవంతీ..? " మంచు శిఖరాలను మైమరిచి చూస్తున్న ఆమెను అడిగాడు చైతన్య.

"ఊహూ౦!" అతనివైపు చూడకుండానే చెప్పింది.

"వీళ్ల స్థానిక భాషలో 'దైవనిలయం' అని. హిమాలయాల్లోనే హిందూ దేవత లుంటారని మనవాళ్ల నమ్మకం"

"అయితే ఇక్కడ దేవుళ్లకు చలివేయదా డాడీ..." నిషా ఆశ్చర్యపోతూ అడిగింది.

"నాటీ గర్ల్" తలమీద టచ్ చేస్తూ నవ్వాడు.

ఆ సాయంత్రం రూమ్‌కి వచ్చి పడుకు న్నాక పిల్లలిద్దరికీ చెప్పాడు చైతన్య.

"రేపు కొంచం దూరం ట్రెక్కింగ్ చేద్దాం"

"అంటే ఏంటి? " తండ్రి పక్కన చేరారు. ఆతను వివరించి చెపుతుంటే స్రవంతి నిద్రలోకి జారింది.

మరో రోజు మిరిక్‌కి బయల్దేరి వెళ్లారు. దారి పొడవునా టీ తోటలు పచ్చగా కనిపి స్తుంటే పచ్చని పక్షేదో అక్కడంతా తన రెక్కలు చాచినట్లుగా ఉంది. ఎటువైపు చూసినా కళ్లు తిప్పుకోలేని అందాలు, ఒక వైపు ఎక్కువసేపు చూస్తే మరోవైపు సరిగ్గా చూడలేకపోతామేమో అన్న భయంతో తల అటూ, ఇటూ తిప్పి చూస్తున్న స్రవంతిని "మెడ పట్టేస్తుంది" అంటూ నవ్వాడు చైతన్య.

వెహికల్ దిగి ఫొటోలు తీసుకున్నారు అందరూ. అక్కడే వున్న తటాకంలో వందలాది చేపలు కనువిందు చేస్తూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. వచ్చిన టూరి

స్టలు బ్రెడ్‌ముక్కలు చల్లుతుంటే, చేపలన్నీ ఒకదానిమీద ఒకటి గుంపుగా వచ్చి ఎగబడుతున్నాయి.

పిల్లలకు బ్రెడ్ చిన్నముక్కలుగా చేసి ఇచ్చింది స్రవంతి. బ్రెడ్ తటాకంలోకి విసిరేసి వాళ్లు నవ్వుతుంటే టూర్‌కి వచ్చిన ఫారినర్స్ చైతన్యని పర్మిషన్ అడిగారు, పిల్లలిద్దర్నీ ఫొటో తీసుకుంటామని. రెండో స్నాప్‌కి నిలబడమని స్రవంతిని, చైతన్యను పిలిచారు.

స్రవంతి భుజాల చుట్టూ చేతులు వేసి నిలబడ్డాడు చైతన్య. వాళ్ళిద్దరి ముందూ ఆషా, నిషాలు... పక్కనే స్వచ్ఛంగా తేటగా కనిపిస్తున్న తటాకం... వెనకంతా



టీ తోట పచ్చదనం, స్రవంతి గుండె ఊహించని బంగారు జీవితమేదో అరచేతిలో పెట్టినట్లుగా ఉద్విగ్నతకు లోనైంది.

మరోరోజు షాపింగ్‌కి చౌరస్తాకి తీసుకు వెళ్ళాడు.

హిమాలయాల్లో దొరికే ప్రత్యేక మొక్కలు, రాళ్లు- హేండీక్రాఫ్ట్స్ రకరకాలు చూడటానికే సమయం చాలదు. ఇక కొనటానికి టైమెక్కడ?

పిల్లలిద్దరికీ నేపాలీల స్వెట్టర్లు, టోపీలు కొన్నారు. పూసల గొలుసులు, పేర్లు తెలియని రంగురాళ్లతో చేసిన గాజులు కొన్నారు. "అవన్నీ మీరు పెట్టుకుంటారా?" చైతన్య అడుగుతుంటే ఎవరూ పలకలేదు.

"ప్రస్తుతం ముగ్గురూ ఒకటే పార్టీ. నాకు రిప్లై ఎందుకిస్తారు?" అని అతను అంటుంటే నవ్వింది స్రవంతి. ఇంటి డెకరేషన్‌కంటూ రెండుమూడు బ్రాంజ్ స్టాచ్యూస్ చక్కని ఆకృతిలో వున్నవి కొన్నారు.

చివరిరోజు ధీర్‌ధామ్ మందిరానికి వెళ్ళారు. చాలామంది మెడిటేషన్ చేస్తూ కనిపించారు. తనూ మోకాళ్లమీద కూర్చుని భగవంతుణ్ణి వేడుకుంది స్రవంతి. "ఆలస్యంగానైనా నువ్విచ్చిన ఈ ఆనందాన్ని నాకు దూరం చేయకు" అంటూ.

మనసుకి ప్రశాంతత.. కొత్త శక్తి వచ్చినట్లైంది.

పదిహేనురోజుల తర్వాత-

చిత్రకారుడు తన కుంచెను రకరకాల రంగులో అద్దిన ప్రకృతిమాత పెయింటింగ్‌లా వున్న డార్జిలింగ్‌ని వదిలి వస్తుంటే "అప్పుడే పదిహేను రోజులు అయిపోయాయా?" అనిపించింది అందరికీ.

ఆ సంవత్సరం సమ్మర్ హాలీడేస్ బాగా ఎంజాయ్ చేశారు ఆషా, నిషాలు. తమతో పాటు తల్లీ, తండ్రీ- ఇద్దరూ ఆడుతూ, పాడుతూ... పరిగెడుతూ తమ ఆటల్లో పాలుపంచుకుంటుంటే చూసి బోల్డంత సంతోషమేసింది ఇద్దరికీ.

తిరిగి వచ్చాక శివరాంకి మళ్ళీ ఈసారి కూడా కొడుకు పుట్టటంతో అందరూ వెళ్ళి చూసొచ్చారు.

★ ★ ★

ఆ సంవత్సరం ఆషా, నిషాలిద్దరూ ఫస్ట్ స్టాండర్డ్‌కొచ్చారు.

వినాయకచవితి పండగొస్తే.. పిల్లలిద్దరితో వాళ్ల బుక్స్‌కి పసుపు, కుంకం బొట్లు పెట్టించి దేవుడి దగ్గర పెట్టించింది స్రవంతి. చైతన్య ఎకౌంట్ బుక్స్ కూడా తీస్కొచ్చి పూజలో పెట్టింది.

'శుక్లాంబరధరం విష్ణుం' - అని పలికి



స్తుంటే ముద్దుముద్దుగా తప్పుల్లేకుండా అలాగే వల్లించారు పిల్లలిద్దరూ.

చైతన్యను కూడా లాక్కొచ్చి తమ ముగ్గురి మధ్యలో కూర్చొబెట్టుకుంది స్రవంతి.

పిల్లలిద్దరూ పోటీపడి ఒక్కో మంత్రానికి పత్రి తీస్కుని దేవుడిపై వేయసాగారు. దేవుడి దగ్గర నైవేద్యానికి చాలా రకాల పిండివంటలు చేసి పెట్టింది.

అవన్నీ చూసేటప్పటికి చిన్నది నిషా ఆకలి అంటూ గొడవ చేయసాగింది.

"ఇంకొక్క ఐదు నిమిషాలు నాన్నా" స్రవంతి ఆ పిల్లని బుజ్జగించింది.

అల్లరి చేస్తున్న పిల్లల్ని, వాళ్లని సముదాయిస్తున్న స్రవంతిని మురిపెంగా చూశాడు చైతన్య. వాళ్లకి ఊహ తెలిశాక కుటుంబ సమేతంగా కూర్చుని చేసిన మొదటిపండగ అది.

చాలారోజులకు వాళ్లింట్లో ఓ పండుగ చక్కగా జరిగింది.

మరో నెల్లాళ్లకే దసరా... నవరాత్రిళ్లు మొదలయ్యాయి.

ఇద్దరూ ఆడపిల్లలు కావటంతో ఆషా నిషాలతో బొమ్మల కొలువు పెట్టించింది స్రవంతి. ఎక్కడెక్కడి బొమ్మలన్నీ తీస్కొచ్చి పోటీలుపడి సర్దారు ఇద్దరూ.

పట్టులంగాలు కట్టుకుని... నుదుట కుంకుంబొట్లతో ఎంతో ముద్దుగా వున్నారు వాళ్లు.

ఆ ఇంటికి చుట్టుపక్కల ఎక్కువ ఇళ్లు లేకపోవటంతో... ఫ్యాక్టరీలో వర్కర్స్‌గా పనిచేసేవాళ్ల భార్యల్నే పిలిచారు.

వాళ్లందరికీ పండూ, తాంబూలం పిల్లలతో తనే దగ్గరుండి ఇప్పించింది స్రవంతి.

'ఎంత ముద్దొస్తున్నారో!' ప్రతివాళ్లూ పిల్లల్ని చూసి అనుకుంటూ వెళ్లినవాళ్లే.

"నానమ్మా! దసరా పండగ కదా! బొమ్మలకొలువు పెట్టాం. నువ్వూ రావాలి" ఫోన్‌లో పిలుస్తుంటే జానకమ్మ ఉబ్బితబ్బిబ్బయిపోయింది.

"మా తల్లే... ఖచ్చితంగా వస్తానమ్మా" సంతోషంగా చెప్పింది.

చంటిబిడ్డతో సునంద, జానకమ్మ వచ్చి వెళ్ళారు.

★ ★ ★

"డాడీ!" ఆషా, నిషాలిద్దరూ ఆ రాత్రి చైతన్య దగ్గర గారాలు పోతూ మంచంమీదికెక్కారు. "ఊ..." మేగజైన్ తిప్పుతున్న వాడు దాన్ని మూసి వాళ్లవైపు తిరిగాడు.

"మరే... రేపు ఈవెనింగ్ మా స్కూల్ యానివర్సరీ ఫంక్షన్ ఉంది. మీరూ, మమ్మీ రావాలి" అతను ఒప్పుకుంటాడో, బిజీ అంటూ అడ్డుచెప్పేస్తాడో అనే శంక వాళ్లది.

అక్కడే ఓ పక్కగా గోడవారగా నిల్చుంది స్రవంతి.

"ఊఁ... ఇదంతా నీ రికమండేషనా?" అడిగాడు ఆమెని చూస్తూ.

"వాళ్లకీ ఎన్‌కరేజుమెంటుగా ఉంటుంది కదా... పైగా రేపు వాళ్లిద్దరి డాన్స్ ప్రోగ్రామ్స్ కూడా ఉన్నాయి" చెప్పింది.

"మనకీ ఎంటర్‌టెయిన్‌మెంట్ అన్న మాట" చిరునవ్వుతో అన్నాడు.

"ప్లీజ్ డాడీ.."

"ప్లీజ్ డాడీ.."

వాళ్ల నాన్నని బతిమాలాడసాగారు, ఊపిరి తీస్కోనివ్వకుండా.

"ఓకే... ఓకే... వస్తాను. ఆ డాన్స్ ప్రాక్టీసేదో బాగా చెయ్యండి" చెప్పాడు. పిల్లలిద్దరూ సంతోషంతో గంతులేశారు.

★ ★ ★

కిండర్‌గార్టెన్ నుంచి టెన్త్‌క్లాస్ వరకూ క్లాసెస్ నడుపుతున్న స్కూల్ అది. పాటలు, డాన్సులు... డ్రామాలు... పిల్ల

లంతా చాలాసేపు బాగా పెర్ఫార్మ్ చేశారు. ఆషా, నిషాల డాన్స్ ప్రోగ్రాం కూడా చాలా బాగుంది. చివరి ప్రోగ్రాంగా ప్రైజులివ్వసాగారు. ఆటలో, పాటల్లో, క్విజ్ పోటీల్లో అన్నిరకాలుగా... స్టడీస్‌లో కూడా ఎకడమిక్ ఇయర్ ప్రైజులు అన్నీ ఇచ్చేశారు. చివరిగా మిగిలినవి రెండే ప్రైజులు.

“అండ్ నౌ ద లాస్ట్ ప్రోగ్రాం ఈజ్... ద బెస్ట్ స్టూడెంట్స్ ఆఫ్ ది ఇయర్” మైకులో టీచర్స్ ఎనౌన్స్ చేయసాగారు. ముందుగా ఒకావిడ చెప్పసాగింది.

“ఒక్క స్టడీస్ మాత్రమే కాదు... వాళ్ల టాలెంట్స్ అన్నిరంగాల్లో కేలిక్యులేట్‌గా తీస్కోవటం జరిగింది. డాన్సింగ్, సింగింగ్, ఏక్టింగ్, గేమ్స్... వాళ్ల బిహేవియర్ అన్నీ కౌంట్‌లోకి తీసుకుని సెలెక్షన్ చేయటం జరిగింది. ముఖ్యంగా టీచర్స్‌ని కానీ, పెద్దవాళ్లను గౌరవించటం కానీ, మిగతా పిల్లలతో ఆడుకునేటప్పుడు... ఆ పిల్లల స్వచ్ఛతకు, ప్రవర్తనకు ఫిఫ్టీ పర్సెంట్ మార్క్స్ అలాట్ చేశాం” చెప్తున్న టీచర్ పేరెంట్స్‌లో కొంత కుతూహలాన్ని పెంచటానికన్నట్లు ఆగింది.

డాన్సింగ్, సింగింగ్, ఏక్టింగ్, గేమ్స్... వాళ్ల బిహేవియర్ అన్నీ కౌంట్‌లోకి తీసుకుని సెలెక్షన్ చేయటం జరిగింది. మిగతా పిల్లలతో ఆడుకునేటప్పుడు... ఆ పిల్లల స్వచ్ఛతకు, ప్రవర్తనకు ఫిఫ్టీ పర్సెంట్ మార్క్స్ అలాట్ చేశాం.

అందరూ సీట్లల్లో ఎరెక్ట్ అయిపోయారు. చైతన్య, స్రవంతి ముందరిపక్క సీట్లలోనే కూర్చున్నారు.

“మా దృష్టిలో మేము నామినీగా సెలెక్ట్ చేసిన స్టూడెంట్స్‌ని టూ మంత్స్‌గా ఈ స్కూల్లో పనిచేసే ప్రతి ఒక్క ఆయా నుంచి గేట్ వాచ్‌మెన్ వరకు, చిన్న క్లాసుల టీచర్స్ నుంచి పెద్ద క్లాసుల టీచర్స్ వరకూ... అందరి అబ్జర్వేషన్‌లో ఆ పిల్లల బిహేవియర్‌కి సంబంధించి మార్క్స్ తీసుకున్నాం.

కాబట్టి ఇది మా స్టాఫ్ అందరూ కలిసి మీ పిల్లలకిచ్చే అవార్డ్ కింద... వెరీ వెరీ స్పెషల్ ప్రైజుగా పేరెంట్స్ భావించవచ్చు” ఓ టీచర్ చెప్పాక మరొకావిడ స్టేజీపైకి వచ్చింది ఎనౌన్స్ చేయటానికి.

“ఇన్ ద ప్రైమరీ లెవెల్... ఫస్ట్ స్టాండర్డ్ టు ఫిఫ్త్ స్టాండర్డ్ లెవెల్... ‘ద బెస్ట్ స్టూడెంట్స్ ఆఫ్ ది ఇయర్’ అవార్డ్ గోస్ టు స్టూడెంట్స్ ఆషా, నిషా... ఫస్ట్ స్టాండర్డ్” టీచర్ ఎనౌన్స్ చేసింది.

పెద్ద పెట్టున చప్పట్లు మారుమోగాయి.

“ఈసారి ఒక్క స్టూడెంట్ కాదు. ఇద్దరు బెస్ట్ స్టూడెంట్స్‌గా ఎన్నికయ్యారు. వాళ్లిద్దరూ ట్విన్ సిస్టర్స్ కావటం విశేషం. వెల్ కం టు ఆషా అండ్ నిషా ఆన్ టు ది డయాస్” మరోసారి ఎనౌన్స్ చేసింది ఆవిడ. మళ్లీ “ఐ రిక్వెస్ట్ మిస్టర్ రవిప్రకాశ్... ద డిస్ట్రిక్ట్ కలెక్టర్... టు గివ్ ద షీల్డ్స్ ఫర్ ద చిల్డ్రన్. అండ్ ఆల్సో వెల్‌కం టు ది పేరెంట్స్ ఆఫ్ ఆషా ఎండ్ నిషా...” చెప్పింది. అప్పటికే స్రవంతి చేతిని తన చేతితో మృదువుగా నొక్కి “థాంక్యూ!” గుసగుసగా అన్నాడు చైతన్య.

గాలిపటాల్లా... తల్లి పోయాక ఎటో... కాగితంముక్కల్లా కొట్టుకు పోవాల్సిన పిల్లలు ఈ రోజు ఇలా షీల్డ్స్ అందుకుంటున్నారంటే దానికి స్రవంతే ఖచ్చితమైన కారణం అని తెలుసు అతనికి.

సంతోషంగా స్టేజిపైకి నడిచారు చైతన్య, స్రవంతి, పిల్లలతోపాటు.

ఆ సంవత్సరం అసలైన దీపావళి వాళ్ల ఇంట్లోకి, జీవితాల్లోకి ప్రవేశించింది. ఇల్లంతా ప్రమిదలతో... మైసూరు ప్యాలెస్ లైట్లల్లో వెలిగినట్లుగా వెలగసాగింది.

"డాడీ... నేను ఫ్లవర్ పాట్ కాలుస్తా"

"డాడీ... నేను విష్ణుచక్రం" పిల్లలిద్దరూ మందు సామగ్రి ధైర్యంగా కాల్చసాగారు.

కాకరపువ్వొత్తులు కూడా కాల్చటానికి భయపడుతున్న స్రవంతిని... చైతన్య బలవంతంగా లాక్కెళ్లి... ఆమెని పొదివి పట్టుకుంటూ తన చేతితో ఆమె చేతిని పట్టుకుంటూ లక్ష్మీ ఔట్లు కాల్పించాడు.

చుట్టూ ఉన్న దీపాల్లోని వెలుగు వాళ్ల మోముల్లోకి చేరిందేమో అన్నట్లు వెలిగిపోసాగారు అందరూ.

10



మరో నెలకి ఓ తియ్యని వార్త చైతన్య చెవిన వేసింది స్రవంతి.

"మిమ్మల్నొక మాట అడగొచ్చా? " బెరుగ్గా అడిగింది అతన్ని.

"చెప్పు" ప్రశాంతంగా అన్నాడు.

తన మనసులోని మాట అతనికి చెప్పింది.

"కానీ... అక్క దీనికి ఒప్పుకోవద్దా...? " అడిగాడు.

"చూద్దాం" నమ్మకంతోనే చెప్పింది.

మరో ఆర్నెల్లు... ముందుకు పరిగెట్టింది కాలం. ఆకులు రాలి పచ్చని చిగుళ్లు తొడుక్కుంటున్నాయి చెట్లన్నీ.

"వివేక్ హాస్పిటల్స్... లేబర్ వార్డ్" లోపల గదిలో... స్రవంతి వుంది.

అక్కడ రూమ్ బయట వెయిటింగ్ హాల్లో రాఘవయ్య, జానకమ్మ... శివరాం, సునంద... నందిని, ఆమె భర్త అంతా ఎగ్జైటింగ్‌గా ఉన్నారు.

వాళ్లందరికీ ఓ పక్కగా, టెన్షన్‌తో అదురుతున్న ఫేస్‌తో ఉన్నాడు చైతన్య.

వసంతకి డెలివరీతోపాటు నర్వస్ వీక్‌నెస్ రావటం... మరో రెండేళ్లకు అది పూర్తిగా బయటపడి... జబ్బుగా మారటం అతనింకా మర్చిపోలేదు.

"సర్... మగబిడ్డ" బయటికొచ్చిన నర్స్ చెప్పింది.

అందరి మొహాల్లో సంతోషం. చైతన్య మొహంలో మాత్రం రిలీఫ్.

డెలివరీ రూమ్‌లోంచి వేరే గదికి మార్చారు స్రవంతిని, బాబుని.

అంతా ఆమె రూమ్‌లోనే వున్నారు. ఉయ్యాల్లో వున్న బాబుని చూసి ఎవరూ కళ్లు తిప్పుకోలేకపోతున్నారు. అంత ముద్దొస్తున్నాడు వాడు. ఆషా, నిషాలైతే మరీనూ... వాడి చిట్టి పాదాల్ని, చిన్న చేతుల్ని చూసి ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు.

నందిని అడిగింది తమ్ముణ్ణి "ఏరా... నీకు కొడుకుని కానుకగా ఇచ్చింది స్రవంతి. మరి నువ్వు ఏం గిఫ్ట్ ఇవ్వబోతున్నావ్ తనకి? " తమాషాగా అడిగింది.

"చాలా పెద్ద గిఫ్ట్ అక్కా" అన్నాడు.

"డైమండ్ సెట్టా? ప్లాటినం జ్యూయెలరీనా? " మళ్లీ అడిగింది.

"అంతకన్నా విలువైనది... తన దృష్టిలో కోహినూర్ వజ్రం" చెప్పాడు చైతన్య.

అంత విలువైనదా? అందరూ ఆశ్చర్యంగా చూశారు.

"ఇలా రారా నాన్నా" అప్పటివరకు

అందరి వెనుక నిలబడ్డ తరుణ్‌ని ముందుకు లాగుతూ పిలిచాడు చైతన్య. "కమలమ్మగారి దగ్గర్నించీ... అన్ని రకాల ఫామ్స్ ఫిలప్ చేసి తీసుకొచ్చాను. ఈ పని ఎప్పుడో చేయాల్సింది. ఇకనుంచీ వీడు పూర్తిగా మనకే సొంతం.. ఇదే నీకివ్వ బోయే గిఫ్ట్. నచ్చిందా?" అడిగాడు చైతన్య. అతని అభిమానానికి, తన మీదున్న ప్రేమకు కళ్లు చెమర్చాయి స్రవంతికి. తరుణ్‌ని దగ్గరకు లాక్కొని వాడి నుదుటి మీద చుంబించింది స్రవంతి.

చైతన్యవైపు చూస్తూ... "థాంక్స్" అంది సన్నగా.

"ఈ గిఫ్ట్ ఎవరమూ ఎక్స్‌పెక్ట్ చేయ లేదు బావా..." శివరాం చెప్పాడు తేలిక పడ్డ హృదయంతో. అతనికి తెలుసు... చెల్లెలు ఎన్నిసార్లు వాణ్ణి అనాథగా వుంచొద్దు అని అడిగిందో...

ఈ లోపు చైతన్య వైపు చూసి సైగ చేసింది స్రవంతి.

"ఓకే.." కళ్లతోనే చెప్పాడు.

లేచి దిండ్ల కానుకుని కూర్చుంటూ... "వదినా..." పిలిచింది.

నందిని ఆమె దగ్గరగా వచ్చింది.

"నేను ప్రెగ్నెంట్‌గా వున్నప్పుడే మేమి ద్దరం... ఓ డెసిషన్ తీస్కున్నాం. నన్ను వెతుక్కుంటూ మా ఇంటికి వచ్చి... నాకిం తటి చక్కటి జీవితాన్నిచ్చారు మీరు" ఆగింది.

మళ్లీ తనే... "వీడ్ని మీ కిచ్చెయ్యాలని.. మీ దగ్గర వీడు పెరగాలని.. మా కోరిక..." పొత్తిళ్లల్లో పసిబిడ్డని నందిని చేతికివ్వబోయింది స్రవంతి.

వాళ్లిద్దరి అభిమానానికి కళ్లలో నీళ్లు తిరిగాయి నందినికి.

ఎంతో గొప్ప గుణం వుంటే కానీ... కన్నబిడ్డని ఇతరులకు వదులుకోలేరు.

వాతావరణం గంభీరంగా అయిపోయి అందరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు.

"ఎందుకట...? నన్ను 'అమ్మా' అని పిలిస్తే... నిన్ను 'అత్తా' అని పిలవాలి. అయినా చైతన్యకి ఒక వారసుడు రావా లని వసంత కోరిక. దానికి నేను అడ్డు రాలేను. నీకు అభ్యంతరం లేకపోతే..." ఆగిపోయింది నందిని.

చెప్పమన్నట్లుగా చూసింది స్రవంతి.

"వీణ్ణి... వీణ్ణి నాకిచ్చేయ్" లోగొంతు కతో అడిగింది, తరుణ్ క్రాఫ్‌లో చేతివేళ్లు దూరుస్తూ.

స్రవంతికి మాటలు రాలేదు. ఆమె మౌనాన్ని చూసి...

"నాకు తెలుసు తరుణ్ అంటే నీకెంత ఇష్టమో" ముందుకు చెప్పలేక ఆగిపో యింది నందిని.

అప్పుడప్పుడూ వచ్చిపోతూ... తరుణ్‌ని చూసి ఇష్టం పెంచుకుంది నందిని మనసు లోనే. కానీ ఇన్నాళ్ల వరకూ... తమ్ముడు చేసినట్లుగా వాణ్ణి ఇంటికి తెచ్చేసుకోవాలనే ఆలోచన రాలేదు ఆమెకి.

"ఛా! ఛా! మీ దగ్గర వాడు పెరగబోతు న్నాడంటే వాడి అదృష్టానికి ఆశ్చర్యమేసి నోటమాట రాలేదు. అంతే వదినా..." సంతోషంగా చెప్పింది స్రవంతి.

"తరుణ్... మమ్మీ, డాడీ కావాలని అడి గేవాడివి కదా... ఇదిగో అమ్మా, నాన్న" నందిని వాళ్లవైపు చూపిస్తూ చెప్పింది స్రవంతి.

"నిజ్జంగా..." వత్తి పలుకుతూ అడి గాడు.

"నిజ్జంగానే... ఏదీ పిలువ్ ఓసారి" అడి గింది స్రవంతి.

"అమ్మా...! డాడీ...!" వాళ్లిద్దరినీ వేలితో టచ్‌చేసి సంభ్రమంగా చూస్తూ చెప్పాడు వాడు.

"థాంక్స్ స్రవంతి!" ఆనందంగా చెప్పింది నందిని.

అందరూ అంత ఆహ్లాదంగా వున్న వేళ... గస పెట్టుకుంటూ లోపలికి వచ్చాడు రవి, చేతిలో ఏదో కవర్‌తో.

అలాగే ఎగరొప్పుతో... స్రవంతి ఒడిలో నిద్రపోతున్న బాబుని చూశాడు.

"అక్కా! బాబు చాలా ముద్దొస్తున్నాడు. ఎంత ముద్దొస్తున్నాడంటే.. ఏదీ నీ దోసిలి పట్టు..." అడిగాడు. చాచిన దోసిట్లో తను తెచ్చిన తెల్లని పొగడపూలు పోశాడు కుప్పగా. "ఇంత" చెప్పాడు నవ్వుతూ.

స్రవంతికి ఆ పూలంటే ఎంతిష్టమో వాడికి తెలుసు.

వాడి వైపు చూసి చిరునవ్వు నవ్వింది స్రవంతి.

"స్రవంతి అక్కా! బాబు పేరేమిటి? " అడిగాడు తరుణ్.

వాడికీ మధ్య కరెక్ట్‌గా పిలవటం వచ్చేస్తోంది.

"ఇంక ఇప్పుడు అక్కా అని కాదు నాన్న... అత్తా అనాలి. బాబు పేరు వసంత్" వాడికి చెపుతూ... అంతే కదూ... అన్నట్లు చూసింది నందిని.

"అక్కా! బాబు చాలా ముద్దొస్తున్నాడు.ఎంత ముద్దొస్తున్నాడంటే.. ఏదీ నీ దోసిలి పట్టు..." అడిగాడు. చాచిన దోసిట్లో తను తెచ్చిన తెల్లని పొగడపూలు పోశాడు కుప్పగా. "ఇంత" చెప్పాడు నవ్వుతూ. స్రవంతికి ఆ పూలంటే ఎంతిష్టమో వాడికి తెలుసు.

అవునన్నట్లు తలాడించింది స్రవంతి.

"ఇక నుంచీ... ఆషా, నిషాలు కూడా నీ అత్త కూతుళ్లే... ఏరా? ఎవర్ని చేసుకుంటావ్? " తమాషాగా అడిగింది జానకమ్మ.

"ఇద్దర్నీ... ఇద్దరూ కావాలి" గట్టిగా చెప్పాడు తరుణ్.

ఆవిడ అడిగినదానికి అర్థం తెలీకపోయినా, ఆడుకోవటానికి ఇద్దరూ కావాలి కదా అనే ఊహ వాడిది. వాడి మాటలకు అందరూ ఒక్కసారిగా నవ్వారు.

"మే ఐ కమిన్..? ఎక్స్‌క్యూజ్ మి..." అనే మాటలు వినిపించటంతో అందరూ అటు తిరిగి చూశారు.

"హేయ్ ...వినయ్..." అతన్ని చూడగానే ఒక్కసారిగా చైతన్యలో ఆనందం. ఉవ్వెత్తున ఎగసిపడే ఉత్సాహం.

"థ్యాంక్ గాడ్... గుర్తుపట్టావు" చైతన్యను ఆలింగనం చేసుకుంటూ అన్నాడు వినయ్.

"ఇండియాకి ఎప్పుడు వచ్చావు? " సంభ్రమంగా అడిగాడు చైతన్య.

"నిన్న ఉదయమే. రావటమే సరాసరి ఇటు వచ్చేశాను. బాగున్నావా అత్తయ్యా ? " జానకమ్మను పలకరిస్తూ అడిగాడు.

"ఆ నువ్వెలా వున్నావు? నీ భార్య ఖ్యాతి... పాప...? " అడిగింది ఆవిడ.

"అంతా మా ఊర్లోనే ఉన్నారు. నేనొక్కణ్ణే ప్రస్తుతం ఇలా వచ్చాను. ఇంటి దగ్గర అడిగితే మీరంతా ఈ హాస్పటల్ కి వచ్చారని తెలిసింది. అందుకని కంగారుపడి... హడావిడిగా వచ్చాను"

అతను పెళ్ళైన తర్వాత న్యూయార్కులో జాబ్ చూసుకుని, అక్కడే సెటిల్ అయ్యాడు. భార్య ఖ్యాతి, ఆరేళ్ల కూతురు ఖుషి అతని ఫ్యామిలీ. చైతన్యతో కాంటాక్ట్స్ నిదానంగా తగ్గిపోయినా, జానకమ్మ వాళ్లతో అప్పుడప్పుడు ఫోనులో

మాట్లాడుతుండటం వల్ల... స్రవంతి జీవితం... ఆమెకు చైతన్యతో వివాహం... వాళ్లు చెప్పినదాన్ని బట్టి అతను తన ఫ్రెండ్ కృష్ణచైతన్య కావచ్చేమో అని గెస్సింగ్ ఉంది అతనికి ఇన్నాళ్లుగా.

ఇప్పుడు కళ్ళారా చూశాడు.

"ఊс... హ్యాపీనా? " అడిగాడు వినయ్, చైతన్య కొడుకుని చూశాక.

"ఊ..." నవ్వుతూ తలవూపాడు.

"ఫీల్ ద హ్యాపీనెస్ కంప్లీట్లీ. టచ్ యువర్ హార్ట్ స్రవంతి వుందా అక్కడ? సే వావ్... " అన్నాడు వినయ్. చిన్నగా నవ్వుతూ "వావ్"అన్నాడు చైతన్య.

అందరూ వాళ్ళిద్దరి వైపు నవ్వుతూ చూస్తున్నారు... సరిగ్గా ఏమీ అర్థంకాక.

ఆషా, నిషాలిద్దరూ స్రవంతికి ఎదురు బెడ్‌మీద కూర్చున్న చైతన్య భుజాలపై వాలిపోయి ఉన్నారు. అతని పెదాలపై నవ్వు విరబూయటంతో మరింత అందంగా కనిపిస్తున్నాడు. అతని పక్కనే వినయ్, మరోపక్క శివరాం సునంద కూర్చొని ఉన్నారు పిల్లలతో. ఇంకోపక్క చెయిర్స్‌లో రాఘవయ్య, జానకమ్మ, నందిని ఆమె భర్త ఉన్నారు. నందిని ఒళ్ళో తరుణ్... మరోపక్క గోడకానుకుని రవి... అందరూ నవ్వుతూ కనిపించారు స్రవంతికి.

ఒళ్ళో పసిబిడ్డ, చేతుల్లోని దోసిళ్ళనిండా తెల్లని పొడవైన పొగడపూలు, చుట్టూ తన వాళ్ళంతా ఆనందంగా ఉండటం... వాళ్ళ మొహాల్లోని సంతోషం తన దోసిట్లోకి వచ్చి ఇలా తెల్లని పువ్వుల్లా నిండిపోయి... ఆ సుగంధం తన జీవితమంతా ఇలాగే పరిమళించాలి అనుకుంది స్రవంతి. ★

కొత్త వ్యంగ్య శీర్షిక ప్రారంభం!

# రివర్ & రివర్స్




వారణాసి రామకృష్ణ

పాదాచార్యులు అనగా రోడ్లమీద నడిచే వాళ్లు- కీపు లెఫ్టు ఫాలో కాకుండా, రైటే రైటనుకుని, రైట్ సైడే నడిస్తే వాహనాలు ఎదురుగా కనిపిస్తాయి... కనుక ప్రమాదాలు తగ్గుతాయని ఓ నేత లోగడ రివర్సు ఫార్ములా చెప్పాడు. ఆలోచిస్తే ఆహా! మహత్తరమైన ఫికర్ లేని రివర్సు ట్రాఫిక్ రూల్ చెప్పాడండీ అని మా కాలనీ నేతతో అనేసరికి అతగాడు రెచ్చిపోయి, ఇదేం రివర్సు ఫార్ములా నా బొంద! నా దగ్గర దీని బాబులాంటి రివర్సులున్నాయి. అసలు రివరుకే రివర్సు చెప్తా వినండి అంటూ వీరబాదుడిలా బాదేడు! మన నోట్లో మట్టికొట్టి కర్ణాటక వాడు ఆల్మట్టి డ్యామ్మీద రివర్ ఎత్తు పెంచేడు. ఇక మహాదేశ ముదురు మహారాష్ట్రవాడు బాబ్లీ పేరిట మన నీళ్ళన్నీ వెనక్కిలాగే గుగ్లీ బౌలింగ్ చేస్తున్నాడు. ఇక్కడ మన నేతలు గడ్డివాముల దగ్గర నిలబడి గుడ్డి వాళ్ళకి డ్రీముల మీద డ్రీములు చూపి భూములు భోంచేస్తూ జనాన్ని ఐస్‌చేస్తూ వాళ్ళు మాత్రం ఐస్ క్రీంలు లాగించేస్తున్నారు. అవునా? ఇది మన కళ్ళల్లో మన గుంటూరు గొడ్డుకారం కొట్టినట్టేనా? అని ప్రశ్నిస్తే మీరంతా సవాలక్ష మందితో బాటు అవునవునంటూ బుర్రకాయలూపుతారు. కానీ నేను మాత్రం రివర్సులో బాడీ మొత్తం వూపి వోరి పిచ్చోళ్ళారా! మీ ఆలోచనల్లోనే తప్పుంది! ఆల్మట్టి మీద మట్టి చల్లటం తప్ప, బాబ్లీని చూసి బాబిగాడిలా గంతులెయ్యటం తప్ప రివర్ యవ్వారాలని రివర్స్‌లోనే టాకిల్ చెయ్యటం చాతకావట్లేదంటా! వరల్డులో ఎత్తయినది ఎవరెస్టు కాదు, ఆల్మట్టి డ్యామ్ అని చెప్పేంతగా ఇంకా ఇంకా ఎత్తు పెంచమంటా! ఇక బాబ్లీ తరహాలో బబ్లూ అని మరో ప్రాజెక్టు ప్రారంభించమని మహారాష్ట్ర వాడికి విజ్ఞప్తి చేస్తా! అప్పుడేమౌతోంది? ఎంచక్కా నాటక కర్నాటకా అండమాన్ దీవి అవుతుంది. ఇటు మహారాష్ట్ర మహాసాగరమౌతుంది. ఆ రెండు స్టేట్లూ మొత్తం నీళ్ళల్లో ఉంటాయి. ఇక ఇక్కడ మన సంగతి చూద్దాం. నీళ్ళు లేక మన డ్యాములన్నీ ధామ్మని ఎండిపోతాయి. దాంతో బోలెడంత భూమి బైట పడుతుంది. భూవైశాల్యం పెరుగుతుంది. అప్పుడు చక్కగా క్యాచ్‌మెంట్ ఏరియాని క్యాచ్‌చేసి ఎకరాలకెకరాలు ఎస్ఇజెడ్‌ల కమ్మి క్యాష్ చేస్కోవచ్చు. ఇక నీళ్ళే లేవు కనుక వ్యవసాయం లేదు. వ్యవసాయం ఎప్పుడైతే లేదో ఆత్మహత్యలు, కరెంటు కోతా రెండూ లేవు. కృత్రిమ ఎరువుల బాధ లేదు. నకిలీ విత్తనాల బెడదలేదు. బక్కచిక్కిన రైతన్న పొలం దుక్కిదున్నే పనేలేదు గనుక దుక్కలా ఎంచక్కా కూలింగ్ గ్లాసులు పెట్టుకుని వొపెల్ ఆస్ట్రా కారులోంచి దిగొచ్చు! ప్లాట్లు అమ్మిన డబ్బుతో జల్సాలైఫ్ ఎంజాయ్ చెయ్యొచ్చు! పైగా డ్యాముల క్రింద పురాతన వస్తువులు

గుళ్ళు గోపురాలు వెలికి వస్తాయి కనక మ్యూజియంలు పెట్టొచ్చు. శ్రీశైలం డ్యాం స్థలంలో ఐటి, నాగార్జున డ్యామ్ ఏరియాల్లో బీటి పార్కులు పెట్టొచ్చు. ఐటి, బిటి తర్వాత ముఖ్యమైంది టీటి! అనగా ట్రావెల్ అండ్ టూరిజం. మార్క్సిజం, సోషలిజం కాదు, ఇప్పుడు కావాల్సింది టూరిజం! అవును! సాగర్ కాల్వగట్లల్లో, బంకింగ్ హామ్ కెనాల్లో, పులికాట్ సరస్సు ప్రాంతంలో పబ్ లు, ఫుడ్ కోర్టులు డిస్కోథెక్ లు, రిసార్టులు పెట్టొచ్చు. ఫారినర్లు కుప్పలు తెప్పలుగా రావటంతో బిలియన్ డాలర్ల బిజినెస్ జరుగుతుంది. ఆ దెబ్బకి అనవసరంగా నీళ్ళని నిల్వచేసి కొంప కొల్లేరు చేస్తున్నా మన్న జ్ఞానం అటు కర్నాటకా వాడికి ఇటు మహారాష్ట్రుడికి వస్తుంది! ఆహా! ఆంధ్రా వాడంత లోతయిన తెలివి మనకు లేకపో యిందేనని గుండెలు బాదుకొంటాడు. దాంతో బోటేసుకుని వచ్చి మనల్నే వాటే సుకుంటాడు. మాక్కాస్త భూభాగం ఇవ్వ వయ్యా బాబూ! అని బావురుమంటాడు. అప్పుడు మనం హొడ్డునే తెప్పల్ని ఆపేసి తప్పయిపోయింది ఒప్పేసుకొమ్మని బార్గెయినింగ్ కి దిగుతాం! ఫ్రీగా వాటరు వదిలితేనే గడ్డమీద కాలు పెట్టనిస్తామని, లేకపోతే గడ్డుకాలమేనని చెప్తాం! కొల్లేటి కాపురం చేస్కోమని కూల్ గా అంటాం. పాపం జలచరాల్లా నీళ్ళల్లో ఎన్నాళ్ళుంటారు. మన షరతులు ఒప్పు కుని దారికొస్తారు. ఆహాహా గుర్రాన్ని ముందు నుంచి వీలు కాకపోతే రివర్సులో స్వారీ చెయ్యమని ఏనాడో వేదాల్లో ఉన్నాయి! అహహా!

కాలనీ జనం ఆయన వాక్ప్రవాహంలో తడిసి ముద్దయి గజగజా వణుకుతూ చప్పట్లు కొట్టేరు. ఇదేంటి? ఇంతమంది ఈ రివర్సుని మెచ్చుకుంటున్నారని హాశ్చ ర్యపోతూ మేమూ చప్పట్లు కొట్టేం. బేవార్సుగా ఇలా ఆలోచించే వాళ్ళుండబట్టే, జాతీయ స్థాయిలో సమగ్రంగా ఆలోచించే నేతలు లేకపోవడమే ప్రస్తుత పతనానికి అసలు కారణం.

అన్నట్టు హైద్రాబ్యాడ్ లో కొందరు ఆటో వాళ్ళు రివర్సు! అనగా మనం రాంనగర్ గుండు వొస్తావా అంటే నామాల గుండు



కయితే వస్తానంటాడు. నాంపల్లి కంటే కూకట్‌పల్లికి పోదాం సార్ అని. గండి పేట అని మనం అంటే బడంగ్‌పేట పోదామనీ- ఈ టైపులో రివర్సు చెప్తారు. కానీ మనం వెళ్ళాల్సిన చోటుకి మాత్రం ససేమిరా అంటారు. అందుకనే మా దోస్తు ఆటోవాళ్ళతో ఎక్కడి కెళ్ళాలో చెప్ప కుండా అతనెక్కడి కెళ్తున్నాడో రివర్సులో కనుక్కొని మరీ ఆటో ఎక్కుతుంటాడు.

పత్రికల్లో యాడ్స్ - అంటే 'మా కంపెనీ మందు వాడండి! ఒంట్లో కొవ్వు కరిగించుకోండి' అంటూ - మందు వాడక ముందు- ఓ లావుపాటి సుమో ఆంటీ ఫొటో వేసి, పక్కనే మందు వాడాక అంటూ- రివర్సు సైజులో సన్నగా రివటలా నాజుకు మెరుపు తీగలాంటి కత్రినా కైఫ్ టైపులో కత్తిలాంటి పిల్ల ఫొటో ప్రచురిస్తుంటారు! ఈ టైపు ప్రకటన వొకటి చూడగానే మా కాలనీ తికమకరావు నారాయణమూర్తి టైపులో గుడ్లెర్రజేసి ఆవేశంతో 'ఈ అన్యాయాన్ని అరికడతా చూడు గురూ!' అని రంకె వేశాడు. తర్వాతో పత్రికలో చేరి పథకం ప్రకారం ప్రకటన ప్రింటయ్యే ఆఖరి క్షణంలో ఫొటోలు రివర్సు చేశాడు. అప్పుడా యాడ్ అయిందిలా - 'ఎల్లప్పుడూ మా దంతవజన్ టూత్ పౌడర్నే వాడండి!' అని మొదట టూత్‌పౌడరు వాడక ముందు అంటూ దంతాలు మిలమిలా మెరిసే దంతసుందరి ఫొటో, పక్కనే పౌడరు వాడాక అంటూ - తొర్రిపళ్ళు, పుచ్చిపళ్ళతో పరమ అసయ్యంగా ఎత్తు పళ్ళు బైటపెట్టి వెక్కిరిస్తూ నవ్వుతున్న పరమ వికార మంజరి ఫొటో వేశారు. ఆ దెబ్బకి పాపం టూత్ పౌడర్ కంపెనీవాడు షట్టర్లు దించేశాడు! 'ఇలా చేసేవెందుకు రా!' అని తికమకరావు నడిగితే పకపకమని నవ్వి- నల్లగా గారపట్టిన చండాలమైన తన దంతాలు చూపి 'నాతో పెట్టుకోకు బే!' అన్నాడు జనాంతికంగా!

ఇంకొన్ని రివర్సు కేసులు మనకి కోపం తెప్పించి మన పళ్ళు మనమే నూరుకునేలా చేస్తాయి. మచ్చుకి ఓ ఛానెల్‌లో ఓ న్యూసు రీడరు - టీవీలో న్యూసు చదువుతూ ఉన్నట్టుండి ఆనందంగా, సంతోషంగా పరవళ్ళు తొక్కే గొంతుపెట్టి- "ప్రముఖ స్వాతంత్ర్యయోధుడు, సోషలిస్టు నేత శ్రీవెలగపండు వేంకట అప్పన్నగారు-" అని ఆపేస్తాడు. మనం సదరు పెద్దాయనకి ఏ అవార్డో, రివార్డో వచ్చిందిలే- సంతోషం! అనుకుంటాం! కానీ కాదు! ఈ న్యూసురీడరు గొంతు తగ్గించి - "అర్ధరాత్రి! గుండెపోటుతో పోయాడు" అని చావు కబురు చల్లగా దీర్ఘం తీసి చెప్తాడు. ఓర్నీ! అనుకుని మనం తేరుకునేలోగానే పాజ్ కూడా ఇవ్వకుండా న్యూసురీడరు ఫేసు మార్చేసి విషాదంగా పెట్టి గంభీరమైన గొంతుతో, వణికే స్వరంతో- "సుప్రసిద్ధ సాహితీవేత్త, కాళిదాసు బహుమతి గ్రహీత, కళాప్రపూర్ణ- " అనగానే మనం తుళ్ళిపడతాం! అప్రయత్నంగా సోఫాలోంచి లేచి కూర్చుంటాం! అరెరె! ఈయనా పోయాడా? పాపం ఎలా పోయాడో! మనసు మూలుగుతుంది! బీపీ రైజవుతుంది! ఈలోగా న్యూసురీడరు "...గారికి ఫలానా అవార్డు ప్రకటించారు!" అని నిదానంగా చెపుతాడు. వోరి నీ కొంప గూల! ఎంతలా భయపెట్టావురా! నరక యాతన పెట్టావు కదరా! ఈ టైపులో, మనలో రివర్సు భావాలు చెలరేగి పళ్ళు నూరుకుంటాం!

టాకో, జోకో మనకి తెల్వదుకానీ చానెళ్ళ కిందట లాలూ - బుష్‌లిద్దరూ భేటీ అయినప్పుడు బుష్ ఇలా అన్నాట్ట, "యూ సీ మిస్టర్ లాలూ! మీ వైఫ్ రబ్రీ నుండి పవరు పీకి బీహారు స్టేట్‌ని మా




అమెర్కా చేతిలో పెట్టుండి! ఆరేళ్ళలో మీ బీహార్‌ని అమెర్కాలా చేస్తాం!" దీనికి లాలూ తాపీగా ఆలూ సమోసా తింటూనే- "డియర్ బుష్! ఈ ప్రతిపాదన కంటే మీ అమెర్కాకే నన్ను ప్రెసిడెంటుని చెయ్యండి! ఆరేళ్ళెందుకూ- దండగ! ఆర్నెల్లల్లోనే నేనే మీ అమెర్కాని బీహార్‌గా మార్చేస్తా" అని రివర్సులో కొట్టి నవ్వాడుట!

సివరాకరిగా - ఈ మధ్య మూన్ మీద ప్లాట్లని చాలామంది ఎగబడి బుక్ చేస్తున్నారని తెలిసి నేనూ వీనస్ అనగా శుక్రుడి మీద ప్లాట్ల బిజినెస్ స్టార్ట్ చేశాను! అసలిసియం ఏంటంటే - వీనస్ మీద యితే భూమికి రివర్సుగా వ్యవహారాలు నడుస్తుంటాయి. అంచేత రివర్సుగా ఆలోచించేవాళ్ళంతా వెంటనే వంద అమెర్కా డాలర్లు పంపి వీనస్‌లో వందగజాలు బుక్ చేస్కోండి! తోటి రచయితలకి, సాటి కవయిత్రులకీ సెపరేటు రివర్సు రేటు ఫిక్స్ చేశాను. ఎందుకంటే- పొద్దున్నే కాగితం, కలం పుచ్చుకుని పశ్చిమ దిశకి తిరిగి సూర్యుడ్ని చూస్తూ- "పశ్చిమాన ఉషోదయం! తూర్పున రవి అస్తమయం! అంటూ ఎంచక్కా వీరావేశంగా రివర్సు తవికలు రాసుకోవచ్చు! వెంటనే బుక్ చేస్కోండి! ఆలస్యం అమృతం విషం - సారీ రివర్సుకదా! శీఘ్రం విషం అమృతం!! ఇక ఇంతకన్నా మరో ముక్క ఎక్కువ రాస్తే పాఠకులంతా నాకు రివర్సు అయ్యే ప్రమాదం ఉంది! ఈ నెలకి ఆపేస్తానేం? ★

**చతుర సమీక్ష** | **జులై నవల 'పొగడపూల దోసిలి'**

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు: ______________________

చిరునామా: ______________________

______________________

______________________

(జులై 20వ తేదీలోపు సమీక్షలు మాకు అందాలి)



# వాస్తవానికి కల్పన జోడిస్తేనే కథ

**అప్పుడైనా... ఇప్పుడైనా... రచనకు ఓ సామాజిక ప్రయోజనం ఉండాలన్నదే నా ధ్యేయం. దానికి కట్టుబడే రచనలు చేయాలన్నది నా ప్రయత్నం.**

**- డి. కామేశ్వరి.**

## కథ వెనుక కథ

కన్నీటి విలువెంత అని ప్రశ్నించిన కామేశ్వరి 1962 నుంచి దాదాపు మూడు వందల కథలు, ఇరవై నవలలు, ఒక యాత్రావర్ణన(ట్రావెలాగ్) రాశారు. తొమ్మిది కథాసంపుటాలు ప్రచురించారు. న్యాయం కావాలి, కోరికలే గుర్రాలైతే... సినిమాలుగా వచ్చి ప్రేక్షకాదరణ పొందాయి. కొన్ని కథలు టీవీ సీరియల్స్‌గా, ఎన్నో కథలు రేడియో నాటికలుగా వచ్చాయి. పలు భాషల్లోకి తర్జుమా కూడా అయ్యాయి. గృహలక్ష్మి స్వర్ణకంకణం, మద్రాసు తెలుగు అకాడమీ అవార్డు, తెలుగు యూనివర్సిటి సాహిత్య పురస్కారాలు... తదితర అవార్డులెన్నో అందుకున్న కామేశ్వరి న్యాయం కావాలి సినిమా కథకి ఉత్తమ కథగా ఐదు అవార్డులు గెలుచుకున్నారు. ఎన్ని రాసినా కథ రాయడం, చదవడమే తన తొలి ఇష్టాలంటారామె.

వైద్య రంగంలో చోటు చేసుకుంటున్న వ్యాపార ధోరణిని ముప్పై ఐదేళ్ల క్రితమే గమనించి రాసిన ఆమె కథ 'కన్నీటికి విలువెంత?' ఒక వారపత్రికలో ప్రచురితమై ప్రశంసలందుకుంది. కొంత తన అనుభవం, కొంత పరిశీలన... వెరసి ఈ కథకి ప్రేరణ అయ్యాయన్నారు కామేశ్వరి. వాస్తవానికి కల్పన జోడించినప్పుడే కథగా మారుతుందనే కామేశ్వరి తన అనుభవాన్ని ఇలా వివరించారు.

ఇదీ ఆ కథ వెనక కథ.

'నేను రెండోసారి గర్భిణిగా ఉన్నప్పుడు తొలిదశ నుంచీ కొంచెం సమస్యలు మొదలయ్యాయి. అందుకని చికిత్స తీసుకుంటూ ఉండేదాన్ని. ఏడో నెల వచ్చాక మామూలు చెకప్‌కి డాక్టరు దగ్గరకు వెళ్లాను. ఆమె పరీక్షిస్తూ నొప్పులేమన్నా ఉన్నాయా అనడిగింది. లేదన్నాను. బిడ్డ బాగా కిందకి దిగింది... నొప్పులొస్తే పురుడొచ్చేలా ఉంది... అంది. గాభరాపడ్డాను. ఏడోనెలలోనే పురుడంటుందేమిటని భయం వేసింది. ఆవిడ 'భయం లేదులే. నొప్పులొస్తే ముందే చెప్పు. మందులు, ఇంజెక్షన్లు రాసిస్తాను. గాభరా పడవద్దు. బెడ్‌రెస్ట్ తీసుకో. వారానికి రెండు ఇంజెక్షన్లు చేయించుకోవాలి. ఇక్కడికే రా. మేం ఎప్పటికప్పుడు పరిస్థితి చూడడానికి వీలవుతుంది...' అంది. నాకేమీ అర్థం కాలేదు. ఓ పక్క బెడ్‌రెస్టంటూ మరో పక్క వారానికి రెండు సార్లు రిక్షాలో ఇంతదూరం ఇంజెక్షన్‌కి రమ్మంటుందేమిటనుకున్నాను. ఇంటికొచ్చి చెప్తే నాన్న మరో డాక్టర్ని సంప్రదిద్దామంటూ ప్రభుత్వ ఆస్పత్రికి తీసుకెళ్లారు. ఆయన ప్రభుత్వాధికారి కాబట్టి ఆ ఆస్పత్రిలో వైద్యులు చాలా బాగా చూశారు. పరీక్షలన్నీ చేశారు.

'అంతా సవ్యంగా ఉంది. పురుడొచ్చే ప్రమాదం ఏమీలేద'ని తేల్చారు. నెలలు నిండాకే సుఖప్రసవం జరిగింది. ఇదంతా జరిగినప్పుడు నేను రచయిత్రిని కాను. మామూలు గృహిణిని. పురుడు పోసుకోవడానికి పుట్టింటికి వచ్చిన వనితను. కానీ జరిగిందంతా నా మనసులో అలా గుర్తుండిపోయింది. తర్వాత ఆరేడేళ్లకు రచయిత్రినయ్యాను. మరో సందర్భంలో ఇంకో ఆస్పత్రిలో ఒక శస్త్రచికిత్స కోసం చేరినప్పుడు అక్కడ బీద, గొప్ప పేషెంట్ల మధ్య తేడాలు చూపే డాక్టర్లు, నర్సులను చూశాను. ఈ రెండు సంఘటనలు కలగలిపి మానవత్వంలేని ఓ డాక్టర్ని, ఓ పేద కారుడ్రైవరు పాత్రల్ని సృష్టించి కథ అల్లాను.

'కన్నీటికి విలువెంత?' కథలో డాక్టరు సరోజిని పెద్ద నర్సింగ్ హోమ్ కట్టి డబ్బు సంపాదనే ధ్యేయంగా బతికే గైనకాలజిస్టు. ఆ ఊర్లో గొప్ప ఆస్పత్రి ఆమెదే, గొప్ప డాక్టరు ఆమే కావడంతో ధనికులంతా అక్కడికే వచ్చేవారు. అలా వచ్చే పేషెంట్ల హోదాని బట్టి ఫీజులు వసూలు చేసేది. అమ్మాయిలు నొప్పులు పడుతుంటే తానే బాధపడిపోతూ పిల్ల ఇక తట్టుకోలేదు... సిజేరియన్ చేసేస్తానంటూ ప్రేమ నటించి, అసలు నొప్పులు రాకముందే డబ్బుకోసం సిజేరియన్లు చేస్తుంది. చిన్న చిన్న సమస్యలతో వచ్చేవారికి లేనిపోనివి చెప్పి భయపెట్టి అనవసరంగా ఇంజెక్షన్లు, డి అండ్ సిలు చేస్తూ వీలయినంత సంపాదించడమే ఆమె ధ్యేయం. ఆమె ఇలా సంపాదనలో మునిగితే మరో పక్క ఆమె భర్త క్లబ్బుల వెంట తిరుగుతూ భార్య సంపాదన తగలేస్తూ ఉంటాడు. పిల్లలిద్దరూ కూడా బాధ్యతారహితంగా ప్రవర్తించేవారు కావటంతో ఆమెకు సంపాదన అవసరం రోజురోజుకూ పెరుగుతూనే ఉంటుంది.

ఆమె కారు డ్రైవరు భార్య మూడుసార్లు గర్భంలో బిడ్డను కోల్పోయి ఎంతో బాధలో ఉంటుంది. నాలుగోసారి గర్భం దాల్చడంతో ఈసారి మంచి పేరున్న తమ యజమానురాలి ఆస్పత్రిలో భార్యకు పురుడు పోయించాలనుకుంటాడు. అతని భార్య ఆస్పత్రిలో చేరిన రోజే మరో ధనవంతుల కుమార్తె కూడా చేరుతుంది. ఒకేసమయంలో ఇద్దరికీ నొప్పులు రావడంతో పక్క పక్క పడకల మీద ఉంటారు. వారిని చూడడంలో డాక్టరు, నర్సు కనబరిచే తేడా చూస్తే డబ్బు విలువ అర్థమవుతుంది. సంపన్నుల కుమార్తెకు మృతశిశువు పుడితే, కారు డ్రైవరుకి ఆరోగ్యకరమైన బిడ్డ పుడతాడు. కానీ బిడ్డ చనిపోతే సంపన్నుల నుంచీ ఎక్కువ ఫీజు వసూలు చేయడం వీలు కాదు కాబట్టి, కారు డ్రైవరు ఎలాగూ ఎక్కువ డబ్బు ఇచ్చుకోలేడు కాబట్టి... బిడ్డల్ని తారుమారు చేస్తుంది డాక్టరు. ఈసారీ బిడ్డ దక్కలేదని హృదయవిదారకంగా బాధ పడతారు కారు డ్రైవరు, అతని భార్య. ఇటు సంపన్నుల కుమార్తెకేమో బిడ్డ బరువైపోతాడు. పెళ్లి కాకముందే గర్భవతి అయిన ఆమె బిడ్డను అనాథాశ్రమంలో వదిలేసి తాను మళ్లీ పెళ్లి చేసుకోవాలనుకుంటుంది. ఈ సంగతి విని నిర్ఘాంతపోవడం డాక్టరు వంతవుతుంది. నోట మాట రాక బయటకు వస్తుండగా అక్కడ కన్నీళ్లతో కన్పించిన కారుడ్రైవర్ని చూసి ఆమె కళ్లు చెమరుస్తాయి.

ఇదీ కథ. అవసరం ఉన్నా లేకపోయినా రకరకాల పరీక్షలు చేసేసి పేషెంటుని కంగారుపెట్టడం, అవసరంలేని ఆపరేషన్లు చేయడం... ఈరోజు మనం చూస్తూనే ఉన్నాం. ఇదే పరిస్థితిని ముందే ఊహించి మూడున్నర దశాబ్దాల క్రితం రాసిన కథ ఇది. చాలామందిని కదిలించింది. మంచి కథగా ప్రశంసలు పొందింది' అని చెప్పారు కామేశ్వరి.

సేకరణ : పద్మశ్రీ యలమంచిలి ✦

## మే చతుర నవల 'ఆకుపచ్చని గాయం' పై

### అడవి బిడ్డల బతుకుటద్దం

రూ. 100/- పొందిన సమీక్ష




ఓ కన్నతల్లి కడుపుతీపి తన తనయుడు ఈ దుర్వ్యవస్థకి దూరంగా మరో నవ జీవనానికి అంకితం కావాలనే ఆశతో ఒంటరిగా అడవి దాటించడం, అతడే పెరిగి పెద్దై ఉన్నత విద్యనార్జించి తన జాతి బాగు కోసం, తల్లి కోసం అడవికి రావడం, తన వాళ్ళ కన్నీళ్ళు తుడిచి వారిలో చైతన్యం కలుగజేసిన వైనమే ఆకుపచ్చని గాయం. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపీ గరీయసీ' అన్నట్లు తల్లిని, పుట్టిన నేలను మరువక, ప్రేమించిన భార్యను వదలి తన వారి క్షేమం కోసం తన జీవితాన్నే ధారపోసిన 'వీర' యువతకు ఆదర్శప్రాయుడు. అధికారం చేజిక్కగానే స్వార్థంతో కన్నతల్లినే మరిచి తన జాతి వారిని చిత్రహింసలపాలు జేసిన అలల సుందరం లాంటి నాయకులు ఈ సంఘంలో ఎంత మందో!... అడవితల్లినే ఆసరాగా తమ జీవనాన్ని సాగిస్తూ ఎవరికీ హాని తలపెట్టని నిస్వార్థ చెంచుల్లాంటి తెగలు అటు 'అన్న'ల్లో కలవలేక ఇటు పోలీసుల జులుం భరించలేక దినదినగండంగా మృత్యువు ఒడిలో ఒదిగిపోవడం ఏ జీవికీ రాకూడని దురవస్థ. తాను పెట్టదు స్వతంత్రంగా బతుకనీయదన్నట్టు పునరావాసానికి వనవాసం వీడి జనవాసానికి తరలివస్తే ఏలినవారు ఎల్లవేళలా ఆదుకుంటారనే గ్యారంటీ ఏముంది? శవాలపై మరమరాలు ఏరుకునే నాయకులు తుచ్ఛమైన స్వల్పలాభం కోసం స్వజాతినే నాశనం చేయడానికి పూనుకోవడం మృగత్వం, మూర్ఖత్వం అనేలా సాగిందీ నవల. వీర, మోహినీ సెక్స్ ప్రధానంగా స్నేహం చేయడం కాకుండా హుందాగా ప్రవర్తిస్తే నవలకి మరింత వన్నె వచ్చేది. మోహిని పాత్ర అర్థాంతరంగా గుర్తింపు లేని వ్యక్తిగా ముగిసిపోయింది. పెదమంతయ్య, ఉడుముల బయ్యన్న పాత్రలు ఆ జాతికే తలమానికం. విషయం బాగున్నా కథనం కాస్త బోరు కొట్టించింది. నవలాసాంతం ఆటవిక జాతి జీవన విధానం, వారి సంస్కృతి, అధికారులు, పాలకుల చేతుల్లో అడుగడుగునా ఎదుర్కొనే వారి కష్టనష్టాలు కళ్ళకు కట్టినట్టు వ్యక్తీకరించడం చాలా బాగుంది. సామాజిక స్పృహ ఉన్న ఈ నవలకి బహుమతినివ్వడం హర్షదాయకం.

**–అవుసలి ఆంజనేయులు, మూసాపేట**

### అందమైన విశ్లేషణ

రూ. 75/- పొందిన సమీక్ష

ఆకుపచ్చని గాయమే ఓ అందమైన విశ్లేషణ. సింబాలిక్‌గా పచ్చని ఆకుల్లో ఓ ఎర్రని పూవు మోహిని. పచ్చని అడవిలో ఎర్రగా మండుతున్న చెంచుల బతుకులు, ఆ చిగురుపాలు జీవితాల్లో రక్తపుటేరులు! మార్క్సని చదువుకున్న వీర అనే యువకుడు తనవాళ్ల కోసం నల్లమల అడవుల్లోకి వెళతాడు. ఎం.ఎల్. పార్టీలో అజ్ఞాతంలో పనిచేసి అలసిపోయిన మోహిని వీరతో మానసిక బంధాన్ని పెంచుకుని అపురూపంగా అత

నిలో తేనెలా కలిసిపోతుంది. ఆమె అప్పటికే గర్భంతో ఉన్నా, దానికి కారణమైన వాడెవడైనా, ఆ అవసరంలేని స్వేచ్ఛాయుత స్త్రీత్వం ఆమెది. అలాగే తన గర్భంలో శిశువుని ఆమె యెంత ప్రేమించిందో అతనూ ప్రేమించాడు. పెదగురయ్యా లాంటి విప్లవకారుడు పోలీసులకు చిక్కకుండా వాళ్ల తుపాకీ బాయనెట్ తోనే పొడుచుకుంటే వీర వారి లీడరై విప్లవ జోహార్లతో అతణ్ణి సాగనంపాడు. ఓ బిర్సాముండాలా చెంచుల ఆలోచనల్లో తిరుగుబాటు తెచ్చాడు. అడవుల్లోకి ప్రవేశించిన కపట నాగరికతా, ప్రభుత్వ హింసా ఈనాడు చెంచుల్నీ ఆ జాతినీ కల్లోలమయం చేసింది. సామాజిక స్పృహ గల వాని గుండెల్లోంచి ఆయుధాలు మొలుచుకొస్తాయి, ఈ నవల చదివిన తర్వాత.

– జి.నరసింహమూర్తి,
హైదరాబాద్

## అస్పష్ట వర్ణచిత్రం

రూ. 50/–
పొందిన సమీక్ష

క్లుప్తమైన సంభాషణలు, సుదీర్ఘమైన కవితాత్మక వర్ణనలు, అసమగ్రంగా రూపుదిద్దుకున్న మోహిని, చామంతి, స్వప్న పాత్రల తీరుతెన్నులూ వెరసి 'ఆకుపచ్చని గాయం' ఒక అస్పష్ట వర్ణ చిత్రంలా గోచరిస్తుంది. సాగునీటి ప్రాజెక్టుల పుణ్యాన అడవితల్లి ఒడినుండి జారిపోతున్న చెంచుల సమగ్ర బతుకు చిత్రాన్ని ఆకుపచ్చని గాయం సరిగా ఆవిష్కరించలేకపోయింది. కారణం శైలిలోని కాఠిన్యమే. సగటు పాఠకుడి మస్తకానికి రచనలో వ్యక్తీకరింపబడ్డ తాత్విక చింతన, భావ పరంపర ఓ పట్టాన అవగతం కాదు.

చెంచుల ప్రతినిధిగా నిలిపిన పెదమంతయ్య పాత్ర వాస్తవానికి దూరంగా, అసాధారణంగా, అస్పష్టంగా మలచబడింది. భాషలో, భావంలో పెదమంతయ్య పాత్రకు అసహజత్వం ఆపాదించారు రచయిత.

నిర్లిప్తంగా, నిర్వికారంగా, నిస్తేజంగా రోజులు గడపటం లేదా సారా మత్తులో మునిగిపోవడం తప్ప చెంచులకు మరో వృత్తి వ్యాపకం ఉన్నట్లు రచనలో ఎక్కడా తెలియజేయకపోవడం రచయిత చేసిన పెద్ద పొరబాటు. చెంచుల శ్రమైక జీవన సౌందర్యం నవలలో ఎక్కడా ద్యోతకం కాకపోవడంవల్ల వారి కోసం 'వీరా' జరిపిన అవిశ్రాంత పోరాటంపై పాఠకులకు ఆసక్తిగానీ, చెంచుల జీవన గమనంపై ఆర్తిగానీ జనించవు. నిర్వాసితులవుతున్న అడవిబిడ్డల సమస్యకు చివరలో రచయిత సూచించిన పరిష్కారం కూడా తిరోగమన బాటనే పట్టింది.

– యన్.మధుసూదన్ యాదవ్,
నరసరావుపేట

## ముగింపు పేలవం

రూ. 50/–
పొందిన సమీక్ష

ద్వితీయ బహుమతి పొందిన నవల ఆకుపచ్చని గాయం అస్తవ్యస్తమైన నవలకు మరో పేరు.

మొట్టమొదటిగా ఇరవై ఏళ్లపాటు కథానాయకుడు వీర నాగరిక ప్రపంచంలో ఎలా ఎవరి సహాయంతో పెరిగి పెద్దవాడయి పోస్టుగ్రాడ్యుయేషను చదివేటంత స్థాయికి ఎదిగాడు?

రెండవ విషయం రచయిత చెంచుల జీవన విధానం పుస్తకాలలో చదివి నవలగా రాశారు కాని వారిది జ్వరం, ఆకలి లాటి అతిచిన్న సమస్యలకు భయపడి కన్నబిడ్డలను కారడవులలో వదులుకొనే స్వభావం కాదు. ఉంటే అందరం కలిసి ఉందాం, చస్తే

అంతా కట్టకట్టుకు చస్తామన్న సిద్ధాంతం వాళ్లది. మహా మొండి మనుష్యులు ఆదివాసులు. విడాకులు మంజూరు కాకుండానే మోహిని, వీర దంపతులవ్వడం సమాజం హర్షించదు. ఇది అడల్టరీ కేసు కింద వస్తుంది. స్వప్న పాత్ర ప్రవేశపెట్టడం అనవసరం. పాఠకుల జాలికి గురయ్యేటట్లు సృష్టిద్దామనుకొన్న రచయిత ప్రయత్నం అంతగా ఫలించలేదు.

చివరిగా, చిన్నమంతయ్య గుప్పిటినించి నల్ల మిరియాలు కాసిని తీసుకొని జేబులో వేసుకొన్నాడు వీర అన్న వాక్యాలతో నవల ముగుస్తుంది. మేధాపాట్కర్, మమతా బెనర్జీ లాంటి సామాజిక కార్యకర్తలు సైతం ప్రస్తుత పరిస్థితులలో ఏమీ చెయ్యలేక చేతులెత్తేశారు. నిర్వాసితులు ఎప్పుడూ శాపగ్రస్తులే. కారణం ప్రభుత్వం అనుసరిస్తున్న లాఠీచార్జి, బాష్పవాయువు, తుపాకి కాల్పులులాంటి దమననీతి. దేశంలో రావణ కాష్టంలా కాలుతున్న సమస్యని ఇతివృత్తంగా తీసుకొని రచయిత చంద్రశేఖర్ పేలవంగా ముగించడం పాఠకులను నిరాశపరచింది.

**- ఆనందరావ్ పట్నాయక్,**
రాయగడ (ఒరిస్సా)

## ప్రశంసనీయం

రూ. 50/- పొందిన సమీక్ష

ఆకుపచ్చని గాయం చదువుతున్నంత సేపూ మనమొక పర్యాటకుల మైనట్టూ, రచయిత ఓ గైడ్‌లా మన చెయ్యి పట్టుకుని అడవంతా కలియతిప్పి చూపిస్తున్న భావన కలుగుతుంది.

అనేక వ్యయప్రయాసలకీ, త్యాగాలకీ సిద్ధపడ్డ కథానాయకుడు వీర చెంచుల్లో కల్పించలేని బతుకుమీద ఆశనీ, చైతన్యాన్నీ అతి సులభంగానూ, చాకచక్యంగానూ బయ్యన్న సాధించగలగడంలోనూ అడవిబిడ్డల అమాయకత్వమే కనబడుతుంది.

చెంచులు పడ్డ కష్టాల్ని చదివాక చెమర్చని కళ్ళుండవు. అంతేకాక నాగరీకులమనుకునే మనం... జీవితమంతా బ్రతకడానికే బ్రతికే మనం... వాళ్ళనించి నేర్చుకోవాల్సిందెంతో ఉందనిపిస్తుంది.

పనిలో పనిగా రచయిత- మోహిని, వీరకి రాసిన ఉత్తరం రూపంలో రాజకీయపు కుళ్ళుని తూర్పారబట్టడం, (కలెక్టర్ల మీద) కొన్ని వ్యాఖ్యానాలూ అద్భుతంగానూ, నిజాయితీగానూ, సాహసోపేతంగానూ అనిపిస్తాయి.

అయితే, కథలో మోహిని పాత్రని పరిచయం చేసిన తీరూ, ముగించిన తీరూ, వీరకి తాను దగ్గరైన పద్ధతీ హేతుబద్ధంగా లేదనిపించింది.

ఏదేమైనా ఓ సాధారణ నవలలా కాక చాలామందికి తెలీని చెంచుల జీవన విధానాన్ని రచయిత తనదైన శైలిలో అందరికీ పరిచయం చెయ్యడం ప్రశంసనీయం.

**-క్రాంతిమిత్ర, విశాఖపట్నం**

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

# నిరుద్యోగ యువతకు శుభవార్త




# హోలీక్రాస్ అసోసియేషన్


N.G.O's కాలని దగ్గర, వడ్డేపల్లి, వరంగల్-506 370

న్: (0870) 2579107, 2553447, సెల్: 98481 85041, 9908630020.


**త్వ గుర్తింపు పొందియున్న ఈ క్రింది శిక్షణలలో ప్రవేశం కొరకు అర్హులైన వారి నుండి దరఖాస్తులు కోరబడుచున్నవి**

| ). | శిక్షణ సంస్థ | శిక్షణ | కాలము | అర్హత | విద్యార్హత | అనుమతింప బడిన సీట్లు |
|---|---|---|---|---|---|---|
| | సెయింట్‌జాన్స్ స్కూల్ ఆఫ్ నర్సింగ్ | జనరల్ నర్సింగ్ (స్టాఫ్ నర్స్ ట్రైనింగ్) | $3^1/_2$ సం॥లు | స్త్రీలు మాత్రమే | ఇంటర్ (ఏ గ్రూప్ ఐనను) | 45 |
| | సెయింట్‌జాన్స్ M.P.H.W.(F) | MPHW (ANM) | 18 నెలలు | స్త్రీలు మాత్రమే | S.S.C. | 40 |
| | శ్రీ శ్రీ M.P.H.W.(F) | MPHW (ANM) | 18 నెలలు | స్త్రీలు మాత్రమే | S.S.C. | 40 |
| . | ఏషియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ క్లినికల్ టెక్నాలజీ<br>సెల్: 9908630020. | డిప్లొమా ఇన్ మెడికల్ ల్యాబొరేటరి టెక్నాలజీ | 2 సం॥లు | స్త్రీలు పురుషులు | S.S.C. | 20 |
| . | పోలూర్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పారా మెడికల్ సైన్సెస్<br>సెల్: 9908630020. | డిప్లొమా ఇన్ ఆప్తాల్మాలజీ | 2 సం॥లు | స్త్రీలు పురుషులు | S.S.C. | 4 |
| . | పోలూర్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పారా మెడికల్ సైన్సెస్<br>సెల్: 9908630020. | డిప్లొమా ఇన్ మెడికల్ ఇమేజింగ్ టెక్నాలజీ | 2 సం॥లు | స్త్రీలు పురుషులు | ఇంటర్ (సైన్స్ గ్రూప్) | 6 |
| . | పోలూర్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పారా మెడికల్ సైన్సెస్<br>సెల్: 9908630020. | డార్క్ రూం అసిస్టెంట్ | 1 సం॥ము | స్త్రీలు పురుషులు | ఇంటర్ (సైన్స్ గ్రూప్) | 6 |

- రూ॥ 100/-లు M.O./D.D. ద్వారా లేదా స్వయంగా చెల్లించి అప్లికేషన్ మరియు ప్రాస్పెక్టస్‌లను పొందవచ్చును.
- నింపబడిన దరఖాస్తు ఫారం విద్యార్హత, కులము, ఆదాయము, T.C. ఎలక్షన్ కార్డు/ రేషన్ కార్డు జిరాక్స్ కాపీలు నాలుగు పాస్‌పోర్ట్‌సైజ్ ఫోటోలతో జతపరిచి పంపవలెను.

**P.S.CHANDAN**
Administrative Officer

**P.S.R.SABHAPATHY**
Secretary & Correspondent

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RN1/32186/7